# భారతి



1966 జనవరి



కైశిక షట్పద

శ్రీ నోరి నరసింహశాస్త్రి

ఏకాంతం

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

సోమర్ సెట్ మామ్ -
ఆయన కథాప్రపంచం

శ్రీ బుచ్చిబాబు



వ్యవస్థాపకులు:

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక





సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



జనవరి 1966



సంపుటము 43: : సంచిక 1 ;

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1966

# స్వ విషయము

"భారతి"కి 43 వ సంవత్సరము ఆరంభమైనది. నాలుగు దశాబ్దములు పైగా నిరాఘాటముగా సాహిత్యసేవ చేయగలిగినందుకు "భారతి" గర్విస్తున్నది. ఆనందిస్తున్నది. ఇకముందుకూడా ఇతోధికముగా సాహిత్యసేవ చేయగలనను దృఢనిశ్చయముతోను, దృఢసంకల్పముతోను వున్నది. ఆ సంకల్ప సాధనకు రచయితల సహకారము పూర్తిగా లభించగలదని ఆశిస్తున్నది. సహకరించిన వారందరికీ కృతజ్ఞత తెలుపుతున్నది.

# కైశిక షట్పద

### శ్రీ నోరి నరసింహశాస్త్రి

మంగలకైశికా, మధుర
మంజుల షట్పద నీలవేణి, స
ర్వాంగములన్ త్వదీయ మృదు
లారుణ రాగతరంగ మాలికా
సంగతి గూర్పవే, నిభృత
చంద్రకలా ప్రసృతార్ద్ర చంద్రికా
భంగ సుధా ప్రసంగములు
వాకలుగట్ట నెడంద దన్పవే!

మందసమీరు డంగుళుల
మాటికి జక్కిలిగింత వెట్టుచున్
సుందరగంధ లేపనము
చొక్కున మై పులకింప బూసి యా
నందము గూర్చె, చల్లనయి
నా హృదయంబు ప్రసన్న భావముం
జెందెడి, మేళవింపగదె, శ్రీఘను
మంగలకైశికా శ్రుతుల్!

ప్రాచీదిక్సతి దూర దూరముల ను
ద్భాసించు నాత్మేశ్వర
ప్రాచుర్యస్పృహ జాజువారె, నరుణా
ప్త శ్రీ ప్రసంగంబులన్
దోచెన్ రాగసుమాంచలం బయి, కలా
ధూర్వాహగీతీ, సుధా
వీచీ, మోహన కైశికీ, శుచిముఖీ, నేఁ
చేయవే యీయెడన్!

## భా ర తి

మాయామాలవగౌల నిజనని సం
భావించు, సావేరి చె
ల్లీయున్ మోహిని యక్కయుం జెలులు బౌ
ళీ నాదనామక్రియల్
స్వాయత్త స్వరనిత్య శోభనలు ని
న్నర్థింతురే, మన్మనో
ధ్యేయా, బంభర కైశికా, మధువు స్యం
దింపన్ శ్రుతిం జేయవే!

తలలో దాల్చిన పూవవై సురభి గం
ధంబుల్ గుబాళించి స
ల్లలితామ్లాన వినూత్న మాంగలిక క
ల్యాణిం బ్రసారింపవే,
నలినీ నిర్మల విద్యయు జ్జ్వల గాం
ధర్వంబు వర్షించి యౌ
దల, నృత్యచ్ఛశిరేఖ వై యెద సుధా
ధారల్ ప్రవర్షింపవే!

హరుడొక చంద్ర ఖండము శి
రోగ్రమునన్ ధరియించి శ్రీ కృపా
భరిత మనోజ్ఞ చంద్రికల
భక్త హృదంతర ముద్ధరించు, నా
సరణిని మచ్ఛిరోగ్రమున
శారద నిర్మల చంద్రరేఖవై
వరలి, హృదంతరావృత మ
పార తమంబు హరించి తెల్పవే!



# ఏకాంతం

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

ఆనందరావు సిగరెట్ వెలిగించాడు. అగ్గి పుల్లను జాగ్రత్తగా కిటికీగుండా చీకట్లోకి పారేశాడు. వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. పాదరసంలా పరుగెత్తే మనస్సుని చిక్కబట్టే ప్రయత్నంలో నిమగ్నుడయ్యాడు. చదవటానికి ప్రయత్నించి చదవలేకపోయిన ఫైలు చేతులు చాచుకుని ఎదురుచూస్తూ టేబిల్ మీద అలానే వుంది.

మండుతున్న సిగరెట్ కొస వేడిమి క్రమంగా వేళ్లను తాకుతోంది. ఆలోచన పొందుతున్న నిలకడలో మనస్సు తన నీడని తాను చూచుకోగలుగుతోంది. ప్రజ్వలిస్తున్న నిప్పు కణికమీద క్రమంగా ఏర్పడుతున్న మసి వైనం గమనిస్తూవుంటే ఏదో ప్రశాంతి, నిండుదనం..

"మళ్లీ ప్రారంభించారూ! దొంగచాటుగా ఏమిటీ పని?" అన్నది కమల. భార్య రావటాన్ని అతను గమనించనే లేదు. దొంగతనంచేస్తూ పట్టుపడిన చిన్నపిల్లవాడిలాగా, చప్పున సిగరెట్‌ను పారేశాడు ఆనందరావు.

"పాపం ఎంత బిజీగా ఉన్నారో, చప్పుడు చెయ్యకుండా పాల గ్లాసు పెట్టి వచ్చేసెయ్యాలి అని అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాను... తీరా చూస్తే చాలా దీక్షగా చదివేస్తున్నారు, సిగరెట్‌ని ! ఆఁ ! ఏమిటి చెప్పండీ యిది ? ఇదేనా మీ గొప్ప సంకల్పబలం ? ఆమాత్రం నిగ్రహం లేకపోతే ఎలా ? మి ఆరోగ్యం సంగతి మీకు తెలిసుండి కూడా యిలా చేస్తారా ?"

ఆనందరావు ఆమెవైపు బెరుగ్గా చూచి, చిరునవ్వు నవ్వటానికి ప్రయత్నించి, విఫలుడై, పాల గ్లాసుని పెదవులకు అడ్డంగా పెట్టేసుకున్నాడు. కమల చూస్తూ నిలుచుంది. గ్లాసు ఖాళీచేసి మాట్లాడకుండా ఆమె చేతి కిచ్చాడు ఆనందరావు.

"అవెక్కడున్నాయో, అవీ ఇలా యిచ్చెయ్యండి .... మీతో చర్చలు చేసీ, నచ్చజెప్పీ లాభంలేదు ! మీ కేమన్నా తెలీకపోతే కదా నచ్చజెప్పటం ! అన్నీ తెలుసు, కథ మాత్రం మళ్లీ మొదటికే వస్తుంది. .... నిన్న రాత్రి దగ్గుతుంటే, ఏమో వేడి చేసింది కాబోలు అనుకున్నాను గాని, ఈ పని మళ్లీ మొదలెట్టారనే రహస్యం తట్టనేలేదు ! ఎందుకు చెప్పండీ, బాధను కోరికోరి తెచ్చుకోవటం ? మిమ్మల్ని ప్రతి క్షణం కనిపెట్టి ఉండాలంటే నాతరమా? .... పోనీ, ఒక ఉపాయం చెబుతా వింటారా ! ఇలా నా చేతిలో చెయ్యివేసి 'ఇంకెప్పుడూ నీ పర్మిషన్ లేకుండా సిగరెట్ కాల్చను' అని చెప్పండి. అప్పుడు ఆ బాధ్యత కాస్తా నామీద వేసినట్లుగా మీ మనస్సుకి తేలికగా ఉంటుంది... ఎప్పుడైనా మీకంత కోరిక కలిగితే, ఆరోగ్యం బాగుంటే, కాల్చుకోటానికి పర్మిషనూ ఇస్తాను. ఏమంటారు ? అలా చేస్తే బాగుండదూ ?"

"సరే ఆలోచిద్దాంలే, నన్నింక పని చేసుకోనియ్యి."

"ఆ మిగిలిన సిగరెట్లు యిలా యివ్వండి."

"అబ్బ ! గొడవ ! పట్టుకుపో."

ఆనందరావు సొరుగు లాగి అందులోని సిగరెట్ పెట్టె భార్య కిచ్చాడు.

"ఆ చేత్తోనే ఒట్టు కూడా వేసెయ్యండి మరి !"

"ఇప్పుడు కాదు .... ఆలోచిస్తాను."

"ఇంకా ఆలోచించే దేమిటీ ? ఇదివరకే అన్ని తర్జన భర్జనలూ జరిగాయి. ఆలోచన కాదు, ఆచరణ కావాలి .... వెయ్యండి ఒట్టు!"

"ఒట్టుతీసి గట్టున పెట్టి.... Please leave me alone, ఆలోచిద్దాం అన్నానుగా."

"ఆలోచన కాదు, ఆత్మవంచన !" అనేసి కమల వెళ్ళిపోయింది.

అవును, ఆలోచన కేమీ మిగల్లేదు. సిగరెట్ మానెయ్యటానికి అన్నీ గట్టి కారణాలే ఉన్నాయి. తన దేహ తత్త్వమూ సిగరెట్‌కు వ్యతిరేకమే ! తన బాధ్యతా, భవిష్యత్తూ అన్నీ బలమైన కారణాలే ! కాని తన మనస్సుమాత్రం ఎందుకని సిగరెట్ వైపు మొగ్గుతోంది? తన సంకల్ప బలానికి ఎందుకు బలం లేక పోతోంది? ఎందుకు?

ఆనందరావు కిటికీదగ్గరకు వెళ్ళి చీకట్లోకి చూస్తూ నిల్చున్నాడు. ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయ్.......

తనకప్పుడు తొమ్మిదేళ్ల వయస్సు. రాత్రిళ్ళు ఏవేళనో మెలకువవచ్చి కళ్ళు తెరచిచూస్తే, చిమ్మచీకట్లో చిన్న డేంజర్ సిగ్నల్‌లా ఎర్రగా మెరుస్తూ నిప్పుకళిక రహస్యంగా ఉదయించిన ఎర్రగులాబీమొగ్గలాగా ఒక చోటి నుంచీ మరో చోటికి ఎగిరే వింత కీటకంలాగ కనిపించేది. గదిలో పల్చగా ఆవరించిన ఒక ఘాటు వాసన ఉద్రేకాన్ని కలిగించేది. కుతూహలాన్ని అణుచుకోలేక రహస్యాన్ని చెప్పలేక బరువుగా గుండెల్లో కలిగే ఉద్వేగంలాంటి ఉద్వేగం కలిగేది. ఆ నిప్పు కళిక నాన్నగారు చీకట్లో పడుకునే కాలుస్తున్న సిగరెట్ కొస అని సగం నిద్ర సగం మెలకవగా ఉన్న ఆ సమయంలో గుర్తు వచ్చేదే కాదు ! పగలు నాన్నగారు మామూలుగా సిగరెట్ కాలుస్తూండటం చూచి, రాత్రి అనుభవం జ్ఞాపకం ఉండి, ఒక్కోసారి రెండింటికీ పోలిక, సంబంధం ఊహించినా అది నిజమనిపించేది కాదు. పగటి కాంతిలో సిగరెట్ పీలగా తెల్లగా ఉండే అల్పమైన వస్తువు! దాని తాలూకు పొగవాసన కూడా ఎబ్బెట్టుగా ఉండేది !

నాన్నగారు చండశాసనుడు ; ఆయన చేసే పనులన్నీ పిల్లలకు నిషేధం. ఆయన చెయ్యలేని పనులు వాళ్లకు విధులు. అందువల్లే ఆయన తన జీవితంలో గడిచి గట్టెక్కలేని స్కూలు ఫైనలు పరీక్ష పిల్లలందరిచేతా ప్యాస్ చేయించారు. తనని ఎం. ఏ. పట్టభద్రుణ్ణి చేశారు. ఆయన సంపాయించినంత డబ్బు మాత్రం తను ఏనాటికీ సంపాయించలేడు. ఆయన తిరిగినన్ని ఊళ్ళూ తను తిరగలేడు. ఆయన కుండినంత మంది స్నేహితులూ తనకు లేరు. ఆయన ఇరవై నాలుగ్గంటల్లో కాల్చినన్ని సిగరెట్లు తను వారం రోజుల్లో కూడా కాల్చలేడు. ఇలా ఆయనకీ తనకీ ఎక్కడా పోలిక లేదు ! పోలిక ఉన్నదల్లా ఒక్క సిగరెట్ కాల్చటమే ! అదీ ఆయన యిష్టానికి విరుద్ధంగా, వద్దన్న పని చెయ్యటం ద్వారా, ఏర్పడిన పోలికే !

అయిదో ఫారం చదువుతూ ఉండగా మిత్రుడితో కలిసి ఒక హిందీ సినిమాకి వెళ్ళాడు. సినిమాకంటె ఎక్కువ ఉత్సాహాన్ని కలిగించిన సంగతి మిత్రుడు జేబులో నుంచి సిగరెట్ తీసి వెలిగించటం. పెదవుల్ని ముందుకు సాచి, సున్నా చుట్టి అలా ఏర్పడిన సన్నని సందులోంచి పొగని సూటిగా వెలుపలికి ఊదుతున్నాడు.

సినిమా ప్రొజెక్టరు నుంచీ తెరమీదికి ప్రసరించే వెలుగు కూడా సరిగ్గా అలానే ఉంది.! మిత్రుడు వదులుతున్న సిగరెట్ పొగ ప్రొజెక్టరు నుంచి ప్రసరిస్తున్న కాంతిలో లీనమౌతూ దానికి వన్నె చిన్నెలు దిద్దుతూ ఉండటం ఎంతో గొప్పగా ఉంది. తనకూ అలా చెయ్యాలని కోరిక గలిగింది. మిత్రుడి నడిగి సిగరెట్ పుచ్చుకుని కాల్చే ప్రయత్నం చేశాడు. ఆ ప్రథమ ప్రయత్నము తృప్తికరంగా లేదు కాని సిగరెట్ కాల్చి నాన్నతో సమానత్వం సాధించినందుకు గర్వమే కలిగింది !

ఇంట్లో అడుగు పెట్టగానే నాన్న వేసిన ప్రశ్న : "ఏం సినిమా బాగుందా ?"

"బాగుంది కాని సినిమా అర్థంకాలేదు"

చెంప ఛెళ్లుమన్నది. సినిమా అర్థం కాలేదంటేనూ ఇంత కోపమా నాన్నగారికి! అనిపించింది. కాని సంగతి అది కాదు !

"ఏమిట్రా నీ నోరు వాసన ? తుంట బీడీలు ప్రారంభించావట్రా వెధవా ?"

"కాదు .... సిగరెట్"

"నీకు డబ్బెక్కడిదీ ?"

"స్నేహితు డిచ్చాడు."

"ఎవడ్రా స్నేహితుడు ! ఈ బీడీ సిగరెట్ స్నేహాలు మానెయ్ ...."

తర్వాత చాల రోజుల దాకా సిగరెట్ వెలగలేదు .....

బి. ఏ. చదువుతున్నాడు పట్నంలో. సినిమాహాల్లో సిగరెట్ అప్పటి కింకా నిషేధం కాలేదు. సినిమా చూస్తూ సిగరెట్లు కాలుస్తున్నారు మిత్రులు. ముందువరుసలోని అమ్మాయిల మీదికి పొగ ఊదుతూ, అన్యాపదేశంగా ఛలోక్తులు విసురుతూ సరాగా లాడుతున్నారు. తనూ సిగరెట్ వెలిగించాడు. చేతి రుమాలు అడ్డం పెట్టుకున్న ఆ అమ్మాయి ముసిముసి నవ్వులూ, పక్క చూపులూ, పైట సర్దుకోవడాలూ, మసక చీకట్లో హుషారు కలిగిస్తున్నాయి. సిగరెట్‌కీ పుంస్త్వానికీ గల సంబంధం విశిష్టంగా అనుభవానికి వచ్చింది ఆరోజునే !

రెండో ప్రపంచ యుద్ధం ముగిసింది. వైమానికదళంవారు పట్టణంలోని పౌరులను వివిధ సంస్థలనుంచీ ప్రదర్శనకు ఆహ్వానించారు. కాలేజీలో ఫైనలియర్ విద్యార్థుల్లో వెళ్ల దలచుకున్నవారిని తొమ్మండుగురిని చీట్లువేసి ఎన్నికచేసి కాలేజి ప్రతినిధులుగా పంపారు. అదృష్టవశాత్తు తనకూ అవకాశం లభించింది. స్త్రీల కళాశాలనుంచి విద్యార్థినుల బదులు అధ్యాపకురాండ్రే తయారై తొమ్మిదిమంది వచ్చారు. అతిథుల్ని జంటలుగా చేసి పదిహేను నిముషాలు విమానంలో నగరంమీద త్రిప్పారు. విమానంలో ఒక ముప్ఫయి ఏళ్ల వివాహిత, స్త్రీల కళాశాల లెక్చరరు, తన ప్రక్కన కూర్చోవటం తటస్థించింది. తర్వాత టీపార్టీలో ఆమెతో మరి కొంత పరిచయ మేర్పడింది. టీ తర్వాత తను సిగరెట్ వెలిగించాడు. ఆమె అనుమతి అడగడం మరిచాడు.

"మీరు సిగరెట్ కాలుస్తా రనుకోలేదు నేను" అన్న దామె.

"సారీ. మీకు సిగరెట్ పొగ అంటే పడదు కాబోలు."

"అదేమీ కాదు. మావారు కాలుస్తారు. కాని మీరు నాకంటే చిన్నవారు. మిమ్మల్ని చూస్తే ఎందుకో కాలుస్తారనిపించలేదు."

"జీవితంలో అనుకోనివి ఎన్నో జరుగుతూ ఉండటం, అప్పుడు కాస్త ఆశ్చర్యపడుతూ ఉండటం నాకు తరచు అనుభవమే,

మీసంగతి తెలీదు గాని! మీకు 'షాక్' కలిగిస్తే క్షమించండి.'' అన్నాడు.

''అబ్బే, అదేమీలేదు .... ఎందుకైనా మంచిది, ముందు అనుమతి తీసుకోవటం భావ్యం; మర్యాద; అని అలా అన్నాను'' అంటూ ఆమె నవ్వేసింది. ''ఫరవాలేదు, యిప్పుడు మనం స్నేహితులం, చిన్నా పెద్దా ఏమీ లేదు'' అన్నది మళ్లీ.

ఆ సంభాషణ ఎన్నోసార్లు తనకు జ్ఞాపకం వచ్చింది. జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఏమిటో హుషారుగా ఉంటుంది.

''ఎందుకైనా మంచిది, ముందు అనుమతి మతి తీసుకోవటం భావ్యం''.... అన్న మాటలే క్రొత్త పెళ్లికూతురు కమల కూడా అన్నది— మొదటిసారిగా ముద్దెట్టుకున్నప్పుడు, ఆమె నోట్లోంచీ జారిన ముత్యాలూ అవే !

కానిఆడవాళ్లనుంచీ అనుమతి పొందటము అంత సులభమా !

కమలకు సిగరెట్ పొగ అంటే ఏవగింపు ఏమీ లేదు. ఎటొచ్చీ సిగరెట్ మూలంగా ఆరోగ్యము పాడవటాన్ని కమల ఆమోదించదు. న్యాయమే. భర్త ఆరోగ్యం సంగతి భార్యకు కాకపోతే మరెవరిక్కావాలి? కమలకు తనమీద సర్వాధికారం ఉంది!

ఆనందరావు తిరిగి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

అతని మనస్సు అసంతృప్తితో కల్లోలంగా ఉంది. చదువు, ఉద్యోగం, పెళ్లి, సంతానము—ఈ మెట్లన్నీ ఉత్సాహంగా ఎక్కినతర్వాత జీవితంలో మిగిలేది : హోదా, డబ్బు, ఆరోగ్యము అనే వాటిని గూర్చిన తాపత్రయం మాత్రమేనా ? అవైనా తీరా చూస్తే ఎవరి కోసం? తన కోసం కావు! పెళ్లాం పిల్లలకోసం, వారి భవిష్యత్తు కోసం! అంటే నలభై దాటాక వ్యక్తిలో మిగిలే 'స్వార్థం' ఏమీ ఉండదు; అది కేవలం 'కుటుంబ స్వార్థం.'—అందువల్ల కమల సలహా చెప్పినట్లు, ఆమె చేతిలో ఒట్టు వేసి ప్రమాణం చేస్తే, ఆరోగ్యానికి శత్రువైన సిగరెట్ గొడవ తనకు శాశ్వతంగా వదలిపోతుంది! కాని అలా చెయ్యటానికి ఎందుకో తనకు ఇష్టం కలగటంలేదు! స్థిమితంగా ఆలోచిస్తేనే తప్ప ఆ ప్రశ్నకు సరియైన సమాధానం లభించదు. ఈ ఊహలూ, జ్ఞాపకాలూ అలజడి కలిగిస్తాయి. మనస్సు ప్రశాంతంగా ఉండాలి ఆలోచననకి! .... అప్రయత్నంగా ఆనందరావు సొరుగు లాగి వెదికాడు—సిగరెట్ కోసం! ఎక్కడుందీ? కమల పట్టుకు పోయింది.

రెండు రోజుల తర్వాత రాత్రివేళ దగ్గుతూ, నిద్ర రాకుండా దొర్లుతూ ఉన్నాడు ఆనందరావు.

''నేను చెప్పిన సలహానూ మీ కక్కర లేదు. మీరు స్వయంగానూ మానుకోలేరు. అయితే ఏం చేద్దామని మీ ఉద్దేశం ? ఏమిటీ మొండితనం ?'' అన్నది కమల.

''అవును, రెండూ చెయ్యలేను........ కొన్నాళ్లు నన్నిలా ఉండనివ్వరాదూ ! నిత్యమూ దొంగను పట్టుకుని శిక్షించినట్లు శిక్షించకపోతే నేం?'' అన్నాడు విసుగ్గా.

''మీకు నేనంటే అంత కంటకింపుగా ఉందన్నమాట ! నేను చెబుతున్నదాంట్లో మీకు కష్టమైన దేమిటీ? మీ భారం పంచుకోవాలనే గదా ఒట్టెయ్యమన్నాను!''

ఆనందరావు కాస్సేపు మౌనంగాఉన్నాడు. చివరకు నవ్వేస్తూ—

''ఆయనే ఉంటే మంగ లెందుకూ? అన్నట్లు వేసిన ఒట్టు నిలుపుకునే సామర్థ్యమే

వుంటే ఏకంగా సిగరెట్లు మానెయ్యటమే చేద్దును గదా!'' అన్నాడు.

కమల జవాబు చెప్పలేదు.

మరుసటి రోజు సాయంత్రం ఆనంద రావు క్లబ్బునుంచి తిరిగి వచ్చేటప్పటికి అతని మంచం చదువుకునే గదిలోకి మార్చబడి ఉంది.

''దగ్గు తగ్గేదాకా మీరీ గదిలో పడు కుంటే బాగుంటుందని మార్చాను'' అన్నది కమల.

కమల పట్టుదల మనిషి. గెలిచేదాకా యుద్ధం సాగిస్తూనే ఉంటుంది. అది ఆమె విశిష్టత. తనలో మార్పు తేవటానికి ఆమె చేస్తున్న ప్రయత్నం సరికాదని ఎవ రనగలరు? ఆనందరావు ఏమీ మాట్లాడలేదు.

ఆ రాత్రి దీపం తీసేసి చీకట్లోకి చూస్తూ పడుకున్నాడు. టీ కప్పులో తుపానులా వచ్చింది యీ సిగరెట్ సమస్య. దాని పరిష్కారానికి, కమల తనమీద ప్రయోగించిన ఆయుధం ప్రస్తుతం తను అనుభవిస్తున్న ఏకాంతం.....

ఏకాంతం అంటే ఎవరికీ యిష్టం ఉండదు. ఏకాంతానికి అర్థంలేదు! జీవితానికి మాత్రం అర్థం ఉందా ? ఆ ప్రశ్నకు జవాబు నీతి, ప్రేమ, అధికారం, బాధ్యత, మర్యాద, డబ్బు, ఆరోగ్యం అనే విలువలు—అన్నీ ఏకాం తానికి వ్యతిరేక మైనవే ! అవి యితరులతో మనిషికి గల సంబంధాన్ని రకరకాలుగా నిర్వచిస్తాయి! ఏకాంతం అంటే యితరులతో సంబంధములేని స్థితి. కమల కంటె సన్నిహితులు తన కెవరూ లేరు. ప్రేమతో, బాధ్యతతో, అధికారంతో, భర్త ఆరోగ్యంకోసం ప్రయత్నిస్తున్న కమలకూ తనకూ గల సాన్నిహిత్యం కూడా ఒక సరిహద్దుకు వెలుపలే ఉన్నది. ఏకాంతం ఆ సరి హద్దు. ఆమె ఎంత దగ్గరగా వచ్చినా, తనతో ఏమి పంచుకున్నా, తన ఏకాంతం తనదే ! విచిత్రంగా లేదూ! మనిషి ఏకాంతానికి అర్థం ఉందా? లేదా? యోగులూ, ఋషులూ ధ్యాన ముద్రలో, సమాధ్యవస్థలో తమలో తాము అన్వే షించేది కూడా ఏకాంతం కాక మరేమిటి ? ఏకాంతం సామాజికమైన విలువ కాదు; కాదని దాన్ని త్రోసిపుచ్చటమేనా? దానికి జీవితంతో సంబంధంలేదా ?

ఆనందరావు కేమీ పాలుపోలేదు. సిగరెట్ వెలిగించాడు.

సిగరెట్ కాలుస్తూండగా ఆనందరావుకు అర్థం స్ఫురించింది. హేతువాదం దృష్ట్యా, ఆరోగ్య సూత్రాల దృష్ట్యా, బాధ్యత దృష్ట్యా వదలిపెట్టవలసిన సిగరెట్‌ని తను ఎందుకు వదలిపెట్టలేకుండా ఉన్నాడో కూడా అర్థం తెలిసి వచ్చింది—

చీకటిలో మెరుస్తూ తన ఊపిరితోపాటు స్పందించే ఈ సిగరెట్ కొస, ఈ నిప్పు కళిక, వికసించి ముకుళించే యీ ఎర్ర గులాబీ మొగ్గ, ఇది తన ఏకాంతం ! తనలోని 'తన' స్వరూపం. జీవితానుభవాలు అనే పూసలకి అర్థాన్నీ ఆకారాన్నీ కల్పిస్తున్న అంతస్సూత్రం ఏకాంతం.

సిగరెట్ కాలుతూనే ఉంది

---

# 1980 బంగారం బాండ్లు విరివిగా కొనండి

———— oOo ————

## 15 ఏండ్ల తరువాత బాండ్లకు బంగారం తిరిగి లభిస్తుంది

పది గ్రాములకు 2 శాతం వడ్డీ గిట్టుబాటౌతుంది



దీనికి వృత్తిపన్ను. సంపద పన్ను,
పెట్టుబడి లాభాలపన్ను ఉండవు.



నాణాల రూపంలోగాని, నగల రూపంలోగాని మరే యితర రూపంలోగాని చెల్లించవచ్చు.



# దేశ రక్షణకు బంగారాన్ని ఇవ్వండి

# శాసనసభ్యుల బాధ్యతలు

## శ్రీ తెన్నేటి విశ్వనాథం

శాసనసభ్యుల మొదటి బాధ్యత—ప్రభుత్వం అనగా కార్యవర్గమువారు రాజ్యాంగ ప్రకారముగా ప్రజలకున్నటువంటి హక్కులను ఏవిధంగానూ అణచివెయ్యకుండా ప్రజలకు హితమైన కార్యములే చేయుచుండునట్లు చూడటము. రెండవది—అదేవిధంగా శాసనసభ్యులకున్న హక్కులను కార్యనిర్వాహక వర్గమువారు హస్తగతం చేసుకోకుండా చూడటం. మూడవది—ప్రభుత్వంవారు తెచ్చే శాసనాలు, తీర్మానాలు రాజ్యాంగబద్ధంగా ఉన్నావా లేవా, ప్రజాస్వామ్య సూత్రానుసారంగా ఉన్నవా ? లేదా? అని చూడటం. ఆతర్వాత పబ్లిక్ అకౌంట్సుకమిటీ, ఎస్టిమేట్సు కమిటీల ద్వారా, అకౌంటెంట్ జనరల్ ఆడిట్ రిపోర్టు మూలంగా ఇచ్చిన సహాయం పుచ్చుకొని శాసనసభచేసిన కేటాయింపుల ప్రకారంగాను, క్షుణ్ణంగా వృధాపరచకుండా బడ్జెటు సమావేశంలో చెప్పిన పనుల నిమిత్తమై ఖర్చు జరుగుతున్నదా లేదా అని చూడటం.

తర్వాత తమకు జీవనమిచ్చిన తమ నియోజకవర్గాల్లో అయితే నేమి, దేశం మొత్తంపై ఉండే ప్రజాసమస్యలను బిల్లుల రూపంగాను, తీర్మానాల రూపంగాను, శాసనసభ జరుగుతున్నంతకాలము ప్రశ్నల రూపంగాను, ఉపన్యాసాలద్వారానున్నూ ప్రభుత్వం దృష్టికి తీసుకువచ్చుట. ప్రభుత్వము యొక్క చర్యలు సమంజసముగా, శాసనబద్ధముగా ప్రజలకు హితకరముగా ఉన్నవా? లేవా? అని చర్చ చేయుటం. ఈ పైన చెప్పినవన్నీ అంతమంది సభ్యులూ గూడా నిర్వహించవలసిన బాధ్యతలే.

అయితే యిప్పుడున్న పార్టీ పద్ధతులనుబట్టి ఈ పనియొక్క హెచ్చు భారము ప్రతిపక్ష సభ్యులపైని పడుట పరిపాటి అయినది. నిర్మొహమాటముగా, నిస్వార్థముగా, ప్రజలయొక్క శ్రేయస్సు దృష్ట్యా ఎవరైతే పై విషయములను శాసనసభ ముందు తేగలరో, వారు వారి బాధ్యతలను సక్రమముగా నిర్వహించిరని మనము అనుకొనవలెను.

ఇవి ఇలా ఉంటూండగా వేరైన బాధ్యతలు గూడా శాసనసభ్యులకు కలవు. అందులో మొదటిది—ఏ నియోజకవర్గంనుండి శాసనసభ్యుడు ఎన్నికైనాడో ఆ నియోజకవర్గంలో ప్రజలకుగల అవసరములను పదేపదే తెలుసుకొని ప్రభుత్వము దృష్టికి తీసుకువచ్చి సాధించుటకు నిష్కాను యత్నము చేయవలెను. అట్లు చేసిన ఎడలనే కృతార్థత. పైన చెప్పిన విధులు అటులుండగా, శాసనసభ్యునియొక్క దినచర్య చూచినట్లయితే ఈ కాలమందు మీద చెప్పిన క్రమమునకు కొంచెము భిన్నముగానే కనిపించవచ్చు. ఎంతవరకు భిన్నముగా ఉండునో, అంతవరకు శాసనసభ్యుని యొక్క ప్రతిష్ఠ తగ్గుదలలోకి వచ్చుటకుఅవకాశము ఉండును.

దినచర్యలో ప్రథమ ఆశ్వాసము—శాసనసభ్యుడగుటచేత అనేకులు ఏరి కొక కార్యసాధనాశక్తి గలదన్న భ్రమతో వీరిదగ్గరకు వత్తురు. అట్టి వారికి మనస్సు నొప్పికలుగచెయ్యకుండా, తనకు శక్తి చాలదన్న విషయము ప్రస్ఫుటము చెయ్యకుండా, వచ్చిన వారి మనస్సునకు కొంత పూరడింపు కలుగచెయాలి. ఒకప్పుడు వారు తెలిపే కోరికలు శాసనసభ్యునియొక్క కార్యవృత్తములోనివి గాకపోవచ్చు. ఉదాహరణకు—ఉద్యోగస్తులయొక్క బదిలీలు ;—ప్రమోషన్లు మొదలైనవి. ఇవి శాసనసభ్యులు కలుగజేసుకోకూడదని ప్రత్యేకమైన ఆంక్ష ఉన్నది. అయినప్పటికీ కొందరు శాసనసభ్యులు చెప్పినట్లయితే విని వారు కోరింది చెయ్యడానికి మంత్రులు అప్పుడప్పుడు ఒప్పుకోవడంవల్ల ఈ భ్రమ అందరకూ కలుగుచున్నది.

రెండవది—కొంతమంది తెలియక తమయొక్క ఆతురతలో కొన్ని అపచారములు చేయించే కోర్కెలతో వత్తురు. ఉదాహరణకు—ఒక కేసు విషయమై—

మేజి(స్ట్రేటు నీకు తెలిసినవాడే గనుక ఒక్కమాట చెవిని వెయ్యవలసింది—అని. ఒక ఉద్యోగం విషయమై వచ్చి, సర్వీసు కమిషను ఇంటర్వ్యూ రెండు మూడు రోజుల్లో జరుగగలదనిన్నీ, మావాడు చాలా తెలివైనవాడు, అయినా మీరు టెలిఫోన్లో ఒకమాట చెప్పినట్లయితే నాకీ కుటుంబ భారం తగ్గుతుందనీ కోరేవారు కొందరు. ఇవి రెండు రకాల కోర్కెలు. ఇది వదిలిపెడితే మరికొంతమంది కలుసుకుందుకు వచ్చేవారు లైసెన్సులు, పర్మిట్లు మొదలుగా గలవి ఇప్పించమనేవారు. ఇంతేగాక ఇప్పించిన ప్రయోజనం శాసనసభ్యుడో—అతని కుటుంబమో తప్పక పొందగలదని సూచించే రకం ఒకటి. నా అదృష్టము కొద్దీ ఈ మూడోరకంవా రెన్నటికీ నా దగ్గరకు రారు. మొదటి రెండు రకాల్లోనివారూ గూడా ప్రప్రథమంలో తెలియక ఒకరో ఇద్దరో వచ్చేవారు గాని ఇప్పుడు అటువంటివారూ రారు. అయినా నీరందరికన్న ముఖ్యులు నాల్గవ రకంవారు. వారు కేవలం తమ స్వంతానికి ఏదిన్నీ కోరుతూ రారు. ప్రభుత్వంలోగల లోటుపాట్లు చూపించడానికిగాని, ప్రభుత్వముయొక్క కార్యంవల్ల ప్రజలకొచ్చే కష్టనష్టము చెప్పడానికిగాని, ప్రజోపయోగకరమైన స్కీములు, ప్రాజెక్టులూ కొరకు కాని శాసనసభ్యులదగ్గరకు—పలుకుబడి ఉన్నదని ప్రతీతి ఉన్నట్లయితే—ఇటువంటివారు ప్రొద్దున్నేవచ్చి—"ఆలస్యంగావస్తే అంతా ఉంటారు; మీకు బాధ అవుతుంది; అంచేత తెల్లవారేసరికి వచ్చాను" అని చెప్పే వారుగూడా ఉంటారు. కొంతమంది శాసనసభ్యులు ఇటువంటి కోర్కెలను సాధించుటయందు ఉత్తీర్ణత సంపాదించుటగూడా గలదు.

అయితే నీవు ఇటువంటి వారికి కార్యం చెయ్యగల్గినా, చెయ్యలేకపోయినా, వారి మనస్సును నొప్పించకూడదు. వారియొక్క ఆత్రతపై తెలిసియో, తెలియకయో వస్తారు. ఒక్కొక్కప్పుడు దూరప్రాంతంనుంచి గంపెడాశతో వస్తారు. అందుచేత తిరిగి ఎన్నికలకు నుంచోవలసి వస్తుందిగదా అన్నటువంటి భావంతో గాకపోయినా నాగరికత, పెద్దమనిషితరహాతో వ్యవహరించడం అన్నది ప్రతి మానవునికిన్నీ మంచిది. ప్రజాప్రతినిధిగాఉన్న శాసనసభ్యునికే, ముఖ్యంగా మంచిది; అవసరమున్నూ. నిజానికి రాజులు పోయింతర్వాత రాజ్యం ప్రజల్లోకివచ్చి శాసనసభ్యులే రాజ్యవారసులైనప్పుడు రాజునకు ఉండవలసిన మంచిలక్షణములన్నీ శాసనసభ్యునికి ఉండితీరవలెనుగదా!

## ద్వి తీ యా శ్వా స ం

ఈ పనులు ఎవరైనా అడిగినవి చేస్తానని ఒప్పుకున్న తర్వాత శాసనసభ్యులు చెయ్యవలసిన కార్యక్రమము చాలానిపుణతతో జరుగవలెను. అందులోఒకటి, ప్రభుత్వపు పొరపాటుల విషయమై ఎవరైనా ఒకరు ఒక కాగితము ఇచ్చారనే అనుకుందాము. లేకపోతే టపాలో వ్రాశారని అనుకుందాము. వారికి "మీ ఉత్తరం అందినది— తగు చర్య తీసుకుంటున్నాను" అని జవాబు వ్రాయడం మొదటి విధి. రెండవది, అత్యవసరమైన విషయమైతే వెంటనే గవర్నమెంటు కార్యదర్శికిగాని, మంత్రికిగాని ఆ విషయమై ఒక ఉత్తరము వ్రాయాలి. మూడు—ఇది శాసనసభముందు తేవలసినటువంటి విషయమైనట్లయితే, అనగా శాసనసభ మొత్తంపైని ఇటువంటి విషయముపై అభిరుచి ఉండగలదు అని తోచినట్లయితే, ఆ విషయమై శాసనసభకు ప్రశ్నలు గూడా వ్రాసి పంపించాలి. శాసనసభ్యునకు వచ్చిన ఒక ఉత్తరమునకు మూడు పనులు ప్రప్రథమంలోనే శాసనసభ్యుడు చెయ్యవలసి ఉంటుంది.

ప్రజలకు ఉపయోగకరమైన ప్రాజెక్టులు స్కీముల విషయమైగూడా ఈ విధముగానే చెప్పిన వారికి అందినదనే సమాధానము, మంత్రి కార్యదర్శులకు ఉత్తరము, శాసన సభకు ప్రశ్నలూ మూడు కార్యములుగూడా చెయ్యవలసినవే. ప్రభుత్వ కార్యంవల్ల కష్టనష్టాల' విషయమైగూడా ఇదేవిధంగా చర్య తీసుకోవాలి.

## మూ డో ఆ శ్వా స ం
## శాసనసభా సమావేశం

నియమిత కాలనిర్ణయము ప్రకారము శాసనసభలకు హాజరై మొదటినుంచి చివర వరకూగూడా అక్కడ కూర్చొనవలెను. ఏ సమయములో ఏ వివాదాంశం ఆవిర్భవిస్తుందో ముందుగా వూహించుకోవడం కష్టం గనుక కనిపెట్టుకొనే ఉండవలెను. ప్రశ్నోత్తర సమయాల్లో చురుగ్గాను, శ్రద్ధగాను ఏ సభ్యుడు ఏ ప్రశ్నవేయుచున్నాడో, ఏ మంత్రి ఏ ప్రత్యుత్తరము ఇచ్చుచున్నాడో, సభాధ్యక్షుని కన్ను, చెయ్యి ఏవిధముగా కదులుచున్నవో జాగ్రత్తగా చూచుచూ, తాను ఏ సమయంలో ఏ ప్రశ్న వేయాలో, ఏ మాట చెప్పాలో ఎప్పటికప్పుడు శ్రద్ధగా ఉండాలి. శాసనసభా

కాలము నదీ ప్రవాహము వంటిది. క్రిందికి ప్రవహించిన నీటిబొట్టు వెనుకకురాదు. అదేవిధముగా క్షణము దాటిన ఎడల నీ వడగ వలసినదీ, చెప్పవలసినదీ సమయము అయిపోవును. తిరిగి వెనుకకురాదు.

ఈ తొందరమధ్య ఎవరైనా స్నేహితులు, పెద్దలు 'ఒక్కమారు అవతలకు రావలసింది' అని చీటీ పంపిన ఎడల చోటువదలి కదలుట ఎంత కష్టమైనా ఒక్కొక్కప్పుడు కదలవలసి వచ్చును. ఇటువంటి నిర్బంధ సమయమందుగూడా శాంతముగా శాసన సభ్యుడు ఉండక పోయినట్లయితే చీకాకులో పడతాడు.

శాసనసభలో ముఖ్యంగా కావలసినటువంటిది మనశ్శాంతిమాట ఎల్లాఅన్నా—మాట శాంతి. ఒకప్పుడు మంత్రులు తెలుసో తెలియకనో కోపంగా మాట్లాడినా, సభ్యుడు తన సమతను పోగొట్టుకోకూడదు. 'జితే జిహ్వే సర్వం జితం భవతి' అని పెద్దలు చెప్పిన సూక్తి. అనగా—నీ జిహ్వను గెలిచిన సర్వమునూ గెలువ గలవు అన్నది దీని భావము. ప్రశ్నోత్తరాల సమయం అయిన తర్వాత ప్రభుత్వంవారు తెచ్చిన బిల్లులుగాని తీర్మానాలుగాని ఉండగలవు. బడ్జెటు సమయంలో అటువంటివి ఉండవు. ఆ సమయంలో సాధారణంగా హెచ్చుమంది శాసనసభ్యులు ఇంతో, అంతోమాట్లాడుటకు యత్నం చేస్తారు. ఎవరు మాట్లాడినప్పటికీ సగౌరవంగా వినడమనేది ప్రతి శాసనసభ్యునియొక్క బాధ్యతలలో ఒక ముఖ్యమైన బాధ్యత. దూరప్రాంతం నుంచి వచ్చి ప్రత్యేకంగా ఆయన మాట్లాడినప్పుడు ఏదైనా ఒక విషయం మనకు తెలియనిది వారు చెప్పే దాంట్లో ఉండవచ్చు. అందుచేతనే ఎవరు చెప్పినా జాగ్రత్తగా వినాలి. తర్వాత ప్రతిపక్షంలో ఉన్నటువంటి వారికి, ప్రభుత్వానికి ఎప్పుడూ ప్రతికూలంగా మాట్లాడటమే వారి పని అని ఒక భావం ప్రభుత్వపక్షంలోని వారు కలుగజెయ్యడం సహజం. ఆ విధమైన వాతావరణం కల్గించడం వారికి లాభంకూడా. అంచేత ప్రతిపక్షంవారు ఏమిచెప్పినా ప్రతిపక్షంవారు ఇలా చెప్పక తప్పదుగదా అని వారు అనివేస్తే మంత్రులకు తమవైపున ఉన్న సభ్యులకు ఏ విషయమూ వివరమూ చిక్కకుండానే సులభముగానే తప్పుకునేందుకు వీలవుతుంది.

గత మూడు నాలుగు సంవత్సరములు మంత్రివర్గమువారు తరచుగా ఈ ఆయుధాన్ని ప్రయోగిస్తున్నారు. అదనపు భూమిశిస్తు చట్టముపై ప్రతిపక్షంలోని అన్ని పార్టీలవారు కలసి ఎంత సహేతుకంగా అభ్యంతరాలు చెప్పినప్పటికీ మంత్రివర్గమువారు సులభముగా దానిని 'ప్రతిపక్షంవారు ఇలాగే చెబుతారు' అని తేలిగ్గా త్రోసిపుచ్చినారు. నూటికి 70 శాతం అయిన బీదప్రజకు దానివల్ల ఏమి హాని కలుగుతుందో వారు ఆలోచించవలసిన అవసరం లేకపోయినది. శాసనము అశాస్త్రీయంగా ఉన్నదని చెప్పిన విషయాలు కూడా వారు ఆలోచించ నవసరం లేకపోయింది. ఏమంటే ప్రతిపక్షంవారు చెప్పారంటే పోయె.

కాని మూడేళ్లయిన తర్వాత ఆంధ్రప్రదేశ్ హైకోర్టువారు ఆ శాసనంయొక్క నిజస్వరూపాన్ని బైటపెట్టారు.

## నాల్గో ఆశ్వాసం

శాసనసభలు జరుగుతున్నపుడు సభానంతరం శాసనసభ్యుని గదిలోకి వచ్చేటటువంటి ప్రేక్షక మిత్రులు అందర్నీ శాసనసభ్యుడు అర్థం చేసుకోవాలి; అనునయించాలి. వారు చెప్పేదానివల్ల లాభం పొందాలి. స్థానికంగాగాని, మాండలికంగాగాని జరిగే సభలకు రావలసిందని ఆహ్వానిస్తే అన్నీగాకపోయినా కొన్ని ఆహ్వానాలైనా తప్పక అంగీకరించాలి. శాసన సభ జరుగుతున్న కాలంలో శాసనసభ్యుడి మెదడు పదును పెట్టిన కత్తి మోస్తరు, నిశితంగా ఉంటుంది. అవగాహన చేసుకొనేలోగా నెలరోజులు చాలని ఏదైనా విషయాలుఉంటే శాసనసభ జరుగుతున్నపుడు తెలిసిన వారువచ్చి చెవిన ఒక మాట వేసేసరికి అవి వికసించిన పువ్వులాగ వెంటనే ద్యోతకం అవుతుంది.

## అయిదో ఆశ్వాసం

ప్రభుత్వానికిన్నీ ప్రతిపక్షానికిన్నీ పట్టుదల వచ్చినప్పుడు ప్రభుత్వ పక్ష సభ్యుల బాధ్యత ఒకటి; ప్రతిపక్షం సభ్యుల బాధ్యత మరొకటి. ప్రభుత్వపక్షంలో ఉన్నటువంటివారికి ఎటు తన ఓటు ఇవ్వవలెను అన్నటువంటి మీమాంస ఉండదు. తన కిష్టమైనదిగాని, తన కయిష్టమైనదిగాని తాను ఒకప్పుడు నిలుచుని వ్యతిరేకించినదేగాని, వ్యతిరేకించి మాట్లాడినదిగాని ఏమైనప్పటికీ ఓటింగ్ గంట మ్రోగేసరికి తన స్థలంలోవచ్చి, ప్రభుత్వ మంత్రుల కుర్చీల వెనుకాల నిలుచొని వారి పక్షాన వోటివ్వవలసినదే. దాని మంచి చెడ్డలు ప్రభుత్వ యంత్రాంగం చూసుకుంటుంది.

చూసుకోగలదు. ఎలెక్షను సమయంలో ఇటువంటి వన్నీ వోటర్ల కెక్కడ జ్ఞాపకం ఉంటాయని ఒక ధీమా. జ్ఞాపకండున్నా ఎన్నికల పద్ధతులే వేరు అన్నటు వంటి భరోసాపైని ప్రభుత్వపక్ష సభ్యులు మెలుగు కుంటారు. ప్రతిపక్ష సభ్యులు ముఖ్యముగా మన దేశ మందు అనేక రకములు. ఒకటే ప్రతిపక్షపుపార్టీ పెద్దది నిర్మాణంగాలేదు ఇప్పటికీని. వీరిలో వీరిలో ఉన్నటు వంటి భేదాభిప్రాయాలను తాత్కాలికంగా, క్షణికంగా వదులుకోవాలి. ఓపార్టీనాయకుడు రెండో పార్టీనాయకుడి దగ్గరకుపోయి ఇది మనం ఏం చేద్దాం వోటింగు విషయమై అని సంప్రదించాలి. వీరిద్దరూ మరొకపార్టీ నాయకునితో వారు మరొక పార్టీ నాయకునితో ఇలా నల్గురైదుగురూ సభారంగంలోనే సభాకార్యక్రమానికి భంగం గాకుండా సంప్రదింపులు జరుపుకోవాలి. దీనికి ప్రత్యేక వ్యవధి ఉండదు. కార్యక్రమం ప్రకారంగా అధ్యక్షుడు వోటింగుకు పిలిచేసరికి వీరంతా సిద్ధం అవాలి. అత్యంత భేదాభిప్రాయాలు ఉన్నటువంటి సభ్యులకుమాత్రం ఈవిధంగా ఎప్పటికప్పుడు ప్రభుత్వం పెట్టిన తీర్మానంభాషనుబట్టి ఒక ఏకాభిప్రాయానికి రావడమనేది నిజంగా కష్టమైనది. బిల్లులో ఒక నిబంధనమీద ఏకాభిప్రాయానికివచ్చినా మరో నిబంధనపై కుదరకపోవచ్చు. అయిననూ వెంటనే దానిని కుదుర్చుకోవలెను. ఇది అంతా పార్టీల నిర్మాణశక్తి, పార్టీ నాయకునియొక్క పలుకుబడిమీదగూడా ఆధారపడి ఉంటుంది.

## ఆ రో ఆ శ్వా స ం

శాసనసభ ముగిసినతర్వాత చేసిన శాసనంమీద జరిగిన వోటింగుమీద పత్రికా విలేఖరులకు సరంజసమైన సమాధానాలు, వారి ద్వారా దేశంలోఉన్న ప్రజలకు చెప్పుకోవలసిన బాధ్యతయు, ఆశక్యమును ఏర్పడుతాయి. తిరిగి తమ తమ గ్రామాలకు పోయేసరికి తమ తాలూకు స్నేహితులు, ఇతరులు, శాసనసభలో జరిగిన విషయాలనుగూర్చి అడిగినప్పుడు శాసనసభయొక్క తీరు, అందులో తనయొక్క నడవడి విషయమై పత్రికలు ఇదివరకే వాటిని ప్రచురించకపోయినట్లయితే—తానే ప్రచారము చేసుకోవాలి. చేసుకోనివారు వెనుకపడతారు. అయితే నేర్పుతో చేసుకోకపోతే నవ్వులపాలౌతారు.

## ఉ ప సం హా రం

ఇటువంటి బాధ్యతలన్నీగూడా ప్రొద్దున్న మొదలు సాయంత్రం వరకూ నిర్వహించుకుంటూ తమ దృష్టి ప్రజారంగంమీదపెట్టి జీవితం గడపడానికి శాసన సభ్యునికి తగిన సౌకర్యములు ఉన్నవా లేవా అన్నది చాలా చర్చనీయాంశము. మనదేశంలో ప్రభుత్వంవారు శాసన సభ్యునికిచ్చే స్వల్ప సౌకర్యములతో ఈ పనులను తన మనస్సునకు సంతృప్తితో నెరవేర్చగల్గుచున్నాము అనుభావము శాసనసభ్యులకు కలుగుట కష్టము. ఇది నా అనుభవమునుబట్టి చెప్పినమాట.

బాధ్యతల సక్రమ నిర్వహణకు అమెరికాలో House of Representetives మెంబర్లకు ఏవేవి కలుగజేయుచున్నారో అటువంటి సౌకర్యములు ఇక్కడగూడా కలుగచేసినట్లయితే శాసనసభ్యునికీ, సభ్యత కల్గుతుంది. ప్రజలకు ప్రయోజనం కలుగుతుంది. ప్రభుత్వానికీ, సభ్యునికీగూడా గౌరవం కలుగుతుంది. ఇవి తక్కువగా ఉండడంవల్లనే శాసన సభ్యులను గురించి మనము అనేకచోట్ల అపహాస్యపు వాక్యములను వినడం తటస్థిస్తూ ఉన్నది. అయితే ఆ స్థితి ప్రజాస్వామ్యమునకు మంచిదిగాదు. రాను రాను పరిస్థితులు చక్కబడి శాసనసభ్యుడు తనకుగల మహోజ్వల ప్రజాప్రాతినిధ్యమును సార్థకం చేసుకోగలడని నా ఆశ. ప్రజాప్రతినిధి అయిన శాసనసభ్యునికి గల తక్కువదనము ఏమైనా ఉన్నట్లయితే అది ప్రజాస్వామ్యమునకే భంగము; రాను రాను అట్టి పరిస్థితి ప్రభుస్వామ్యమై అనగా—నియంతృత్వముక్రింద మారిపోయే అవకాశం ఉండగలదు.

---

# మెఱపు మెఱిసింది

శ్రీయుతులు విహారి, శాలివాహన

"ఆణ్ణి చూసి నీకళ్లలో నిప్పులుపోసుకున్నావ్!' —మల్లన్నకళ్లు చంద్రనిప్పులు కురిపిస్తున్నాయి.

రెడ్డి బుంగమీసాలమధ్య వో సన్నటి వెలుగురేఖ విరిసి మాయమైంది.

అవహేళన రెడ్డి అంతర్యాన్ని సూచించగా; ఆరని వేదన మల్లన్న హృదయాన్ని రంపపుకోత కోసింది. గుండెలోతుల్లో నుంచీ పగ వుప్పొంగింది. "నీ ఎదవ తెలివితేటలు నాకాడనా? ఆస్తికోసం పెళ్లాన్నే పొట్టనపెట్టుకున్న రాక్షసపోడివి; ఈ పని నీది కాదంటే నమ్మేదెవరు? దెబ్బకుదెబ్బతీస్తా చూసుకో! ఈ మల్లన్నమాట కోడెనాగు పగతోసమానం.జాగ్రత్త!"

చుట్టకొసని గోటితో తుంచిపారేసి, చుట్టను పళ్లమధ్య బిగించి వెకిలిగా, వక్రంగా నవ్వేడు రెడ్డి. "అరచేకుక్కలు కరవ్వు మల్లన్నా! నిన్న పోలీసోళ్ల దగ్గరేమైందో ఈ ప్రతాపం?"

రెడ్డిహేళనకు మల్లన్న శరీరం దహించుకుపోయింది. బాధతో నరాలు మూలిగిన్నై; కోపంతో కళ్లు ఎరుపెక్కిన్నై; ఆవేశంతో పెదవులు వణికిన్నై. బాధ, ఆవేశం, కోపం, పగ—అన్నీ ఘనీభవించి మాటల రూపంలో బయటపడిన్నై. "కఱవ్వు; కఱవ్వు! ఆ ధైర్యంతోనే వుండు, మల్లన్నతడాఖా తేలిపోతుంది. పట్నంలో ముండకాడికిపోయి తిరిగొచ్చే ఏలకి నీ గుండెల్లో కునుకు తీస్తాను. కాసుకో!"

రెడ్డి వికటహాసం మల్లన్నను గుడిసెదాకా తరుముకొచ్చి కుక్కి మంచంలో కూలద్రోసింది.

ఆకాశంలో మేఘాలు ఏదోగమ్యానికి చేరేవేళ మించిపోతున్నట్లు పరుగెత్తుతున్నాయి.

మల్లన్నకళ్లల్లో గోపాలం రూపం మెదిలింది.

గోపాలం?—ఇకలేడు!

మహాపర్వతభారానికి హృదయం గీపెట్టింది. కళ్లురెండూ రెండు తటాకాలుకాగా, అణగారిపోతున్న గుండెను ఊర్పుతో విస్తృతం చేసేడు. కన్నకొడుకు గతకాలపు కథలు ఒక్కొక్కటిగా మనసును ముసురుకోసాగేయి.

'దున్నల్ని తోలుకుపోయి చెఱువులో కడుక్కురారా'అంటే; 'నేను బడికెళ్లి సదువుకుంటానే' అని అమాయకపుముఖం పెట్టినగోపాలం!—

'సదివిందిసాలుగాని, ఎల్లి ఆ నిమ్మతోటకి ఏతామేస్తావుండు'అంటే; 'కాదయ్యా. పట్నంపోయి పై క్లాసులోచేరతాను. నీకెందుకు? రోజూ ఈడనుంచే మూడుమైళ్లా నడిచిపోయొస్తా వుంటాగా' అని తనని ఒప్పించి హైస్కూల్లోచేరి'ఎస్సెల్సీ'ప్యాసైన గోపాలం!—

నాలుగేళ్లల్లో పల్లెలో ఆబాలగోపాలానికీ తలలో నాలుకైపోయి, పాతికేళ్లు నిండకుండా ప్రెసిడెంటు గిరీ పొందిన గోపాలం!—

'ఎంతమందెట్టా ఏడ్చినా, 'ఎలక్షన్లలో గెలిచానయ్యా!' అనివచ్చి తనకాళ్లకు దణ్ణంపెట్టిన గోపాలాన్ని చూసి తను కొండెక్కినంత సంబరం పొందేడు. ఏంలాభం? ఏడాది తిరక్కుండానే ఆడిబ్రతుకు తెల్లారిపోయింది,తన ఆశలదీపం నిజంగానే కొండెక్కిపోయింది. గోపాలంకసలు జనంవత్తాసెక్కువౌతున్నకాడనుంచీ ఏడుపుగానే వుంది, ఆయెదవనాయాలు రెడ్డికీ, ఆడి మునాకీ. ఆనాటికానాడు—లచ్చిగాడిగట్టు తగాదా రోజున—గోపాలాన్ని బరిసెతో పొడిపించాలని ప్లానేయలా రెడ్డి? రాముడికి లచ్మనుడిలా గోపాలానికి నారిగాడు అండగావుండబట్టి ఆ గండం గడిచింది. లేకపోతే, ఆ రోజునే గోపాలాన్ని మింగేవాడు రెడ్డి!

'హుం......రెడ్డి!—వాడిసంగతి యియ్యాల్టితో తేల్చేయాలి—అతిచేకుక్కలు కఱవ్వా?'

మల్లన్నపళ్లు పటపటలాడిన్నై.

'కరుస్తయ్యో లేదో అనుభవం సేసిసూపుతా' ఎదవన్నర ఎదవకి తనసంగతేం తెలుసు? ఏందో బండి తోలుకుబతికే మల్లన్నేగందా అనుకుంటున్నాడు!—గుండెలుదీసిన రౌడీఎదవనే నేనూ అనే యిసయం ఆడికి తెలవదు!

'రౌడీవెధవని' అనుకునేసరికి ఛాతీపెరిగింది మల్లన్నకు. శరీరంలోకి ఏదో క్రొత్తశక్తి ప్రవేశించింది. మంచంమీద లేచికూర్చున్నాడు. కుడిచేత్తో కళ్లు తుడుచుకుని చుట్టూచూసేడు.

అప్పటికప్పుడే ప్రొద్దువాటారింది. ఆకాశం నిండా నల్లటిమేఘాలు దట్టంగా క్రమ్ముకొస్తున్నాయి. పక్షి ఒకటి ఏదో ఎఱ్ఱటిపండును కఱచుకుని ఉత్తరదిశగా ఎగురుతూ పోతున్నది. మల్లన్న పడుకున్నమంచానికి ప్రక్కగావున్న ములగచెట్టుమీది కాకి అదేపనిగా అరుస్తున్నది.

''నీకేంపొయ్యే కాలంవొచ్చిందే, అట్టా అరుస్తుండావ్?''అని విసుక్కుని గుడిసెలోకి దృష్టి సారించేడు.

రత్తి పొయ్యిలో తలదూర్చి నిప్పును వూదుతున్నది. అరచేతులురెండూ నుదుటికానించుకుని గొంతుక్కూర్చున్నాడు నారాయణ.

మల్లన్న మంచంమీదనుంచీ లేచాడు. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ గుడిసెలోకి వచ్చాడు.

రత్తి ప్రక్కకువచ్చి నుంచున్న తండ్రిని తలెత్తి చూసేడు నారాయణ. మల్లన్న గూట్లోవున్న ముంత అందుకుంటూ వుండగా ఆ అలికిడికి యిటుతిరిగింది రత్తి.

''ఏడకిపోతావయ్యా, డబ్బులు తీసుకుంటున్నావ్? పొద్దుగూకింది''

రత్తిమాటల్లో ధ్వనించిన భయాన్ని నారాయణ మాత్రం గమనించగలిగేడు.

''నాకియ్యాల కూడుసొక్కదుగానీ మీారిద్దరూ తినండి.'' అంటూ ముంతను గూట్లో పెట్టేసి అవతలికి నడిచేడు మల్లన్న. గుడిసెబయటకు వెళ్తున్న తండ్రివైపు అదోలాచూసి, చూపులు మరల్చుకున్నాడు నారాయణ. మల్లన్న పెద్దపెద్ద అడుగులువేస్తూ వెళ్లిపోయాడు. నారాయణలేచి విసురుగా, చిరాగ్గా అటూయిటూ తిరుగుతూ, ''అయ్యకివ్వాళ దయ్యం పట్టింది''అని తనలోతాను అనుకుంటున్నట్లు గొణుక్కున్నాడు.

అన్నం వారుస్తున్న రత్తి అన్నవైపు సాలోచనగా చూసింది. కాని, నారాయణ ఏమీమాట్లాడలేదు.

* * *

శరీరానికి చీకటి కాటుక పులుముకుని కాల పురుషుని తన కౌగిలిలోబంధించింది నిశాదేవి. ఆకాశంలో చుక్కలు మినుకుతున్నాయి. తూర్పునుంచీ దట్టమైన మేఘాలు చుక్కలనిక్కు అణచటానికి తరుముకొస్తున్నాయి.

మాలపల్లెగుడిసెలో ఎక్కడో పసిపిల్ల గీపెట్టి రోదిస్తున్నది. కాలువగట్టుమీది బొమ్మజెముళ్లలో కీచురాళ్లు రొదచేస్తున్నాయి. ప్రక్కనున్న స్మశానంలో నుంచీ నక్క వొకటి వికృతంగా అరుస్తూ పరిగెత్తుకు పోయింది.

మల్లన్న తనుచేస్తున్నపనిని ఆపి, కాళ్లు క్రిందకువేసి వంతెనమీద కూర్చున్నాడు. కుడిచేతి బొటనవ్రేలితో సన్నగా కత్తిమీద స్పృశించాడు.

'మా మాంఛి పదునెక్కింది. ఒక్కవేటు!—స....ఫ్....ఆ'—నాటుసారా తేపులో తేలిపోయిందిమాట. తూలి క్రిందపడబోయి తమాయించుకుని వంతెన దిగేడు.

అడుగు ముందుకుపడేసరికి, ఉత్సాహం మూడు అడుగులు ముందుకునెట్టింది. 'మాణిక్యం, మాంచి ఘాటుసరుకేసిందియ్యాల. మజాగావుందిలే. రెడ్డి తలనరికితే యింకా మజాగావుంటుంది!—లేకపోతే, 'పోలీసోళ్లకాడ ఏమైందీ ప్రతాపం?'అంటాడా? ఎదవసచ్చినోడు! డబ్బెదజల్లి కేసుమాఫీ సేయించానుగందా అని గర్వం. ఆడిగర్వం, ఆడిబతుకు యియ్యాల్టితో సరి! అరటిసెట్టులాంటి గోపాలాన్ని పొట్టనపెట్టుకుంటాడా?

'పేణానికి పేణం!'—

'అంతే. దెబ్బకుదెబ్బ!'—

# మెఱపు మెఱిసింది

ప్రతీకార వాంఛ ఆవిర్లు గ్రక్కింది. పెదవులు అదురుతున్నాయి; అడుగులు తడబడుతున్నై, మనిషి మత్తులో జోగుతున్నాడు. భూమికి ఆరంగుళాల పైన నాట్యం చేస్తున్నట్లుంది మల్లన్నకు.

కళ్లనులుముకుని చుట్టూ చూసేడు.

బాటకు ఒకప్రక్కగా వంకతాటిచెట్లతోపు. రెండవవైపు వెలుగు చీకట్లను వేరుచేస్తున్న రైలు కట్ట. ఎదురుగా చీకటిచేస్తున్న పాపాలకు సాక్ష్యాలు తుమ్మలు! రైలుకట్టకావల ఫ్యాక్టరీల మ్రోత; మినుకు మినుకు మంటున్న టౌన్‌దీపాలు!

కాలుసాగింది. సాగుతున్న మల్లన్నకాలికి ఏదో మెత్తగాతగిలింది. వంగి చేత్తో పైకితీసి చూసేడు.

చించిన తెల్లటి గుడ్డపీలిక!

గుండెల్లోని దుఃఖాన్ని స్మృతి బయటకు దేవింది. అప్రయత్నంగా క్రింద కూలబడిపోయేడు మల్లన్న.

'అవును ఇక్కడే! ఇక్కడే నాబాబును పొట్టన పెట్టుకున్నారు'— కైపుతో కెంపులైన కళ్లల్లో కడుపుతీపి సుళ్లు తిరిగింది.

—కాలానికి వేసిన కళ్లెం నిలువలేదు.

మల్లన్నలేచేడు. పరపరలాడినై పళ్లు! బిగపడి పోయినై పిడికిళ్లు! ముందుకుచూసినై కళ్లు!!

గమ్యం ఒక్కటేఅయినా, ధ్యేయం సాధన లాగా చీలిపోయినై కాలిబాట, బళ్లదారీ!

'రెడ్డి చావుకుకూడా యిదే సరయినచోటు!' —మల్లన్న గొణుక్కున్నాడు. 'ఆడుసేసిన, సేస్తున్న ఘోరాల కియ్యాల్టితోసరి.'

—తుమ్మమొద్దులో దిగబడి పోయింది కత్తి! ఎడంచేయి చెట్టుకు వూతగాబెట్టి బళ్లదారివైపు చూపులు నిగిడ్చేడు. నీరవనిశ్శబ్దంలో తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను తనే వినగలుగుతున్నాడు మల్లన్న.

క్షణాలు గడుస్తున్నాయి.

దూరంగా చిరుగంటలు గలగలలాడినై. మల్లన్న ముఖంలో ఆతృత తొంగిచూసింది. కత్తిని లాగి చేత్తోపట్టుకుని, చెవులురిక్కించి బళ్లదారివెంట చీకట్లోకి చూస్తూ నిలబడ్డాడు.

గంటలశబ్దం దగ్గఱపడుతోంది. మల్లన్న పగ తారాస్థాయి నందుకుంటోంది.

ఉన్నట్లుండి తీవ్రమైన గాలికొట్టింది. గాలికి సుళ్లుతిరిగి లేచినదుమ్ము మల్లన్న మొహానికి కొట్టు కుంది. తుమ్మపూలు, ఆకులు నెత్తిమీద రాలేయి.

'ఛా....ఛా....వానొచ్చేట్టుంది'— విసుక్కుని ఎడమచేత్తో తలను, ముఖాన్నీ తుడుచుకున్నాడు. గంటలమోత ఎక్కువైంది. ఎడ్ల అదలింపుశబ్దం, ఎడ్లు పరిగెడుతున్న సవ్వడీ వినిపించ సాగేయి. మల్లన్న కర్తవ్య నిర్వహణకు ఆయత్తమైనాడు. తుమ్మచెట్టు ప్రక్కన నక్కటానికి ఒక్కడుగు వెనక్కి వేసేడు.

ఆకాశంలో ఉరుము ఉరిమింది. ఎక్కడో పిడుగుపడ్డ ఫెళఫెళారావం!

గుండెలు చిక్కబట్టుకుని కాలు కదల్చేడు మల్లన్న. కుడికాలిప్రక్కగా ఆకులు గలగలలాడినై. సర్రున దూసుకుపోతోంది, నాగు! ఉలిక్కిపడి ప్రక్కకు తప్పుకున్నాడు.

బండిరాక దగ్గఱపడింది. పొంచిపొంచి చూస్తూ కత్తిని పైకెత్తి నిలబడ్డాడు.

—తుమ్మచెట్టుప్రక్కకు వచ్చిందిబండి. నొగలో వెనక్కి వాలివున్నవ్యక్తి నిద్రమత్తుతో జోగుతున్నాడు. 'రంగాయల్లేవుంది'—మనస్సులోనే మాట్లాడు కున్నాడు మల్లన్న.

బండి ముందుకు కదిలింది., మల్లన్న బండి వెనక్కు నడిచేడు.

ఒకటి!రెండు!! మూడు!!!— అనుసరించేడు. మూడడుగులు వేసేసరికి బండిలో దుప్పటికప్పుకు నిద్రపోతున్న శత్రువు కనిపించాడు.

పళ్లు బిగపడినై, కాలు ముందుకురికింది, ఒకే ఒక్కఅంగ!

ఒక్కటే ఒక్కపోటు! —

కోటిపిడుగులు నేలకూలేయి.

రెండంగల్లో తుమ్మచెట్టు ఆశ్రయమిచ్చింది. ఊఁపిరిపీల్చుకుని చేతులు విదిలించుకున్నాడు మల్లన్న!

'ఊఁరి పీడొదిలిపొయ్యింది' — పగ చల్లారిన హృదయం పైకి పలికింది.

క్షణాలు గడచిన్నై. మల్లన్న కాలిబాటలో తన గమ్యానికి బయల్దేరటానికి ప్రక్కకు తిరిగేడు. ఆశ్చర్యం!

—ఆరడుగుల దూరంలో రెండు ఆకారాలు! మనస్సు పోల్చుకోవాలని ప్రయత్నించింది. ఆకారాలు దగ్గఱకొచ్చిన్నై. కళ్లుమోసం చేయలేదు. మల్లన్న నిర్విణ్ణుడై పోయేడు. ఇద్దరిలో ఒకడు బళ్లదారి వెంట గ్రామంకేసి వెళ్లిపోతున్నాడు. రెండవ అతను మల్లన్నకు దగ్గఱగా వచ్చేడు.

మల్లన్నకు మాటలు కరువైనై! మెదడుకు పట్టినమత్తు, కళ్లను కప్పిన మైకం దిగిపోయినై!—జరిగిందీ, జరుగుతున్నదీ కలో, నిజమో తెలియని అచేతనావస్థలో వూగిపోయాడు.

"పదయ్యా. ఇంటికిపోదాం."—

మల్లన్న నిలువు గ్రుడ్లేసి చూస్తూ వుండి పోయాడు.

"అవునయ్యా. నిన్నునేను రక్షించు కున్నాను." మల్లన్నచేతిని తనచేతిలోకి తీసుకుని అడుగు ముందుకు వేశాడు.

ఆ కుదుపుకు బహిఃప్రపంచంలో పడ్డాడు మల్లన్న. తనుచేయాలనుకున్న, చేశాననుకున్న పనేమిటో అదేగనుక జరిగివుంటే కలిగే పరిణామాలూ కళ్లకు కట్టినై.

"పోలీసులు, చేతులకు బేడీలు!—ఘోడుఘోడున ఏడుస్తున్న రత్తి, నారిగాడు! — బుంగమీసాలు దువ్వుకుంటున్న రెడ్డిప్రాణం మునసబు!—విచారణ!—ఉరిశిక్ష !—అబ్బ"—

ఆ భయంకర దృశ్యాన్నిచూడలేక తల విదిలించు కున్నాడు. గుండె మహోధృతంగా కొట్టుకుంది. పొడారిన పెదవులు తడుపుకున్నాడు. "నారిగా.... అయితేనువ్వు......."—వేయి సందేహాలు, లక్షప్రశ్నలు మల్లన్న కళ్లల్లో గూడుకట్టుకున్నై.

"నేను ప్రొద్దుట్నుంచీ చూస్తూనేవున్నా నీ యవారం. అన్న పోనేపోయాడు; నేనడ్డుకోలేక పోయాను. నువ్వూ మాకు కాకుండా పోతావని జాగ్రత్త పడ్డా."

మల్లన్న గుండెల్లో ఏదో గురగురలాడింది. తలక్రిందికి వంచుకున్నాడు. వినపడీ వినపడనట్లు అన్నాడు, "నా ఆలోసనంతా సెడింది."

"పోనీ అయ్యా అన్నప్రాణానికి రెడ్డిప్రాణం తీసు కోంగానే పోయిన అన్న మళ్లీ తిరిగొస్తాడా? ఎవరి పాపానికి ఆళ్లుపోతారు! ఎంతమంది రాక్షసపోళ్లు బ్రతకటంలేదీ భూమ్మీద. ఆణ్ణీ బతకనీ.'

మల్లన్న తలెత్తి కొడుకు కళ్లల్లోకి విస్తుపోయి చూసేడు.

కళ్లల్లో అనంతమైన సంతృప్తిని నింపుకుని మళ్లీ అన్నాడు, నారాయణ, "అవునయ్యా...ఆయన్నీ బ్రతకనీ."

ఆకాశంలో మెఱుపు మెఱిసింది. మల్లన్న హృద యాకాశంలోనూ మెఱుపు మెఱిసింది!

మెఱిసిన మెఱుపులో బంగరుబాట గోచరించింది. !!

---



# శబ్దస్వరూపము - స్ఫోటవాదము

శ్రీ బి. వి. శ్రీనివాసాచార్యులు

దూరంగా పొగలు చిమ్ముతూ పోతూన్న రైలును చూపించి 'అది ఏమిటి?' అని ఎవరైనా అడిగితే దాని సంగతి తెలిసిన పక్క ఆసామీ 'అది రైలు' అంటాడు. 'అది ఏమిటి?' అన్న ప్రశ్నకి అర్థం నిజానికి— 'మన ఎదురుగా అలాపరుగెత్తిపోతూన్న ఆవస్తువు పేరేమిటి?' అని. జవాబులోకూడా 'దానిపేరురైలు' అని చెప్పకుండా వస్తువునీ పేరునీ మమేకంచేసి 'అది రైలు' అనిచెప్పడం జరుగుతూంది. లోకంలో ఇలావస్తువునీ, దానిపేరునీ కలగాపులగంచేసి వ్యవహరించడం సర్వసాధారణంగా జరుగుతున్నా నిజానికి ఎదురుగా కనిపించేవస్తువూ, మనం ఉచ్చరించే'రైలు' అనే అక్షరాల జంటా— రెండూ ఒకటికావు.

'రైలు' అనేశబ్దస్వరూపం ఏమిటి? దేనిని ఉచ్చరించగానే ఒక ఇంజనూ, పెట్టెలూ ఉండి పట్టాల మీద పరుగెత్తే ఆవస్తువు మనకు స్ఫురిస్తుందో అదీ 'రైలు' అనే శబ్దం. 'రైలు' అనగానే ఆపేరు గల వస్తువు మనకు స్ఫురిస్తున్నది అంటున్నాం. 'రైలు' లో 'రై', 'లు' అనే రెండక్షరాలూ విడివిడిగా దేనికది ఆవస్తువుని స్ఫురింప జేయగలవా? లేక రెండూ కలిసి ఆపని చేస్తున్నయ్యా? 'దేనికదే స్ఫురింప జేయగలదు,' అంటే 'రై' అనో, 'లు' అనో అంటే చాలుగదా! రెండక్షరాలూ ఉచ్చరించడమెందుకు ? 'కాదు, రెండూకలిసే వస్తుస్ఫురణ కలిగిస్తున్నయి' అంటే 'రై' ఉచ్చరించి 'లు' ఉచ్చరించేటంతలో 'రై' నశించిపోతుంది. రెండూ ఏకకాలంలో చెవిని పడితేగద రెండూ కలిసి అర్థస్ఫురణ కలిగించగలిగేది?

'ఉచ్చరించిన అక్షరాలుకాక, అవి మన మనస్సులో స్ఫురింపజేసే అక్షరాల సముదాయం అర్థస్ఫురణ కలిగిస్తూంది' అన్నా కుదరదు. మనస్సులో స్ఫురించే అక్షరాలలోకూడా రెండోది స్ఫురించే సరికి మొదటిది నశించిపోతుందిగనక.

'రైలు' అనే అక్షరాలజంట వినడంవల్ల ఒక సంస్కారం ఏర్పడి దానిని తిరిగి జ్ఞాపకం తెచ్చుకోడం, అలా జ్ఞప్తికి తెచ్చుకున్న అక్షర సముదాయంవల్ల అర్థబోధ కలగడం జరుగుతూంది అంటామనుకోండి. అప్పుడుకూడా ఒక చిక్కుంది. జ్ఞాపకం తెచ్చుకునే అక్షరాలు మొదట ఉచ్చరించిన వరుసలోనే జ్ఞాపకం వస్తయ్యనే నమ్మకమేమిటి? 'తల' తారుమారై 'లత' గా మారిపోదనే హామీ ఏమిటి? అందుచేత 'అక్షరాలు విడివిడిగా గాని కలిసిగాని అర్థాన్ని స్ఫురింపజేయలేవు' అనిభారతీయ వ్యాకర్తల సిద్ధాంతం.

మనం ఉచ్చరించే అక్షరాలవల్ల 'స్ఫోట' అనే మరో శబ్దం అభివ్యక్తమవుతుంది. అది చెవులతో వినగలిగిందికాదు. కేవలం మనస్సుచేతనే గ్రహించదగింది. అదే నిత్యమూ, సత్యమూ అయిన శబ్దం. మనం ఉచ్చరించేదీ, వినేదీ దానిని వ్యక్తం చేసే సాధనం మాత్రమే, గాని సత్యమైన శబ్దం కాదు.

* * *

స్ఫోటవాదం చాలా సనాతనమైంది. వాగ్దేవిని గూర్చిన స్తోత్రాలు ఋగ్వేదంలోనే కనిపిస్తున్నయి. అయినా — వ్యాకరణ శాస్త్ర సంప్రదాయం ప్రకారం స్ఫోటవాదానికి మూలపురుషుడు స్ఫోటాయనమహర్షి. భర్తృహరి, నాగేశభట్టు, మండన మిశ్రుడు మొదలైనవారు ఈవాదాన్ని ప్రపంచించినవారు.

నిత్యమైన స్ఫోట, లేక శబ్దబ్రహ్మం మనం నోటితో ఉచ్చరించి, చెవులతో వినే లౌకిక శబ్దంగా పరిణమించడంలో నాలుగుదశలు చెప్పారు. 1. పరా, 2. పశ్యంతి, 6. మధ్యమా, 4. వైఖరీ. పరా,

పశ్యంతీదశలలోని శబ్దాన్ని ఎవరో యోగులు తప్ప మన సాధారణ ఇంద్రియజ్ఞానంతో మనం గ్రహించ లేమన్నారు. జపాదులవల్ల మధ్యమాదశలోని వాక్కును గుర్తించవచ్చట. ఇక వైఖరీవాక్కు ఒక్కటే మన కందరికీ తెలిసింది.

పరావాక్కు నిత్యతత్త్వం; శబ్దబ్రహ్మ. మూలాధార చక్రంలోని కుండలిని దానిస్థానం. దీనినే 'నాదం' అనికూడా అన్నారు. పశ్యంతీవాక్కు బొడ్డుదగ్గర ఉండే స్వాధిష్ఠాన చక్రంలో ఉంటుంది. ఈ పరా, పశ్యంతీ వాక్కులు రెండూ సూక్ష్మస్ఫోటం. హృదయ ప్రదేశంలోని అనాహత చక్రం మధ్యమా వాక్కు నెలవు. ఇది అంతర స్ఫోటం. కంఠప్రాంతంలోని విశుద్ధ చక్రంలో ఆవిర్భూతమయ్యే వైఖరీవాక్కు బాహ్యస్ఫోటం.

*　　*　　*

సర్వదర్శన సంగ్రహంలో పాణినీయదర్శనాన్ని వివరిస్తూ మాధవాచార్యస్వామి అంటాడు: "స్ఫోట అనబడే ఈ శబ్దం విభాగాలులేనిది; నిరవయవం; నిత్యమైంది; జగత్తుపుట్టుకకు కారణమైంది. నిజానికి ఇది బ్రహ్మపదార్థమే!". భర్తృహరీ బ్రహ్మకాండలో ఇదేమాట అన్నాడు. "అక్షరమైన శబ్దతత్త్వం, అనగా శబ్దానికి ఆలంబనమైన, నాశనంలేని ఆ వస్తువు ఆదీ అంతం లేని బ్రహ్మమే! దానినుంచే ఇంద్రియ గ్రాహ్యమైన వస్తుజాతంతోకూడిన ఈ జగత్తంతా ఆవిర్భవించింది."

మన ప్రాచీన శాస్త్రాలకూ, ఆధునిక పాశ్చాత్య శాస్త్రాలకూ ఒక తేడా కనిపిస్తుంది. పాశ్చాత్య శాస్త్ర వేత్తల్లాగ తాము దర్శించిన సత్యాలను వీలైనంత విశదంగానూ, వ్యాఖ్యాన నిరపేక్షంగానూ, ఆధ్యాత్మిక శక్తుల అవసరం లేకుండా బోధ పడేట్టుగానూ గ్రంథస్థంచెయ్యడానికి మన మహర్షులూ, మహర్షి కల్పులూ పూనుకోలేదు. లేఖనసౌకర్యాలు పరిమితం కావడం అందుకు కారణం కావచ్చు; లేదా సత్యం ఎవడికివాడు దర్శించవలసిందనీ, అధికారి అయిన వాడికి గురూపదేశంవల్ల తప్ప కేవల గ్రంథజాతం ద్వారా సర్వులూ దర్శించరానిదనీ వాళ్ళు భావించడం వల్ల కావచ్చు.

*　　*　　*

ఇంతకూ 'స్ఫోట' అంటే ఇప్పుడు మనకు ఏమి బోధపడ్డటు ? బ్రహ్మపదార్థంలాగ తెలుసుకోవ డానికి వీల్లేని ఒక పరమతత్త్వం అవి తప్ప. మనం ఉచ్చరిస్తూన్న, వింటూన్న శబ్దంవల్లఅభివ్యక్తమవు తుందంటూన్న ఆ స్ఫోట స్వరూపం ఏమిటి? నిత్యమూ సత్యమూ అనిచెప్పే ఆ స్ఫోటవేర్వేరు భాషలు మాట్లాడే వాళ్ళందరిలోనూ ఏకరూపంగానే ఉంటుందా? వేర్వేరుగా ఉంటుందా? పుట్టుకతోనే స్ఫోట మనలో ఉంటుందా? లేక భాషాధ్యయనంవల్ల మధ్యలో వస్తుందా? ఇలాంటి అనేక ప్రశ్నలకు సమాధానం తేల్చుకుంటేనేగాని 'స్ఫోట' అంటే మనకు స్పష్టంగా అర్థమయినట్టుకాదు.

"మొన్న రామం కనిపించి చెప్పాడురా. మీ అన్న గారూ, పిల్లలూ అంతా ఖులాసాగానే ఉన్నారుట," అంటాడు ఒక మిత్రుడు.

"ఏరామం?"

రామం అన్నమాట పూర్తిగా అర్థంకాలేదు.

"అదేరా—అప్పుడు మనం కాకినాడ వెళ్లినప్పుడు నేను నీకు పరిచయం చెయ్యలేదూ?"

"ఓ! అతనా?"

ఎర్రగా, బొద్దుగా, ఉంగరాల జుట్టుతో, ఖాదీపైజామా, లాల్చీ వేసుకున్న అవ్యక్తి, పరిచయం అయిన తరువాత అతనితోగడిపిన ఒకటి రెండు గంటల్లో అతనంటే తనకు కలిగిన అభి ప్రాయం అంతా ఒక్కసారిగా మనస్సులో స్ఫురిస్తుంది. 'రామం' అనేమాటకు అదంతా అర్థమన్నమాట!

అలాగే 'ఆకాశం' అనగానేపైన ఎత్తుగా నీలంగా, భూమిమీద బోర్లించిన కోళ్లగంపలాగ కనిపించేదీ, మబ్బులకూ సూర్యచంద్రాదులకూ ఆధారంగా ఉన్నట్టు అనిపించేదీ మనకు స్ఫురిస్తేనే ఆమాట అర్థ మయినట్టు అనుకుంటున్నాము. ఇలా ఏశబ్దం తీసు కున్నా ఆ శబ్దార్థం వాక్యరూపంగానే మనకు స్ఫురి స్తున్నట్లు తెలుతుంది.

క్రొత్తగా మద్రాసువచ్చిన ఒక పల్లెటూరి తెలుగు పెద్ద సెంట్రల్‌ముందు బస్‌స్టాప్ దగ్గర నుంచుని "ఈబస్సు తిరువళిక్కేణి పోతుందా, నాయనా?" అని అడిగితే కండక్టరు"పోదు, పోదు"అంటాడు. నిజాని కది తిరువళిక్కేణి పోయేబస్సే! కండక్టరు 'పోదు' అంటున్నాడుగదా అని ఆపెద్దమనిషి వెనక్కు తగ్గు

తాడు. సమయానికి దగ్గరలో అరవం తెలిసిన తెలుగు విద్యార్థి ఎవడైనా ఉంటే ''వెళుతుందితాతా! ఎక్కు'' అని ఆయనను బస్సుఎక్కిస్తాడు. అరవంలో 'పోవుదు' అంటే 'వెళుతుంది'అని అర్థం. 'వెళ్లదు' అనడానికి 'పోహాదు' అంటారు. ఉచ్చారణ తొందరలో 'పోవుదు' అనే మాట 'పోదు' లాగవినిపిస్తుంది.

ఒక భాషలోని ఒకమాట ఆ భాషతెలిసిన వ్యక్తి మనస్సులో ఒక అర్థాన్ని, తెలియనివ్యక్తి మనస్సులో మరోఅర్థాన్ని స్ఫురింపజేయగలదు అనడానికి ఇది ఒక ఉదాహరణ. ఇలాగే'కాఫీ' అనేమాట దక్షిణాదివారి మనస్సులో కాఫీపానీయాన్ని స్ఫురింపజేస్తే, హిందీ మాతృభాషగాగల ఉత్తరాదివారికి 'చాలు' అనే అర్థాన్ని బోధించవచ్చు.

ఇలా ఒకేమాట వేరువేరుభాషల్లో వేరువేరు అర్థాలను బోధించగలిగినప్పటికీ, మానవులందరి లోనూ స్వతస్సిద్ధంగా ఉండే స్ఫోట ఏకరూపమే! ఒకేవ్యక్తికి తెలుగు, ఇంగ్లీషు, హిందీ వచ్చుననుకోండి. అప్పుడు 'మనిషి' అన్నా, man అన్నా, 'ఆద్మీ' అన్నా అతనిమనస్సులో అభివ్యక్తమయ్యే స్ఫోట ఏకరూపం గానే ఉంటుంది. పైనచెప్పిన 'పోదు' 'కాఫీ' అనేమాటల విషయంలో కూడా ఒకభాషలో మాటని మరో భాషలో మాటగా భ్రమించడంవల్ల వచ్చిన ప్రమాదం తప్ప, 'స్ఫోట' ఏకరూపం కాకపోవడంవల్ల వచ్చిన చిక్కుకాదది.

ఏతావతా—మానవ ఇంద్రియాలశక్తిచేత పరిమితమై మానవుడి జననంతోపాటే అతడుగ్రహించదగిన జ్ఞానరాశిఅంతా సూక్ష్మరూపంలోఅతడిలో సన్నద్ధమై ఉంటుందనీ, అదే స్ఫోట అనీ తేలుతూంది. అందుకే 'స్ఫోట'నిత్యం అన్నారు. అలా సన్నద్ధమైవున్న జ్ఞానాన్ని అభివ్యక్తంచేసే పరికరాలే భాషలోని శబ్దాలన్నీ. ఒక చీకటికొట్లో ఎన్నోవస్తువులుండవచ్చు. టార్చిలైటు దేనిమీద వేస్తే ఆవస్తువే కనిపిస్తుంది.

*   *   *

ఒక సంగతిమాత్రం స్పష్టంగా కనబడుతూంది. 'స్ఫోట' ను మనం సంపూర్ణంగా నిర్వచించలేకపోయినా అది మనందరి నిత్యానుభవంలోనూ ఉన్నదే! ఒకవ్యక్తి మాట్లాడిన ప్రతిసందర్భంలోనూ, ఆ మాట్లాడిన మాటలు మరొకడు అర్థంచేసుకున్న ప్రతిసందర్భం లోనూ స్ఫోట పనిచేస్తూనేఉంది.ఈ స్ఫోట లోపించడం వల్లనే మరమనిషికి (robat) ఏదిపడితేఅది మాట్లాడగలగడం, ఏదిమాట్లాడినా బోధపరచుకోగలగడం సాధ్యంకావడంలేదు.

వక్త ఊపిరితిత్తులలో నుంచి వాయుప్రవాహం బయలుదేరి స్వరపేటికలోనూ, ముఖయంత్రం లోనూ పొందిన మార్పులవల్ల వేర్వేరు ధ్వనులుగా బహిర్గతమవుతుంది. ఆ ధ్వని తరంగాలు శ్రోత శ్రవణేంద్రియాన్ని సోకి అక్కడి నాడీతంతువులద్వారా మస్తిష్కంలో సెరిబ్రం ఉపరితలాన్నిచేరి అక్కడ ఒకానొక ప్రాంతంలో తిరిగి ధ్వనులరూపంలో మనస్సుచేత గృహీతమవుతుంది. ఇంతవరకూ ఆధునిక భాషా మనశ్శాస్త్రాలు వివరిస్తున్నాయి. కాని వక్తమనస్సులో ఊహ, ఆ ఊహను ప్రకటించాలనే సంకల్పం అంకురించిన తరువాతగద వాయుప్రవాహం బయలుదేరడం! అలాగే ధ్వనితరంగాలు శ్రోతమనస్సులో ధ్వనిరూపంగా మారిన తరువాతఆధ్వనులు తిరిగి అర్థరూపంగా పరిణమించినతరువాతగద అతనికి వక్తచెప్పదలచిన విషయం బోధపడడం ; వక్తలోని ఊహ, సంకల్పదశలోని భాషా స్వరూపాన్ని గురించీ, శ్రోతలో భాషాధ్వనులు ఊహ రూపంలో గృహీతమయ్యే దశనుగురించీ ఆధునిక భాషామనశ్శాస్త్రాల వివేచన ఇంతవరకూ ప్రసరించినట్టులేదు. ఆ పూర్వ, పర భాషాదశలను వివరించడానికి స్ఫోటవాదం పూనుకున్నట్టు కనిపిస్తుంది.

'నోట్లో ఆడుతోందండీ ఆమాట!..... అయ్యో రామ! సరిగ్గాసమయానికి జ్ఞాపకంరాకుండా పోయిందే?........ ఆఁ ఆఁ.... చెబుతానాగండి.... ప్చ్! లాభంలేదు. మళ్లీపోయిందండీ........' అంటూ మనకు స్పష్టంగా తెలిసి ఉన్నట్టనిపిస్తూ మన వక్త మనస్సులోకి రాకుండా ఒక్కొక్కమాట మనల్ని తికమకపెడుతూ వుండడం మన అందరి అనుభవం లోనూ ఉన్న సంగతే! అలాంటి సందర్భంలో ఏదశలోని వాక్కు మనకనుభూతమవుతున్నట్టు? అది వైఖరీ వాక్కు కాదనడం స్పష్టం. మధ్యమాదశలోని వాక్కా? స్ఫోటవాదంపూర్తిగా అవగాహన అయిందన్నవాళ్లు ఇటువంటి ప్రశ్నలకు జవాబు చెప్పాలి.

కావ్యరచనకుముందు కవులకు ఉండే అనుభూతిని గూర్చి అప్పుడప్పుడు చదువుతూ ఉంటాం. అంటే ఆ కావ్యం వైఖరీదశలోనికి రాకమునుపు పరా,పశ్యంతీ,

మధ్యమాదశలలో దేనిలోనో ఉన్నప్పుడు వారి అనుభూతి అన్నమాట! పోతన 'పలికించెడివాడు రామభద్రుండట' అంటాడు. మరోకవి 'యతి ప్రాసలతో సహా కూర్చి సిద్ధంగాఉన్నపాదం ఎక్కడినుంచో ఒక్కసారిగా బుడుంగున పైకివచ్చినట్టు ఉంటుందండీ!' అంటాడు. తనేదో కావ్యం వ్రాయబోతున్నాడనేసంగతి తప్ప ఆ కావ్యస్వరూపం ఇదమిత్థమని గోచరించని దశ అది. ఏదో మబ్బువంటిది మనస్సును ఆవరించుకున్నట్టు ఉంటుంది. ఆ మబ్బులోనుంచి ఒక్కొక్కప్పుడు కావ్యంలోని మధ్యభాగమో, చివరిభాగమో ముందుగా విస్పష్టాకృతి పొందడం జరగవచ్చు. ఎంకిపాటలు వ్రాసిన నండూరి సుబ్బారావుగారు తనప్రతిపాటలోనూ ఏచరణాలు ముందు వచ్చిందీ, ఏవి తరువాత పూర్తిఅయిందీ చెబుతూ ఉండేవారు. 'ఆపలేనే ఎంకి ఈపడవ విసురు' అనేపాటలో

"కన్నుమంటా ఏరు
గాలినెగబోసింది
బయటికురికేపాట
నోటగొడతాఉంది—"ఆపలేనే"
తలమలుపుకొని పాట
తరలింది కామోను
దేముడల్లేలోన
తిరుగుతున్నాదేటొ "ఆపలేనే"

అంటారు. 'దేముడల్లేలోన తిరుగుతూ' ఉన్నట్టనిపించే ఆ స్థితి పశ్యంతీ దశకు సంబంధించిందా? మధ్యమాదశకు సంబంధించిందా?

వేదాలను 'శ్రుతులు' (వినబడినవి) అనడంలో కూడా అవి వైఖరీదశకు ప్రాధాన్యంగల రచనలు కావు అనే భావంతోనేనేమో అనిపిస్తూంది.

* * *

పాశ్చాత్యదర్శన మనశ్శాస్త్రాలలో స్ఫోటవాదంతో పోలికలు ఉన్నట్టు అనిపించే కొన్ని భావాలను మనం గుర్తించవచ్చును. గ్రీకుల 'లాగాస్', (logos), కాంట్ ప్రతిపాదించిన కారణాత్పూర్వజ్ఞాన సిద్ధాంతం (apriori), మనశ్శాస్త్రంలోని—స్ఫురణ (intuition) వంటివి.

గ్రీక్ భాషలో లాగాస్అంటే శబ్దంఅనే అర్థం. ప్లేటో లాగాస్ ప్రపంచానికి మూలరూపం అన్నాడు. అంటే లాగాస్నుంచే ప్రపంచంఅంతా వచ్చిందని. ఫైలో (philo) 'దేవుడికీ, ప్రపంచానికీ మధ్య అనుసంధానం కలిగించేది లాగాస్, అన్నాడు. హెరక్లైటస్ (Heraclitus) భౌతిక జగత్తునంతటినీ లాగాస్ ద్వారానే మనం గ్రహిస్తున్నామన్నాడు. హెగల్ 'పాన్—లాగిజ్మ్' (panlogism) అనే తన సిద్ధాంతంలో లాగాస్ తాలూకు వ్యక్తరూపమే ఈ ప్రపంచమంతా అన్నాడు.

ఇంద్రియ వస్తు సన్నికర్షవల్ల జ్ఞానం మనలో క్రొత్తగా ఉత్పాదితం కావడంలేదనీ, అది కారణంచేత ఉత్పాదితమయ్యే కార్యంకాదనీ, ఆజన్మసిద్ధంగానే జ్ఞానరాశి అంతా సూక్ష్మరూపంలో మనలో ఉన్నదనీ, అదే జీవితంలో క్రమేణ అభివ్యక్తంఅవుతూందనీ కాంట్ ప్రతిపాదించిన కారణాత్పూర్వజ్ఞాన (apriori) సిద్ధాంతం సారాంశం.

ప్రస్తుతం మనశ్శాస్త్రవేత్తలు 'స్ఫురణ' (intuition) అనే భావాన్ని ఎక్కువగా ఆదరించక పోతున్నా ఇటీవలివరకూ ఈ భావం మనశ్శాస్త్రీయ చర్చలలో ఎక్కువగా వినిపించేది. James Drever వ్రాసిన A Dictionary of Psychology' ఈ పదాన్ని ఇలా నిర్వచించింది:

"Immediate perception or judgement, usually with some emotional colouring, without' any conscious mental steps in preperation; a popular rather than scientific term."

మనకు తెలిసినంతలో దానికి హేతుభూతమైన మనః ప్రక్రియలేవీ కనిపించకుండా, సాధారణంగా కొంచెం ఆవేశంతో మనలో హఠాత్తుగా, నేరుగాకలిగే అవగతి, లేదా నిర్ణయం (intuition) అని చెప్పవచ్చును.

పాశ్చాత్యశాస్త్రీయ వివేచనా పద్ధతులలో సుశిక్షితులైన విద్వాంసులు సంస్కృతంలో స్ఫోటవాద ప్రతిపాదక గ్రంథాలను క్షుణ్ణంగా చదివి ఆధునిక శాస్త్రీయ పద్ధతులలో ఆ వాదాన్ని తిరిగి ప్రతిపాదించ గలిగితే ఆధునిక విజ్ఞానానికి—ముఖ్యంగా భాషా, మన, స్సంఘ, సాహిత్య శాస్త్రాలకు మహోపకారం చేసినవారవుతారు.

# యంత్రా దిచ్ఛే త్పరాజయమ్

శ్రీ బండి నాగరాజు

భగవంతుడు లేడు; నిజమే !
అస, లెందుకుండాలి ?
మనిషే, ఒకప్పుడు
        భగవంతుడుంటే బాగుండు ననుకున్నాడు;
అందుకని సృష్టించుకున్నాడు!
ఇప్పుడు అవసరం లేదనిపిస్తే
ఊడగొట్టవచ్చు; అంతే !
ఉంటే మాత్రం ?
        మాట వరసకి అనుకుందాం !—
మన కేదో లాభం ఉండాలిగా ?
ఆ లాభాలు మనమే సృష్టించుకో గలిగితే—?
        భగవంతుడి అవసర మేమిటి ?
మనశ్శాంతి అంటావా ?
అది ఒట్టి తప్పుడు కూత !—
        నే న్నమ్మను, బూకరింపు !
        బూర్జువాల మత్తు గుళిక !
        టట్ !
తిండీ, బట్టా వుంటే
నివాసాని కింత వసతి వుంటే
శాస్త్రజ్ఞానం,
        సాంకేతిక పరిజ్ఞానం
—మన చేతిలో వుంటే
ఇంకేం కావాలి ?
మనశ్శాంతి ఎవడిక్కావాలోయ్

తిండిలేక ఛస్తూంటేనూ ?
అసలు మనస్సంటే ఏమిటి
నాకు తెలియకడుగుతాను ?
ప్రేమా గీమా పుట్టించేదా ?
కాద్ ! !
ఆ ప్రేమలాంటి మాటలు
మన పూర్వు లెరగరు—
ఆదిమ మానవులు అవేవీ తెలియకే
హాయిగా బతికారు !
మనం ముందు ముందుకు పోతున్నాం !
అంటే ఆదిములలో కలిసిపోతున్నాం ! !
భగవంతుడూ, ప్రేమా మనవాళ్లెరగరు—
మన కెందు కొచ్చిన పిచ్చి యిది ?
ఈ మాట లనేవాడి మొహం
వాచేటట్లు నవ్వండి !
భగవంతుడినీ, ప్రేమనూ
మార్చే శక్తి, కూర్చే శక్తి
మనలోనే ఉన్నదనీ
తినడమే శాంతి అనీ
మనుగడే మోక్షమనీ
ఇదే జీవిత తత్వమనీ
బోధించు .....
ఎవరికి ?—
నువ్వు సృష్టించిన
ఆ భగవంతుడికి ........
యంత్రాలు సృష్టించిన మానవుడు
తానే యంత్రమై పోతున్నాడు—
'మానవతా సాయంత్ర' మై పోయాడు :
అంటే ఏమిటీ ?
మానవుడే భగవంతుడై

# యంత్రా దిచ్ఛే త్వరాజయమ్

సృష్టి స్థితి లయ కారుడై
పోతున్నాడు !—

రేపు, యంత్రం మానవుడిని
(మానవుడు భగవంతుడిని లా)
లేకుండా చేయాలి !

యంత్రాలకు సర్వం ఒప్పజెప్పి
మానవుడు గుడికట్టుకొని
నిర్జీవుడై కూర్చొని
యంత్రాలకు వరాలిస్తూ
లీలా మానుష విగ్రహుడుగా
నిష్క్రమించాలి !

అవును,
యంత్రా దిచ్ఛే త్వరాజయం !

---



# ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు-1

## శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ఈ శతాబ్దం ప్రారంభదశకంలో తెలుగు వాఙ్మయ భూమిలో ప్రసిద్ధులు శ్రీ తిరుపతి వేంకటకవులు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు, శ్రీ గురజాడ అప్పారావుపంతులు, శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు, శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగార్లు.

శ్రీ గురజాడ అప్పారావుగారి ప్రభావం వారిసమకాలికుల మీదకంటె, తరువాతివారిపైనే ఎక్కువగా కన్పిస్తున్నది. ఈయన ఒక విధంగా సాహిత్యంలో కొత్తపుంత త్రొక్కినట్లుగా అంగీకరించాలి. గురుజాడవారిని వారి సమకాలీన సాంఘిక పరిస్థితులు కవితా రచన చేయించినై. వారు కవితావస్తువులుగా తీసుకున్నవన్నీ దాదాపు సాంఘిక సమస్యలే. ఇట్లా సాంఘిక సమస్యల్ని తీసుకుని సాహిత్యం సృష్టించడం ఆంధ్రవాఙ్మయంలో ఆయనదే ప్రథమ ప్రయత్నం. సమకాలీనమైన మూఢ నమ్మకాలను, కాపట్యాలను, సాహిత్యంలో ప్రతిఫలించి వాటి నిర్మూలనకు పూనుకున్నాడాయన. ఆయన పూర్తిగా తెలుగుతనాన్ని జీర్ణించుకున్న రచనా మార్గాన్ని ఆశ్రయించాడు. ఆయన కవిత్వంలో భావనాబలం, ధారాశుద్ధితోపాటు, విస్పష్టత, ఒక సామీచీన్యమైన మృదుత్వం ఉన్నాయి. ఆయన రచనల్లో భాషా జటిలత్వం లేదనే చెప్పాలి. వారి 'పూర్ణమ్మ'లోగాని, 'కన్యాశుల్కం'లోగాని 'లవణరాజుకల'లోగాని, 'కన్యక'లోగాని సామాజిక సమస్యలే కవితా వస్తువులు.

వీరేశలింగంగారు బహుముఖ ప్రజ్ఞావంతులు. ఆయన మనసాహిత్యానికి చేసిన సేవ అపారము. ఒక్క చిన్నకథతప్ప వీరేశలింగంగారు నిర్వహించని సాహిత్య ప్రక్రియ లేదు. వీరు దాదాపు నూటఇరవై గ్రంథాలు రచించారు. ఆగ్రంథాలలో ఉన్న వైవిధ్యమే పంతులుగారి వ్యుత్పన్నతకూ విజ్ఞానానికీ ప్రతీకవంటిది. పంతులుగారి రచనలలో త్రికాలాబాధ్యంగా ఉండేవి వారిస్వీయ చరిత్రా—కవుల చరిత్రా అని చెప్పవచ్చును.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు ప్రత్యేకముగా గణింపవలసిన రచయితలు. గూఢమైన హాస్యపుష్టి గలిగి మధురమైన వీరి విమర్శలు ఆంధ్రవాఙ్మయానికి అపూర్వాలంకారాలు. ఆ రోజుల్లో హాస్యరసాన్ని ఆలంబనంగా గ్రహించి రచనలుసాగించిన శ్రీ చిలకమర్తి శ్రీ కందుకూరివారి రచనలకంటె వీరిహాస్యమే విశిష్టమై, ప్రత్యేకత కలిగి, ఉన్నతస్థాయిని అందుకున్నది. ఆరోజుల్లో మనదేశంలో ఉన్న మత,రాజకీయ, సాంఘిక సమస్యలన్నీ వీరికి హాస్యరసపోషణకు సముచిత వస్తువిశేషాలైనాయి. స్త్రీసమస్యలు, నాగరికత, సంస్కృతి, విద్యావిధానాలు, మొదలగు అనేక అధునాతనవిషయాలను, ఆయన సునిశిత హాస్య ధోరణిలో విమర్శించి భావుక లోకాన్ని కవ్వించి నవ్వించారు. ఆయన విమర్శలు వేడిగాను, వాడిగానుకూడా ఉండేవి. ఆయన సృష్టించిన పాత్రలు జంఘాలశాస్త్రి, వాణీదాసు, బొర్రయ్య శెట్టి— నేటికీ మనదేశంలో సజీవంగా ఉన్నాయని చెప్పక తప్పదు. వీరికి శబ వైచిత్రిపై మిక్కిలిగా అభిమానం ఉండేది. వీరి రచన యావత్తూ వ్యావహారికభాషకు దగ్గరగాఉన్న సలక్షణమైన గ్రాంథికభాషలోనే జరిగింది. వీరు

దాదాపు షేక్స్‌పియరు వ్రాసినన్ని నాటకాలు వ్రాశారు. తెలుగు రంగస్థలం మీద నేటివరకూ ప్రదర్శింపబడిన నాటకాలలో వీరి రాధాకృష్ణ, కంఠాభరణము, పాదుకాపట్టాభిషేకము అతిప్రసిద్ధములై నేటికీ నిత్యస్మరణీయంగా ఉన్నాయి. ఇందులో ముఖ్యంగా 'రాధాకృష్ణ' నాటకంలో వీరి 'నాటకీయ శిల్పప్రజ్ఞ' పరమ మౌళికంగా ఉన్నదనీ, అంత ఉత్తమనాటకం అధునాతనయుగంలో ఏయితర భారతీయభాషలలో కూడా రాలేదనీ విజ్ఞులు అంటున్నారు. వీరినాటకాలలోకూడా 'హాస్యరసం' అతి ప్రత్యేక స్థానం సంపాదించుకున్నది. ఆయనవలె హాస్యాన్ని ఉత్తమ ప్రయోజనానికి ఉపయోగించుకోవడం మరే ఇతర తెలుగు రచయితకూ తెలియలేదనే చెప్పాలి. ఆయన రచించిన చిన్నకథల్లోకూడా ప్రామాణికమైన శిల్పవిన్యాసం కన్పడుతుంది. అతి సంక్షుభిత కథాసన్నివేశంలో చిత్రమైన హాస్యరస చమత్కార విన్యాసంచేత, ఈయన కరుణారసాన్ని నిర్వహించారు. ఇటువంటి శిల్పానికి 'కానుగచెట్టు' అన్న వీరి చిన్న కథను ఉదహరించవచ్చును. ఇటువంటి శిల్పాన్ని ప్రదర్శించేకథలు పాశ్చాత్యభాషల్లో ఇప్పుడిప్పుడే వస్తున్నాయి.

పానుగంటివారి రచనలు ముఖ్యంగా వారి 'సాక్షి వ్యాసాలు', వారి నాటకాలు— మన వాఙ్మయానికి శాశ్వత ఆభరణాలనీ— వాటివల్ల మనసంఘం కొంత సంస్కారాన్ని గడించుకొన్నదనీ—' అంగీకరించాలి. పానుగంటివారు పిఠాపుర సంస్థానానికి చెందినవారు. పిఠాపురంవారు చేసిన ఆంధ్రవాఙ్మయసేవలో పానుగంటి వారికి ఆశ్రయమిచ్చి గౌరవించడం ప్రముఖ ఘట్టమనే పరిగణించాలి.

పానుగంటివారి తరువాత 'హాస్యరసం' తెలుగు రచనలలో నిత్యదర్శనీయంగా ఉన్నా— వారి రచనలలో సంతరించుకొన్న— సౌందర్యాన్ని, నిగూఢ గాఢత్వాన్ని, శిఖరాగ్రస్థాయీభావాన్ని, మళ్లీ ఇంత వరకూ పొందలేదనే మాట వివాదాతీతమైంది.

శ్రీ గురుజాడవారికి విజయనగర సంస్థానం ఆలంబనంకాగా, శ్రీ పానుగంటివారికి పిఠాపుర సంస్థానం ఆశ్రయం ఇచ్చింది. వీరేశలింగంగారు కర్మవీరులై రాజమహేంద్రవరాన్ని తమ కార్యక్షేత్రంగా ఎన్నుకున్నారు.

శ్రీ తిరుపతి కవులు యావదాంధ్రంలోనూ కవితాయాత్రచేసి నానారాజసందర్శనం చేసినా వారికి బందరు పట్టణంతో ఉన్న సంబంధంవల్ల, వారి కార్యరంగం బందరుగా భావించవచ్చు.

తిరుపతి వేంకటకవులకు ముందు సామాన్య జనుల్లో సాహిత్య భావుకత చాలా తక్కువగా ఉండేది. సాహిత్య వ్యాసంగం, పండితులకూ, ప్రభువులకూ మాత్రమే పరిమితమై ఉండేది. వీరు కవిత్వాన్ని తెలుగుభూమిలో నాలుగుమూలలా వినిపించి, సామాన్య జనుల్లోకూడా సాహిత్య పిపాస రేకెత్తించారు. ఇప్పటి రోజుల్లో సినిమా తారలను చూడటానికి వచ్చినట్లుగా జనం వీరి కవితాసభలకు వచ్చేవాళ్ళట.

కవిత్వాన్ని, అతిసామాన్యజనుల దగ్గరకు తీసుకుపోయి వాళ్లనుకూడా అలంరింపజేసి, ఆనందింపజేయడం—మన భాషలోనేకాదు, ప్రపంచ భాషల్లోనే అపూర్వమైనఉద్యమం. వీరి 'అవధానప్రక్రియ'— సాహిత్య చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపవలసిన విశేషం. వీరు రచించిన కావ్యాలు ఎంతకాలం నిలుస్తాయి అన్న వివాదం ఎట్లాఉన్నా—సాహిత్య చరిత్రలో వీరి గీరతం, జయంతి, గుంటూరుసీమ, జాతకచర్యవంటి గ్రంథాలకు శాశ్వతమైన స్థానం ఉన్నదనుట నిర్వివాదమైన విషయం. దేశంలో స్వభాషాభిమానం, అభిరుచి పునరుజ్జీవితం కావడానికి వీరే ప్రధాన హేతువులని చెప్పడం అతిశయోక్తికాదు.

"కాలముబట్టి, దేశమునుగాంచి, ప్రభుత్వమునెంచి" సజీవమైన భాష మారుతూ ఉంటుందనీ, సంస్కృతంలోలాగా మనకు వ్యాకరణం చెప్పుకోదగినంతగా లేదనీ—(తెనుగునకున్న వ్యాకరణ దీపముచిన్నది) —అందుచేత ఉన్న లక్షణగ్రంథాల్లో చెప్పబడిన దానికంటె, పూర్వకవుల రచనలలోఉండే లక్ష్యములే ఉపాదేయాలనీ వీరు నిర్వచించారు. వీరి అభిప్రాయాలే తరువాత తరువాత గిడుగువారివంటి ఉద్దండులచేతుల్లో వ్యావహారిక భాషావాదంగా పరిణమించినాయి.

కవిత్వంలాగానే ఉపన్యాసాలుకూడా సాహిత్య స్థాయిలో మధురాతి మధురంగాచేసి సభికుల్ని మంత్రముగ్ధులుగా చెయ్యడం—చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి మహాశక్తి. వారి ప్రసంగ నైపుణి అనితరసాధ్యమైంది. సభలో ఉన్నవారంతా పరవశులు కావలసిందే. ఒక్కసారి వెంకటశాస్త్రిగారి ప్రసంగంవింటే—ఆ

ఇహ్మాంతం ఆంధ్ర సరస్వతీ సేవకు అంకితం అయి పోయేవాళ్లు జనం. ఆయనవలె జగన్మోహనంగా సాహిత్యోపన్యాసంచేసేశక్తి మళ్లా ఎవ్వరికీ కలగనేలేదు.

వీరి భాషా వివాద గ్రంథాలు మన సాహిత్యాన్నే పరిపుష్టం చేశాయి. వీరి సాహిత్యసమర గాథలు జనం చిలవలు పలవలుగా చెప్పుగుని, చిన్నపిల్లలు కాశీ మజిలీ కథలు చదివి ఆనందించినట్లుగా ఆనందించేవాళ్లు.

సమకాలీన మత, సాంఘిక, రాజకీయ సమస్యలు వీరిని కూడా ఆకర్షించాయి. వెంకటశాస్త్రిగారు శతాధికంగా సాంఘిక, సాహిత్య విషయాలనుగురించి వ్యాసాలు వ్రాశారు. ఈ వ్యాసాల్లో శాస్త్రిగారు ఉపయోగించింది శిష్ట వ్యావహారిక భాష. అప్పటికీ—ఇప్పటికీ-ఇంకెప్పటికీ—శిష్ట వ్యావహారిక భాషకు అప్రతిహతమైన ఉదాహరణం శాస్త్రిగారి రచన ఒక్కటేనని చెప్పవలసి ఉన్నది. శ్రీశ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భాష కూడా మధురమైన ఉత్తమ వ్యావహారికభాషయే. శ్రీ విశ్వనాథవారివంటివారుకూడా కొన్ని ఉత్తమ వ్యావహారిక భాషా రచనలు చేశారు. కాని శిష్ట వ్యావహారికంలో వెంకటశాస్త్రిగారి మార్గమేవేరు. వారే ఒక సందర్భంలో చెప్పినట్లుగా 'వీరి త్రోవవేరు' అనవలసినదే. సంస్కృతంలో మురారికి ఇటువంటి కీర్తి ఉన్నది.

కృష్ణదేవరాయలవారు సాహితీ సమరాంగణచక్రవర్తినని చెప్పుకున్నాడు. వెంకటశాస్త్రిగారు సాహితీ సమర చక్రవర్తి. పూర్వ చరిత్రలో శ్రీనాథుడువంటి కవిసార్వభౌములు డిండిమభట్టువంటివారిని వోడించి కంచు ఢక్కలు పగులకొట్టించినట్లు వింటున్నాము. కాని ఆనాటి పండితుల వివాదాలలో పామరజనం ఎంతవరకు పాల్గొని ఆనందించేవాళ్లో మనకు తెలియదు. వెంకటశాస్త్రిగారి సాహిత్యసమరాల్లోసామాన్య జనంకూడా పాల్గొని పరవశులై ఆనందించారు. విద్యానగర రాజసభల్లో కవిసార్వభౌమునికి జరిగిన కనకాభిషేకాలు—వెంకటశాస్త్రిగారు తెలుగుదేశంలో వాడ వాడలోనూ చేయించుకున్నారు. వెంకటశాస్త్రిగారు ఎంత సమరయోధులో అంత వినయసంపన్నులు. వారు తమ రచనల్లో దోషాలు చూపిస్తే అంగీకరించిన ఘట్టాలుకూడా లేకపోలేదు. వారే ఒకప్పుడు ఇట్లా వ్రాశారు. "సాక్షాన్మహా కావ్య కృత్ప్రవరుల్ చెప్పిన కావ్యమందునె ప్రమాదంబుల్ శతంబుండు" నంటూ.

తెలుగుసీమలో ఎంతమందో కవులు జన్మించారు. మహా కావ్యాలు రచించినవాళ్లూ ఉన్నారు. తమ ప్రతిభా ప్రాగల్భ్యాలు చెప్పుకున్నవాళ్లూ ఉన్నారు. ఇంతమందిలో 'నేను కవనార్థం బుదయించితిన్' అని కారణజన్ముడనని చెప్పుకున్నది వెంకటశాస్త్రిగారొక్కరే. మధ్యయుగంలోకూడా "కవిత పుట్టిల్లు వెన్నెల కంటి యిల్లు" అని చెప్పుకున్న కవులు కన్పిస్తారు. కాని వాళ్ల ప్రాగల్భ్యోక్తులకంటె వెంకటశాస్త్రిగారి మోటుపద్యాలకే ఎక్కువ జనవశీకరణశక్తి ఉన్నది.

వెంకటశాస్త్రిగారివలన ఆంధ్ర వాఙ్మయానికి అత్యధికమైన మేలు కలిగినా, వారివలన ఆంధ్రభాషకు కొంత అపకారంకూడా జరిగింది. ఆ అపకారం శాస్త్రిగారు వ్యావహారిక భాషావాదాన్ని బలపరచడంవల్లవచ్చింది. ఆ అపకారం మేమిటో మనవి చేస్తాను.

శ్రీ శాస్త్రిగారు దిగ్దంతివంటి పండితుడు. ఆయనవంటివాడు వ్యావహారికభాషపై అభిమానము చూపగా—కొందరకు అది 'విస్సన్న చెప్పినది వేదమై' పోయినది. ఆయన ఆమోద ముద్ర శంఖమున పోసిన తీర్థముగా ఆంధ్రలోకము గ్రహించినది. ఇటువంటి గౌరవం సంస్కృతంలో క్షేమేంద్రుడు, ఇంగ్లీషులో జాన్సన్ మాత్రమే అనుభవించారు. వ్యావహారిక భాషలో వ్రాయుట తప్పని కాదు—భాషలో తగినంత కృషి చేయక—పునాదులు లేక ప్రతివారూ తమకు వచ్చిన, చేతనైన భాషలో రచనలు చేయడం జరిగిపోయింది. భాషను రచనకు ఉపయోగించే వ్యాసంగంలో ఉండదలచుకున్నప్పుడు శబ్ద స్వరూపం తెలుసుకుని—ఆ తర్వాత రచన చెయ్యడం ప్రపంచంలోఉన్న అన్ని ఇతర భాషలలోనుజరుగుతున్నది. ఈ వ్యావహారిక భాషావాదం వచ్చిన తరువాత—మన తెలుగు భాషలోమాత్రం—ఒక నూతన అవ్యవస్థ ఏర్పడి, తెలుగులో రచనచేసేవాళ్లలో దాదాపు నూటికి తొంభైతొమ్మిదిమందికి తెలుగేరాని పరిస్థితి ఏర్పడింది. గిడుగువారు, చెళ్లపిళ్లవారు ఎంత భాషా పాండిత్యం అలవరచుకున్నాక వ్యావహారికానికి దిగారూ? మరి మన రచయితలు వాళ్ల ఇష్టం వచ్చిన భాషలో వ్రాసినా తగినంత భాషా పాండిత్యం, వ్యుత్పత్తి ఎందుకు సంపాదించరో అర్థం కాకుండా ఉన్నది. మనవాళ్లు సుష్ఠుగా చదువుకోడానికి ఏ వాదాలూ అడ్డురావు. కాని

వ్యావహారిక భాషకు మహాసేవ చేస్తున్నామనుకొనే అధునాతనులు కొందరు— చిన్నకారువాళ్లని పాడుచేస్తున్నారు. ఇప్పటివాళ్లకు తెలుగుభాష సరిగా రాకపోవడానికి వ్యావహారిక భాషావాదాన్ని ఉద్దండంగా చేస్తున్నవాళ్లే కారణం. వ్యావహారికంగా వ్యావహారిక భాషనే ఉపయోగించనివ్వండి. రచనా వ్యాసంగం పెట్టుకోదలచుకున్నవాళ్లనైనా తగుమాత్రంగా భాషాజ్ఞానం సంపాదించనియ్యండి. నేటి ఈ వీరవ్యావహారిక భాషావాదులు విశ్వవిద్యాలయాలలోకూడా భాషా బోధను పాడుచెయ్యాలని చూస్తున్నారు. రానున్న తరంవాళ్లకు భాషాజ్ఞానం లేకుండాచేసి—వాళ్లను వ్యుత్పత్తిశూన్యుల్ని చెయ్యడంలో ఏమి లాభం ఉన్నదో—ఏమి ఆనందం ఉన్నదో వితండవాదం చేసేవాళ్లకే తెలియాలి. వ్యవహారిక భాష, ప్రాంతప్రాంతానికీకాకుండా తరతరానికీ మారుతుంది. సంస్కారాన్నిబట్టి—అంతస్థునిబట్టి మారుతుంది. ఈ విషయం గిడుగు పిడుగుగారే అంగీకరించారు. భావితరం వాళ్లు చేసేరచనలు వాళ్లకు అలవాటైన వ్యావహారికంలోనే ఉండనీయండి. వాళ్లకు సుష్ఠుగా భాషాపాండిత్యం, శబ్దస్వరూపజ్ఞానం, అలవరచడంలో తప్పేముంది? వీరవ్యావహారికవాదులు ఎందుకు అడ్డుసవాళ్లువెయ్యడం? ఇందులో ఏదో దేశస్వాతంత్ర్యం పోతున్నంతటి మహోపద్రవం ఉన్నట్లుగా కావేషాలు పెంచుకుని యుద్ధాలు చెయ్యడం దేనికి?

భాష మారుతూ వుంటుందని పదేపదే చెప్పక్కర్లేదు. అంటే ఇవ్వాల్టి వ్యావహారికభాష రేపటి రోజున కాదన్నమాట. అట్లాగే బొబ్బిలిప్రాంతం వ్యావహారికభాషకూ, చిత్తూరుజిల్లా భాషకూ, ఆదిలాబాదు జిల్లాభాషకూ చాలా వ్యత్యాసాలు ఉన్నాయి. 'కాశబుడ్లు'అంటే లాంతరుగ్లాసులు. 'ఊసిపోవడ' మంటే పగిలిపోవటం. కాశబుడ్లు వూసిపోయాయని వ్రాస్తే—తెలంగాణావాళ్లకు తప్ప మిగతావాళ్లకు అర్థంకాదు. ఆయా కారణాలచేత త్రికాలాబాధ్యమైన రచన చెయ్యాలంటే సలక్షణమైన భాషను ఆశ్రయించక తప్పదు. ఆ భాషకూడా కొంతపురోగమిస్తూనే ఉంటుంది. విస్తృత సాహిత్యాలు నిర్మించుకున్న ఉత్తమ ప్రపంచభాషలన్నీ ఇటువంటి కట్టుదిట్టాలతోనే ప్రగతిని సాధిస్తున్నాయి. మన వీర వ్యావహారిక భాషావాదుల పుణ్యంవల్ల మన తెలుగు దేశంలో మాత్రం మాతృ భాషాజ్ఞాన శూన్యుల రాజ్యం చలామణీలో ఉన్నది.

శ్రీ వెంకటశాస్త్రిగారితో గణింపతగిన వ్యావహారిక రచన చేసినవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. శ్రీపాదవారి రచనల్నికూడా వీర వ్యావహారికవాదులు ఉదాహరిస్తూవుంటారు. ఇతరుల వ్యావహారిక భాషా రచన అంతా ఒకఎత్తు; శ్రీపాదవారి రచన ఒకఎత్తు. ఆయా ఇతర రచయితల రచనలలో—(నిత్యపరిచయంచేత) వాళ్ల వ్యావహారికంలోకూడా—ఎక్కువగా ఆంగ్లవాక్య నిర్మాణ ధోరణులుకన్పడుతూ ఉంటాయి. శ్రీపాదవారి రచన అచ్చమైన తెలుగు వ్యావహారికం. వారి ప్రతి వాక్యంలోనూ, చిన్నతనంలో వారు (రామచంద్రపురం తాలూకాలో) పుచ్చుకున్న నెతిచెఱకు పానకపు తీపివాసనలు గుబాళిస్తూ వుంటాయి. వారి రచనలో సహస్రాధికంగా— ఇప్పుడు వ్యవహారంలోలేని — మనకు క్రొత్తగా ఉన్నాయనిపించే శబ్దప్రయోగాలు. అవి అన్నీ మధురాతి మధురంగా ఉండటం ఇంకోసంగతి. అపూర్వ సాంప్రదాయిక శబ్దప్రయోగాలచేత కనుమరుగైన— ఒక పూర్వాంధ్ర ప్రపంచానికి ఒక నిత్యమైన సాహిత్య రూపాన్ని గడించి పెట్టారాయన. ఈప్రక్రియ వారి "అనుభవాలూ— జ్ఞాపకాలూ—" అన్న గ్రంథాలలో జరిగింది. వారు ఐదారు సంపుటాలు వ్రాసి వెళ్లిపోయినా— ఆమాధుర్య ఖండాలు రెండే ఇప్పటికి భావుకులకు అందుబాటులో ఉన్నాయి. పూర్వాంధ్ర భాషా మాధుర్య స్వరూపదర్శనం కోసమైనా శ్రీపాదవారి గ్రంథాలు చదివి తీరాలి. ఇంతగా మాధుర్యాన్ని గుప్పించే వ్యావహారిక రచనలు రాలేదనేవిషయం నిర్వివాదాంశమే. ఇంతకూ విచిత్రమైన సంగతేమిటంటే శ్రీ శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారు నేటి వ్యావహారికభాషలో వ్రాయలేదు. కనీసం తాము స్వంతంగా మాట్లాడేభాషలోనూ వ్రాయలేదు. వారే చెప్పినట్లు కనుమరుగైన పూర్వ పురుషాంతరంలో అంతర్జనం (శిష్టులైన ఉత్తమస్త్రీలు) మాట్లాడే భాషలో వ్రాశారు వారు. వారిరచనలు వీరవ్యావహారిక వాదుల వితండ వాదాలకు బలం ఇవ్వవు. శ్రీపాదవారు తియ్యని వ్యావహారిక భాషతో రచనలు చేశారు గనుక, మనపిల్లలు తెలుగు భాషా పాండిత్యం

సంపాదించ నక్కరలేదనే వాళ్ల వితండవాదాలకు సమాధానం ఇవ్వడం కష్టమే.

శ్రీ శ్రీపాదవారు భాష్యాంతం సంస్కృతం చదివి జ్యోతిషంలో త్రిస్కంధశాస్త్రం హృత్కవిలిచేసుకుని, శ్రౌతంలో సత్రయాగాంతంగా తెలుసుకుని ఆయుర్వేదం ఆమూలాగ్రం పరిశీలించి అష్టావధానాలు శతావధానాలుచేసి చెళ్లపెళ్ల వెంకటశాస్త్రిగారివంటి వారితో భాషావివాదాలు చేసి నిలబడి (పాణిగృహీతశృంఖల) వ్యావహారిక భాషలో రచనలు చేశారు. అదీవారి వ్యుత్పన్నత. సిగ (కేశసంపద) వుంటే కొప్పుఎట్లా సవరించుకున్నా అందంగానే ఉంటుంది. కేశసంపద లేనివాళ్లు సవరాలు ఎరువుతెచ్చుకున్నా బయటపడిపోతుంది. భాషావిషయంలో అంతే. భాషాపాండిత్యం ఉండి శబ్దస్వరూపజ్ఞానం కలిగి రచనచేస్తే (అది వ్యావహారికమో— గ్రాంథికమో— ఆ రచయితకే వదలివేద్దాం) —అది సుందరంగానే ఉంటుంది. ఆభాషాజ్ఞానం లేకుండా రచనచేస్తే— వ్యావహారికమైనా— గ్రాంథికమైనా రాణించదు. అది ఎరువు తెచ్చుకున్న కొప్పే. అందమైనముఖానికి తిలకం ఎట్లాపెట్టుకున్నా శోభస్కరంగానే ఉంటుంది.అందం లేనిముఖానికి ఎట్లా దిద్దుకున్నా తిలకం అందం తీసుకు రాలేదు.

భాషనుగురించి ఇంత ఎక్కువగా ఎందుకువ్రాశానంటే— మన భాషాజ్ఞానశూన్యుల చేతుల్లోపడి ఆంధ్ర సరస్వతి ఎంత అధోగతి పాలు అయిందో మీరు గ్రహించగల్గుతారని. వ్యావహారిక వాదానికి ప్రాణమైనది అభివ్యక్తీకరణ పద్ధతి అనిన్నీ, శబ్దరూపం కాదనిన్నీ మన వీరవ్యావహారిక వాదులకు తెలియదు. నిత్యజీవనంలో జనం ఉచ్చరిస్తున్నట్లు వ్రాసినందువల్ల వ్యావహారికంకాదు. ఉచ్చారణవల్ల శబ్దంయొక్క నిజరూపం (సాధురూపం) విరూపంగానూ కురూపంగానూ తయారవుతున్నది. జనుల వ్యవహారంనుండి మనం తీసుకోవలసింది వారి అభివ్యక్తీకరణ విధానాన్ని.

ఈ శతాబ్ది ప్రథమ దశకంలో మహోన్నత కీర్తిశిఖరాలపై వసిస్తున్న ఆంధ్ర పండితులు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు. వీరు జన్మించినది (1853) మదరాసులో. ఎక్కువకాలం ఉన్నది కూడా మద్రాసులోనే. కాని వీరి స్వగ్రామం నెల్లరుజిల్లాలో కావలి తాలూకా (కావలికి షుమారు ఎనిమిది మైళ్ళు) మల్లయపాలెం కావడంచేత శ్రీ శాస్త్రిగారిని నెల్లూరు వాస్తవ్యులుగా దేశం పరిగణన చేస్తున్నది. శాస్త్రిగారికి సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, అరవ, కన్నడ, హిందీ భాషలలో పరిపూర్ణమైన పాండిత్యం ఉన్నది. స్వయం కృషిచేతనే బహుశాస్త్రములలో, ముఖ్యంగా తర్క వ్యాకరణ వేదాంతాలలో పారంగతులయ్యారు. ఆయన పురుషాంతరంలో తెలుగుదేశంలో ఆయన్నుమించిన పండితుడు లేడంటే అతిశయోక్తికాదు.

ఆంధ్ర మహా రచయితలలో మహారాజులవల్ల కీర్తి సమ్మానాలు పొందినవారు చాలమంది ఉన్నారు. కేవలం జనసామాన్యంవల్ల, తపోవ్యాసంగంలోఉన్న పీఠాధిపతులవల్ల సత్కారాలు పొందినవాళ్లు ఒకరిద్దరే. శాస్త్రిగారిని 'ఆంధ్ర మహాసభ' 1920 సం. లో 'మహోపాధ్యాయ' బిరుదుతో వెయ్యిన్నూట పదార్లు ఇచ్చి సమ్మానించింది. శ్రీ ద్వారకాపీఠ శంకరాచార్యుల వారు శ్రీ శాస్త్రిగారిని ''సర్వ తంత్ర స్వతంత్ర'' ''మహామహోపాధ్యాయ'', ''విద్యా దానవ్రత మహోదధి''—బిరుదులతో ఆశీర్వదించారు. ఇది ఆంధ్ర సాహిత్య చరిత్రలోనే అపూర్వ సన్నివేశం. తిక్కనగారిని గోళకీ మఠాధిపతి శ్రీ విశ్వేశ్వర శివాచార్యులవారు సమాదరించడం, ఎఱ్ఱాప్రగడగారిని శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు అనుగ్రహించడం, శ్రీనాథ మహాకవిని శాక్తాద్వైత పీఠాధిపతి శ్రీ చంద్రచూడ క్రియాశక్తి అభినందించడం—వాఙ్మయ చరిత్రలో దివ్యమైన ఘట్టాలు. శ్రీ శాస్త్రిగారు ఆంధ్ర సరస్వతికి తత్తాదృశమైన దివ్యసత్కారాలు చేకూర్చిపెట్టారు. శ్రీ శాస్త్రిగారి రచనలలో శృంగార నైషధ సర్వంకషావ్యాఖ్య, ఆముక్తమాల్యదా సంజీవనీవ్యాఖ్య— అనన్య సాధ్యమైనవి. అవి తెలుగు విద్యార్థులకూ, విద్వాంసులకూ కూడా నిత్య పఠనీయాలే.

శాస్త్రిగారు వ్యావహారిక భాషావాదులతో ఏకీభవించలేదు. పైగా ఆ వాదాన్ని ఖండిస్తూ, ''గ్రామ్య భాషా నిరసనము'' అనే గ్రంథాన్ని వ్రాశారు.అయినా తమ నాటకాల్లో పాత్రోచిత భాష అంటూ శిష్ట వ్యావహారికం మాత్రమే కాకుండా—నీచ పాత్రలకు గ్రామ్య భాషకూడా ఉపయోగించారు. వీరు ఉపయోగించిన గ్రామ్యభాష—విస్పష్టమైన ఎనిమిది భిన్న భిన్న

విధాలుగా ఉన్నది. సజీవభాషలోకూడా శాస్త్రిగారి కూలంకష ప్రజ్ఞ కిది గీటురాయి.

శాస్త్రిగారి నాటకాలలో (ప్రతాపరుద్రీయం ముఖ్యంగా) పాత్రోచిత భాష వాడటమే—తెలుగు నాటకాలలో మొట్ట మొదటి సారిగా వ్యావహారికానికి స్థానం రావడమని—వ్యావహారికవాదులు అనుకుంటున్నారు. శాస్త్రిగారికంటె ముందే దక్షిణాంధ్రంలో—వ్యావహారిక భాషా ప్రయోగం గ్రంథాల్లో కనిపిస్తోంది. కాని ఆ గ్రంథాల్లో ఉన్న వ్యావహారిక భాష—నేటి వారి రచనలలోలాగా—మరీ ఇదిగాలేదు. "తంజాపురాన్నదాన మహా నాటకం" ప్రసిద్ధమైంది. అందులో హృద్యమైన వ్యావహారిక భాషా సంభాషణలు ఉన్నాయి.

ప్రతాపరుద్రీయ నాటకంయొక్క ప్రశస్తికి కారణం పాత్రోచితభాష అనేవాళ్లూ ఉన్నారు. "అనియమ్యార్ద్గామ్యం హి యత్త్వపభ్రంశః; నియ భావ తస్తుతత్"—అన్న నన్నయాథర్వణుల సూత్రాలకు విరుద్ధంగా ఉండటంవల్ల అంగీకరించని వాళ్లూ ఉన్నారు. ప్రతాపరుద్రీయం నిజంగా గొప్పనాటకం—ప్రథమాంధ్ర జాతీయ నాటకమని కొందరంటున్నారు. "ఆయన గాలిని బేనును, తోయముతో నరకు, పొగలతో గోడలిడున్" ఈ వాక్యములు యుగంధరుని సామర్థ్యమును నిరూపించుటకు చెప్పబడినవి. పద్యముగా వ్రాయబడినా—మహా శక్తివంతంగా ఉన్నాయి. ప్రతాపరుద్రీయంలోఉన్న వెఱ్ఱి వాని పాటలు, మరేకవీ వ్రాయలేడంటే అసత్యముకాదు. శాస్త్రిగారి రచన పరమ కృతకమైన గ్రాంథికమని వాదించే వాళ్లుకూడా—తెలుగులో మొదటిసారిగా గొప్పనాటకాన్ని వ్రాసిన కీర్తి ఆయనదే అని అంగీకరిస్తున్నారు. ఆ కీర్తి నిత్యమైనది. త్రికాలాబాధ్యమైంది.

శాస్త్రిగారి రచన దుర్గ్రాహ్యంగా ఉన్నదనే వాళ్లుకూడా, ఆయన వ్యాఖ్యానాలు తెలుగు భాషకే ఉత్తమ అలంకారాలనీ—ఆయన కథాసరిత్సాగరం—అపూర్వమైన వచన గ్రంథమనీ వినుతిస్తూనే ఉన్నారు.

---



# అనంత చతుర్ముఖి

శ్రీ కొలకలూరి

అంతంలేనిపురం కాదో మరి ఆంధ్రరాష్ట్రం
అది కూడా కాదంటే సరేలే భారతదేశం

మతాల్లాంటి రోడ్లు మూడు కూడే చోట
సెక్యులరిజం స్తంభంమీద గడియారం చాతుర్వర్ణ్య చతుర్ముఖి.

ఆ ముఖం చూపే టైం,
అయ్యోరామా ఈ ముఖం అంగీకరించదు.
ఏ ముఖమూ ఇంకో ముఖంలా వుండదు.
ఏమీ ఒప్పుకోదు, సుతరామూ సహించదు.

చిన్నముల్లు—మహా టక్కరి, బహు తుంటరి
యమ నెమ్మది, సమ సందడి — హిపోక్రెట్!
పెద్ద ముల్లు — హృది కోవిద, అతి పూజిత
గతిధార్మిక, మితభాషిణి — పయస్సెయింట్!

పెద్దముల్లు చిన్నచేపను, చిన్నముల్లు పెద్దచేప
పెటకంపెట్టి మింగుతుంది గంటకు అరవై సారులు!
గడియారం హృదయువాది, దాని గుండెకాయ
కదిలిస్తే తిరుగుతుందని తెలుసుకొంది మునిసిపాలిటి!

గడియారం సూర్యుడిలా కర్మసాక్షి
కనుగొన్నది వినిపించే గొంతులేని న్యాయపక్షి!

ఈ క్లాక్‌కి విసుగులేదు విరామంలేదు.
దివారాత్రాలు నిద్రాహారాలు లేనేలేవు.
ఎప్పుడయినా బద్ధకిస్తే, అదలించి తోకమెలిపెస్తే, గానుగ
ఎద్దుల్లా తిరుగుతాయి ముళ్ళు!

విధాలుగా ఉన్నది. సజీవభాషలోకూడా శాస్త్రిగారి కూలంకష ప్రజ్ఞ కిది గీటురాయి.

శాస్త్రిగారి నాటకాలలో (ప్రతాపరుద్రీయం ముఖ్యంగా) పాత్రోచిత భాష వాడటమే—తెలుగు నాటకాలలో మొట్టమొదటి సారిగా వ్యావహారికానికి స్థానం రావడమని—వ్యావహారికవాదులు అనుకుంటున్నారు. శాస్త్రిగారికంటె ముందే దక్షిణాంధ్రంలో—వ్యావహారిక భాషా ప్రయోగం గ్రంథాల్లో కనిపిస్తోంది. కాని ఆ గ్రంథాల్లో ఉన్న వ్యావహారిక భాష—నేటి వారి రచనలలోలాగా—మరీ ఇదిగాలేదు. "తంజాపురాన్నదాన మహా నాటకం" ప్రసిద్ధమైంది. అందులో హృద్యమైన వ్యావహారిక భాషా సంభాషణలు ఉన్నాయి.

ప్రతాపరుద్రీయ నాటకంయొక్క ప్రశస్తికి కారణం పాత్రోచితభాష అనేవాళ్లూ ఉన్నారు. "అనియమాద్గ్రామ్యం హి యత్త్వ పభ్రంశః ; నియ భావ తస్తుతత్"—అన్న నన్నయాథర్వణుల సూత్రాలకు విరుద్ధంగా ఉండటంవల్ల అంగీకరించని వాళ్లూ ఉన్నారు. ప్రతాపరుద్రీయం నిజంగా గొప్పనాటకం—ప్రథమాంధ్ర జాతీయ నాటకమని కొందరంటున్నారు. "ఆయన గాలిని బేనును, తోయముతో నరకు, పొగలతో గోడలిడున్" ఈ వాక్యములు యుగంధరుని సామర్థ్యమును నిరూపించుటకు చెప్పబడినవి. పద్యముగా వ్రాయబడినా—మహా శక్తివంతంగా ఉన్నాయి. ప్రతాపరుద్రీయంలోఉన్న వెఱ్ఱి వాని పాటలు, మరేకవీ వ్రాయలేడంటే అసత్యముకాదు. శాస్త్రిగారి రచన పరమ కృతకమైన గ్రాంథికమని వాదించే వాళ్లకూడా—తెలుగులో మొదటిసారిగా గొప్పనాటకాన్ని వ్రాసిన కీర్తి ఆయనదే అని అంగీకరిస్తున్నారు. ఆ కీర్తి నిత్యమైనది. త్రికాలాబాధ్యమైంది.

శాస్త్రిగారి రచన దుర్గ్రాహ్యంగా ఉన్నదనే వాళ్లకూడా, ఆయన వ్యాఖ్యానాలు తెలుగు భాషకే ఉత్తమ అలంకారాలనీ—ఆయన కథాసరిత్సాగరం—అపూర్వమైన వచన గ్రంథమనీ వినుతిస్తూనే ఉన్నారు.

---



# అనంత చతుర్ముఖి

## శ్రీ కొలకలూరి

అంతంలేనిపురం కాదో మరి ఆంధ్రరాష్ట్రం
అది కూడా కాదంటే సరేలే భారతదేశం

మతాల్లాంటి రోడ్లు మూడు కూడే చోట
సెక్యులరిజం స్తంభంమీద గడియారం చాతుర్వర్ణ్య చతుర్ముఖి.

ఆ ముఖం చూపే టైం,
అయ్యోరామా ఈ ముఖం అంగీకరించదు.
ఏ ముఖమూ ఇంకో ముఖంలా వుండదు.
ఏవీ ఒప్పుకోదు, సుతరామూ సహించదు.

చిన్నముల్లు—మహా టక్కరి, బహు తుంటరి
యమ నెమ్మది, సమ సందడి — హిపోక్రెట్!
పెద్ద ముల్లు — హృది కోవిద, అతి పూజిత
గతిధార్మిక, మితభాషిణి — పయస్సెయింట్!

పెద్దముల్లు చిన్నచేపను, చిన్నముల్లు పెద్దచేప
పెటకంపెట్టి మింగుతుంది గంటకు అరవై సారులు!
గడియారం హృదయవాది, దాని గుండెకాయ
కదిలిస్తే తిరుగుతుందని తెలుసుకొంది మునిసిపాలిటి!

గడియారం సూర్యుడిలా కర్మసాక్షి
కనుగొన్నది వినిపించే గొంతులేని న్యాయపక్షి!

ఈ క్లాక్‌కి విసుగులేదు విరామంలేదు.
దివారాత్రాలు నిద్రాహారాలు లేనేలేవు.
ఎప్పుడయినా బద్ధకిస్తే, అదలించి తోకవిరిస్తే, గానుగ
ఎద్దుల్లా తిరుగుతాయి ముళ్ళు!

# అనంత చతుర్ముఖి

లేవు దీనికి రాత్రుళ్ళూ కళ్ళూ కళ్ళజోళ్ళూ,
లేమిలో ఉన్నాయి భార్యా భర్తల్లా సృష్టిని పొడిగించే ముళ్ళు.

ఎటో ఒరుగుతుంది కాకి వాలితే ఎలాగోవున్న ఏదో ముల్లు.
ఎగిరి గంతేస్తుంది ఎటో చూస్తున్న రెండో ముల్లు.

ఎండకు చెమటపట్టి వానకు పొగలు కక్కి
ఏడుస్తూంది పాపం క్లాక్ టవర్!
నాల్గు ముఖాలు నాల్గు దిక్కులు దేబిరిస్తుంటే
నంగిమాటలు పలుకుతూంది టవర్‌క్లాక్!

ఈ గడియారపు స్తంభం పుట్టక పూర్వం
ఇక్కడ మతం—కులం—తెగ పేరిట మేళే జరిగింది.
ఈమధ్యే ఇది పుట్టిన తదుపరి
ఇక్కడే మీ—మా—ఆ—ఈ రూపంలో కీడే మిగిలింది.

ఈ చుట్టూ గందరగోళం ఇద్దరికే సొంతహక్కు.
పనిలేని ప్రబుద్ధుడికీ, చదువురాని విద్యార్థికీ!
ప్రబుద్ధుడు "కీ" ఇస్తే పాడుతుంది స్టూడెంట్ రికార్డ్
ఇక రిక్షాలకు భిక్షాలకు సుక్షేత్రం టవర్ క్లాక్!

వానలేక పంటలేక తిండిలేక బట్టలేక
నీడలేక నిద్రరాక వణుకుతూంది మనిషికేక!
దొంగతిండి దొంగబట్ట దొంగనీడ దొంగిలించి
నింగి చూచి నీల్గుతూంది కొంగజపం కాకిమూక!

ఈ స్తంభం నీడల్లో — ఉన్నాయి.
పెట్రోలు లేని కారు హారనూ,
మేతలేని జట్కాగుర్రం తోక వూపూ,
రిక్షా తొక్కలేని డ్రైవర్ బస్సీ మింగే చెమట బిందువులూ.

తోక తెగిన తల్లిలేని కుక్కపిల్లకు ఆదరణ,
మగాడి రాసిక్యానికి పిచ్చెక్కిన బట్టల్లేని స్త్రీకి పరువు,
చీకటిలో కుమిలిపోతున్న వీధి బల్బ్ మెడమీద నీడ,
లేవు — లేనే లేవు!

భక్తుడి లంచాలు తినే దేవుళ్ళూ,
రసికుడికి మంచాలు వాల్చే వాకిళ్ళూ,
పరువుకి కంచాలు కడిగే పోకిళ్ళూ,
ఉన్నాయి — యథేచ్ఛగా ఉన్నాయి.

ఈ గడియారం ఛాయల్లో — ఉన్నారు.
'రమ్మీ'లో దొంగలెక్కచెప్పే న్యాయవాదులూ,
నీతుల చొక్కాకు గుండీలు విప్పే రసరాటులూ,
నీరా స్థానే సారాయి సేవించే దేశసేవకులూ.

దుకాణం పద్దుబుక్కుల్లో అక్షరాలకు అక్షరాలా అర్థం,
జనన మరణాల జమా ఖర్చుల్లో ససేమిరా నష్టం,
నిద్రలేచిన రోడ్డు గుండెపోటుకు ఆదిమధ్యాంతం,
లేవు— లేనేలేవు!

మార్కెట్టులో డబ్బున్న వాళ్లకే కూరగాయలు లేవు.
పళ్ళ కొట్టులో పళ్ళున్న వాళ్ళకే పళ్ళు లేవు.
రోడ్డులో ఇనుం కాళ్లున్న వాళ్లకే,
గుంటలూ, ముళ్ళూ, పగుళ్ళూ, ఎదుళ్ళూ లేవు.

నమ్మిన ధర్మ విచ్ఛిత్తి చూచి క్రుంగిపోయే జనం,
నమ్మే ధర్మం లేక పొంగిపోయేజనం,
నమ్మిన ధర్మ రక్షణ చేయలేక నాశనమయ్యేజనం,
నడుస్తుంటే చూచి నోరెత్తలేదు గడియారం.

ఆకలయిన కడుపు క్రాస్ వర్డ్ పజిల్.
అన్నం అరగని బొజ్జ మెడికల్ షాప్.
అంతా తిలకించి పలకరించే కన్నీటితో
చింతాక్రాంత అయింది క్లాక్ టవర్ శిలాకాంత!!

అంతంలేని పురం, కాదో మరి ఆంధ్రరాష్ట్రం
అది కూడా కాదంటే, సరేలే భారతదేశం.

---

# సోమర్‌సెట్ మామ్ - ఆయన కథాప్రపంచం

## శ్రీ బుచ్చిబాబు

'నాకేమన్నా వాంఛలూ, కోర్కెలూవుంటే, అవి ఏనాడో తీరాయి. నేను చెప్పదల్చుకున్నదంతా చెప్పివేశాను— తప్పుకుని మరో తరంవారికి చోటివ్వడం మంచిది; నేను చెయ్యదల్చుకున్న వన్నీ చేసేశాను— ఇంక నోరుమూసుకుని వుండటం మంచిది. ఈరోజుల్లో ఏదోఒకరచన చేస్తూ పాఠకలోకంతో బంధం ఏర్పరుచుకోకపోతే ఆ రచయితని మరిచి పోడం జరుగుతుందంటారు. ఇదినిజమే. అందుకు నేను సంసిద్ధుడనే. నే చనిపొయ్యాక, టైమ్స్ పత్రికలో పడ్డ వినుతివాక్యం చదువుకుని, ఎవరన్నా "ఆయన ఇంకా బ్రదికేవున్నాడా— ఎప్పుడో చనిపొయ్యాడనుకున్నానే!" అన్నప్పుడు, భూతంగా మారిన నేను, మెల్లగా నవ్వుకుంటాను.'

అని, సోమర్‌సెట్ మామ్, 'రచయిత నోట్‌బుక్' అనే గ్రంధానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో చెప్పుకున్నాడు. అది వ్రాసినప్పుడు ఆయన వయస్సు డెబ్భైఐదు! అదివ్రాసిపదహారు సంవత్సరాలైంది. 1965 డిశంబరు పదహారవ తేదీని ఆయన తనువు చాలించాడు. ప్రపంచమంతటా శ్రద్ధాంజలులు అర్పిస్తున్నారు. భూతంగా ఆయన మెల్లగా కొనసాగించే నవ్వు నాకు వినబడుతూనే వుంటుంది. నోబెల్‌బహుమానం ఆయనకు రాలేదుమరి!

ఆయనకి ఆ గౌరవం జరగలేదని బాధపడేవారిలో నేనొకణ్ణి. కథారచనలో, ప్రపంచ రచయితలలో మామ్ అగ్రగణ్యుడనడానికి సందేహించను నేను. ఆయన జీవిత విశేషాలనుగురించి, ఇతర రచనల్ని గురించి క్లుప్తంగా చెప్పి, కథారచనావిధానాన్ని పరామర్శించడానికి ఈవ్యాసం తలపెట్టాను.

విలియమ్ సోమర్‌సెట్ మామ్, 1874, జనవరి25వ తేదీని పారిస్‌లో జన్మించాడు. ఆయన తాత ముత్తాతలకిమల్లె, ఆయన తండ్రికూడా న్యాయవృత్తినే స్వీకరించి, బ్రిటిష్ రాయబారి కార్యాలయంలో సలహాదారుగా పనిచేసేవాడు. ఆయన ఎన్నెన్నో దూరదేశ యాత్రలు చేశాడు. దిష్టితగలకుండా, అరిష్టాన్ని వారించే ఒక గుర్తుని— ఒంపుతిరిగి ఏసు సిలువను స్ఫురింపచేసే గుర్తు— మొరాకోనుండి తెచ్చాడు. ఈ గుర్తునే, తన పుస్తకాలపైనా, ఇంటిముందూ, వాడుతూ వొచ్చాడు మామ్. మామ్‌తండ్రి కురూపి; తల్లి సౌందర్యవతి. వారిని ఇరుగు పొరుగువారు 'మృగము— సౌందర్యము' అని ఛలోక్తిగా వ్యవహరించేవారుట. మామ్‌తల్లి ఆరుగురు మగపిల్లల్నికని, ముప్ఫైఎనిమిదవఏట చనిపోయింది. అప్పుడాయన వయస్సు ఎనిమిది. రెండేళ్లతరువాత, ఆయన తండ్రి చనిపొయ్యాడు. ఇంగ్లండ్‌లో మతగురువుగా వుంటున్న మామయ్య— హెన్రిమామ్— దగ్గర చదువుకుంటూ ఆరేళ్ళు గడిపాడు మామ్. సరైన ఆదరణ, పోషణ లేక, ఆయనబాల్యం, కష్టాలతో కూడివుంది. ఆయనకి నత్తి వుండేది,— పెద్దయ్యాక, చికిత్సవల్ల అది తగ్గిందిట— తోటి బాలురు దాని అదనుగా వెక్కిరించి హేళనచేస్తూ వుండడంవల్ల స్నేహంలో మాధుర్యం ఆయనెరగడు.

పదమూడవఏట కాంటర్‌బరీ పాఠశాలలో చేరాడు.— కాని క్షయవ్యాధి చిహ్నాలు పొడసూపడంతో, చదువునిలిపి, చికిత్సకై ఫ్రాన్సులో తొమ్మిదినెలలు గడిపాడు. పదిహేడవఏట హీడెల్‌బర్గ్‌లో ఒక జర్మన్‌కుటుంబం వారితోవుండి, చదువుకున్నాడు. విశ్వవిద్యాలయంలో చేరక పోయినా, క్యూనోఫిషర్ తత్వాన్ని గూర్చిన ఉపన్యాసాలు శ్రద్ధతో వినేవాడు. మతం పట్ల గురితగ్గడం ఇప్పుడే ప్రారంభమైంది. మామయ్య కఠినుడు, పీనాసి, సోమరి. మతగురువులో వుండవల్సిన, ఔదార్యం, ప్రేమ ఆధ్యాత్మికచింతన ఆయనలో లేకపోవడం మూలాన, మతగురువులంతా ఇంతేననుకున్నాడు. నత్తిపోగొట్టమని ప్రతిరాత్రీ దైవాన్ని ప్రార్థించేవాడు మామ్. దైవం ఇవ్వలేదు. దైవంలో నమ్మిక పోడానికి ఇదొకకారణం.

1892 లో లండన్‌లో సెంట్‌థామస్ హాస్పిటల్ నిర్వహించే వైద్య విద్యాలయంలోవిద్యార్థిగా చేరాడు మామ్. ఆంగ్ల, ఫ్రెంచ్, ఇటాలియన్ సాహిత్యాలు, చరిత్ర, విజ్ఞానశాస్త్రం చదువుతూ, ఏకాంకికలు వ్రాస్తూ గడిపేవాడు ఆరోజుల్లో. ఆనాటకాలను, రంగస్థల నిర్వాహకులు స్వీకరించలేదు. రెండు,

మూడు నవలలు వ్రాసి, పేరుతెచ్చుకుంటే తప్ప, నాటకాలు చలామణికావని భావించి, రెండు నవలికలు వ్రాశాడు. ఫిషర్ అన్విన్ అనే ప్రచురణకర్త వీటినీ స్వీకరించలేదు. ఏదన్నా పెద్ద నవలవుంటే, ఇవ్వమన్నాడు. వెంటనే నవల ప్రారంభించాడు మామ్. హాస్పిటల్ ప్రసూతిశాఖ గుమాస్తాగా, మురికిపేటలు సందర్శించి, అరవై మూడు పురుళ్లుపోసిన అనుభవం గడించాడు. బీదల జీవితాన్ని జాగ్రత్తగా పరిశీలించే అవకాశమూ అప్పుడే కలిగింది. కాయకష్టంపై బ్రతికే బీదల్ని గురించి ఆర్థర్ మారిసన్ అనే ఆయన వ్రాసిన నవల— 'చైల్డ్ ఆఫ్ ది జాగో'— జనాన్ని ఆకర్షించింది. కల్పన చెయ్యకుండా, తను విన్నదీ, చూసినదీ— డాక్టరు రోగిని పరిశీలించేవిధంగా— వ్రాసి పూర్తి చేసిన మొదటినవల 'లిజ ఆఫ్ లాంబెత్.' 1897 అక్టోబర్‌లో ఈ నవల వెలువడింది.

లిజా అనే బీదకన్య పాపకార్యాలుచేసి చనిపోతుంది. పశ్చాత్తాప పడదు. పాపానికి ఫలితం మృత్యువు అన్నధ్వని ఈ నవలలోలేదు. నీతిపాఠాలులేవు. పాత్రల అంతరంగ భావాలచిత్రణ లేదు. భావగర్భితమైన ఉద్రేక ప్రకర్ష లేదు. పాత్ర చెప్పేదీ, చేసిందీ— పైకగపడే వీటినిమాత్రం వర్ణించడం జరిగింది ఇందులో — పైకి అగుపడే చిహ్నాలని బట్టి, వ్యాధి ఏదైందీ వైద్యుడు నిర్ణయించే ధోరణిలో నాడిన భాష, ఆ పాత్రలు నిత్యమూ మాట్లాడే వ్యావహారికమే—ప్రాంతీయంలో వుండే వైవిధ్యమూ, వేగమూ, సంభాషణలకి పదును కల్పిస్తాయి. ఆనాటివారు, 'కడుపు' అన్న పదానికి అభ్యంతరం చెప్పడం, ఆమాటని తీసివెయ్యడం జరిగిందిట. ఈ నవల పాఠకుల్ని ఆకర్షించింది. సమీక్షలుకూడ మొత్తంమీద ప్రోత్సాహకరంగానే వున్నాయిట. సంప్రదాయ సాహితీవేత్త ఎడ్మండ్ గాస్‌కూడా ఈనవలను మెచ్చుకున్నాడుట. పదేళ్లు జరిగి చాలా రచనలు చేసి పేరుతెచ్చుగున్న మామ్‌ని కలుసుకున్నప్పుడు "ఆఒక్క మంచి నవలా వ్రాసి ఊరుకోడం బాగుండదబ్బాయ్!" అన్నాడుట గాస్.

ఆరోజుల్లోనే, తాను గమనించిన వింతలనూ, విన్న చమత్కార భావాలనూ, నోటుబుక్కులో వ్రాసుకోడం మొదలెట్టాడు మామ్. ఆయన డెబ్భై ఐదవఏటికి, యివి పదిహేను నోటుబుక్కులయ్యాయి. వీటిని సంక్షిప్తపరచి 'రచయిత నోట్ బుక్' గా వెలువరించాక ఆయన కొత్త రచనలేవీ చెయ్యలేదు.

వైద్య విద్యాలయంలో ఐదేళ్లు చదివి, 1897 లో వైద్యవృత్తి పట్టా పుచ్చుకొని డాక్టర్‌మామ్ అయ్యాడు కాని వైద్యవృత్తిని విడిచేసి, సాహిత్యరంగంలో విజయం సాధించాలని నిర్ణయించుకుని, నవలారచన కొనసాగించాడు. 'యోగిపుట్టుపూర్వోత్తరాలు' అన్న నవలలో, తనే 'నేనుగా' కథచెప్పడం జరుగుతుంది. 'నేను'గా కథ చెప్పడమే, కథారచనకి మామ్ సమకూర్చిన ప్రత్యేకత.

స్పెయిన్ దేశంలో ఏడాది గడిపి, రోమ్‌లో వుండగా, 'ఏమాన్ ఆఫ్ ఆనర్' అన్న మొదటి రంగస్థలనాటకం పూర్తి చేశాడు మామ్. ఇంగ్లండ్ వొచ్చాడు. ఆయన నవలలు ప్రజామోదం పొందకపోయినా, విమర్శకులు, 'ఫరవాలేదు, బాగున్నాయి' అనడం, ధనికవర్గాలవారు ఆదరంచూపి, పార్టీలకి ఆహ్వానించడం జరిగింది. 'మిసెస్ క్రాడక్' అనే నవల 1902లో వెలువడింది. ఇందులో డబ్బుండి, పెద్దకుటుంబానికి చెందిన క్రాడక్ అనే ఆమె, తక్కువ అంతస్తువాడైన ఒక పంటకాపుని ప్రేమించి పెండ్లిచేసుకుంటుంది. ఆ వివాహం నెగ్గదు. ప్రేమ నశిస్తుంది. శక్తులన్నీ ఉడిగి ప్రేమ చావడంలో విషాదంవున్నా, మానసిక స్వేచ్ఛని పొందాను కదా నన్న ఆహ్లాదంతో ఆమె సంతృప్తి చెందుతుంది. మొగుడు, గుర్రంమీదనుండి పడి చనిపోతాడు.

1903 లో రంగస్థల సమాజంవారు, మామ్ వ్రాసిన 'ఏ మాన్ ఆఫ్ ఆనర్' (గౌరవనీయుడు) అనే నాటకాన్ని స్వీకరించి ప్రదర్శిస్తారు! తన సంపర్కంవల్ల పనిమనిషి గర్భం ధరిస్తుంది. కాబట్టి ఆమెను వివాహమాడతాడు గౌరవనీయుడు— ఇదీ ఈ నాటకంలో ఇతివృత్తం. తర్వాత రెండేళ్లు పారిస్‌లో గడిపాడు మామ్. పారిస్‌లో చాలామంది చిత్రకారులతో, రచయితలతో పరిచయం ఏర్పడుతుంది. 1905 లో స్వదేశానికి తిరిగి వొస్తాడు. ఏ కొద్దిమంది తెలివైనవారో మెచ్చుకోడం మినహా, రచనల ద్వారా తా నాశించిన డబ్బు రావడంలేదు. డబ్బు ఆరవ ఇంద్రియంలాంటిది. అది వుంటేనేగాని మిగత పంచేంద్రియాలూ పని చెయ్యవని తెలుసుకుని, హాస్య పూరితాలైన సుఖాంత నాటకాల రచన సాగించాడు. నిర్వాహకులు, నటులు సూచించిన ప్రకారం, మార్పులు చేసేవాడు. ఒక నాటకం 'లేడి ఫ్రెడెరిక్' అనేది. చింతామణి నాటకం చివరి రంగంలో తన నిజ స్వరూపం చూపినట్లు ఇందులో లేడిఫ్రెడెరిక్, యువకుడైన ఒక ప్రియుడి ముందు, తన వేషం, 'మేకప్' తీసేసి, అసలు వాలకం బైట పెడుతుంది. ఆనాటి నటీమణులు, ఈ వేషం వెయ్యడానికి ఇష్టపడలేదు. మరి రెండు నాటకాలని వ్రాశాడు. వీటినీ ఎవ్వరూ ఆడలేదు. మధ్యలో అనువైన నాటకం దొరక్క, ఓథో స్టూవార్ట్ అనే మేనేజర్ 'లేడి ఫ్రెడెరిక్' నాటకాన్ని 1907 లో ప్రదర్శించాడు. ప్రధాన పాత్ర మేకప్ తీసేసి నిజ స్వరూపం బైట పెట్టినఘట్టమే ప్రేక్షకుల్ని ఆకర్షించింది. దిగ్విజయంగా ఏణ్ణర్ధం ప్రదర్శించబడింది ఈ నాటకం. మరొక ఆరు మాసాలలో, మరో నాలుగు నాటకాలు ప్రదర్శించబడ్డాయి. మామ్ ఆశించిన ఒక ఫలితం సిద్ధించింది. నాటకాలవల్ల చాలా డబ్బు సంపాదించాడు. డబ్బుతో స్వేచ్ఛ.

మామ్‌కి దేశాటనంటే ఇష్టం. వచ్చిపడ్డ ధనంతో తన కిష్టమైన పనులు చెయ్యకలిగాడు. 1908 గ్రీస్ దేశం పర్యటించాడు. 1911 లో మేఫేర్‌లో సొంతిల్లు కట్టుగున్నాడు. పదిమందినీపిల్చి పార్టీ లివ్వసాగాడు. ఆయన నాటకాల్లో ప్రధాన పాత్ర ధరించిన బిల్లీబర్క్ అనే నటీమణి, అతిథిగావొచ్చి, ఇంటిని మెచ్చుగుంది. "నీకు నచ్చి తీరాలి—నీ డబ్బుతో కట్టిందే" అన్నాడుట మామ్. ఆయన 1898—1933 మధ్య ముప్ఫై నాటకాలు వ్రాసినా, పద్దెనిమిది మాత్రమే గ్రంథాలుగా వెలువడ్డాయి.

# సోమర్‌సెట్‌మామ్ - ఆయన కథాప్రపంచం

ఇవి అమెరికాలోనూ, ఇంగ్లండ్‌లోనూ ప్రదర్శించబడి, ప్రేక్షక జనం మన్ననల నందుకున్నవి. 'ది సర్కిల్'అనేది ఆయన ఉత్తమ నాటకంగా ఎన్నిక చేస్తారు విమర్శకులు. ఈయనవన్నీ వినోదాన్ని కలిగించేవే; గంభీరంగా, బరువుగాసాగి, పదికాలాలపాటు నిలబడే నాటకాలు వ్రాయలేడనుకుంటారని కాబోలు, కొన్ని విషాదాంత నాటకాలు వ్రాశాడు. ఒకటి యుద్ధానికి సంబంధించినది. యుద్ధంలో గాయపడి ఇంటి కొచ్చిన ఒక సైనికుడు కుంటి వాడై, బైటకి వెళ్లలేక, ఎప్పుడూ కుర్చీలో గడుపుతూ, భార్య సపర్యలవల్ల, పైకి సంతోషంగా వున్నట్లు కనబడినా, తన స్థితి భార్య వినోదాలకి అంతరాయమని గ్రహించి బాధ పడతాడు. ఆమెను స్వేచ్ఛగా తిరగమని కోరతాడు. ఆమె అల్లా చెయ్యలేదు; తిరగకుండా వుండనూలేదు. ఈ పరిస్థితి గమనించి, అతనితల్లి అతనికి విషం పెట్టి చంపుతుంది. ప్రేక్షకులు ఈ నాటకాన్ని హర్షించలేదు. మనకి అసలే నచ్చదు. ఉదాత్తంగా సాగిన 'షెప్పీ' అనే నాటకం కూడా దెబ్బతింది. ధనం సంపాదించిపెట్టినా, నాటక రచన మామ్‌కి తృప్తి నివ్వలేదు. కథా రచనలోనే నిజమైన ఆనందాన్ని పొందానంటాడు. మొదటి ప్రపంచ సంగ్రామం ప్రారంభమైన ఏడాదికి ''ఆఫ్ హ్యూమన్ బాండేజ్''అనే పెద్దనవల మొదలెట్టి, రెండేళ్లలో పూర్తిచేశాడు. 1915లో ఇది ప్రచురితమైంది. యుద్ధకాలంలో ఈనవలని గురించి ఎవరూ అంతగా పట్టించుకోకపోయినా, కాలం గడిచినకొద్దీ పాఠకులని ఎక్కువగా ఆకర్షిస్తూ, యీనాటికీ ఆంగ్ల సాహిత్యంలో మహోన్నతమైన నవలగా, దాని ఖ్యాతి స్థిరపడిపోయింది.

''నన్ను బాధించే కొన్ని సంఘటనలు, కుంగదీసే అంతరంగం—వీటినుండి విముక్తుణ్ణవడానికి వ్రాశాను ఈ నవల. వ్రాశేసాక బాధ తొలిగింది. ఆంతరంగిక కల్లోలం అధోలోకం నుండి బైట పడ్డాను. మానసిక జాడ్యానికి మందులా పని చేసింది'' అని చెప్పుకున్నాడు మామ్, ఈ నవల్ని గురించి. మానవుడి వ్యవస్థ ఎంతో సానుభూతితో చిత్రితమైంది ఈనవలలో. ఏ ఇతర రచనలోనూ సాధ్యపడని ఆదర్శతత్వం ఇందులో వ్యక్తం చెయ్యగలిగాడు. ఆయన స్వీయ చరిత్ర ఛాయలున్నాయి ఇందులో. చిన్నప్పుడు తను పడ్డ కష్టాలు, బాధలు, నడివయస్సులో స్మరించి, వూహా జగత్తులో సాంకేతికాలుగా వాటిని మార్చి, కళాసృష్టికి అనువైన సంఘటనలుగా మలచి ఆ అనుభూతిని ఇతరులతో పంచుకోడంలో కృతకృత్యుడయ్యాడు రచయిత. స్వీయగాథని స్మరించే కల్పనకి పరిపూర్ణత సమకూరదు. తన గతాన్ని, వ్యక్తిత్వాన్ని దిగవిడచి, దూరంగా పారిపోయి, తటస్థంగా తిలకించి, వాటిని భరించగల జగత్తుని కల్పించి, నిజంగా జరిగిన వాటిని, వూహించిన వాటితో పూర్తిగా సమన్వయ పరచగలగడం, చాలా కష్టం. నిజంగా జరిగినవి తమ నీడల్ని ప్రసరింపచేస్తూనే వుంటాయి. కథని సాగనివ్వవు. అడ్డుకుంటాయి. వాటిని మరిచిపోలేడు రచయిత. ఈ సంఘర్షణలో, యదార్థ సంఘటనే నెగ్గుతుంది. కళాసృష్టి కుంటుపడక తప్పదు.

'ఆఫ్ హ్యూమన్ బాండేజ్'—అంటే అర్థం మానవత్వానికి దాసులవడం అన్నమాట. 'స్పెయినోజా'' అనే డేనిష్ తాత్వికుడి రచనలో ఉదహరించిన వాక్యమే ఈ నవల పేరు. మానవుడు, ఉద్రేకానికి బానిస. అతని జీవితాన్ని పాలించేది ఉద్రేకాలే. బుద్ధి వల్ల, తార్కిక జ్ఞానంవల్ల, మన ప్రవర్తనని నిర్ణయించుకోగల మనుకుంటే అది భ్రమ. తార్కికజ్ఞానం నిర్దేశించిన దోవలో నడుచుకోమని పెద్దలు, పిన్నలకి బోధిస్తారు. పెద్దయ్యాక, ఇది అసంభవమని పిన్నలు తెలుసుకుంటారు. అసత్యాలు బోధించిన పెద్దలను నిందిస్తారు.

ఇందులో ప్రధాన వ్యక్తి ఫిలిప్ కేరి. మామ్‌లాగానే వైద్య విద్య నభ్యసించి, డాక్టరవుతాడు. తక్కువ అంతస్తుకు చెందిన, మిల్డ్రెడ్ అనే కులటను వాంఛిస్తాడు. ఆమె ఇతన్ని తృణీకరిస్తుంది. బాధపడేటట్లు,ఇతనిముందే నలుగురితోనూ స్వేచ్ఛగా తిరుగుతుంది. ఇతన్ని దగ్గరకు రానివ్వదు. ఆమె కులటని, నీచమైన స్త్రీ అని ఇతనికి తెలుసు. తెలిసి కూడా, ఆమెపై వాంఛను వొదులుకోలేడు. ఆమెను పొందడంకోసం, ఎన్ని కష్టాలైనా భరిస్తాడు. శరీర చాపల్యంవల్ల, మనిషి, మరొక వ్యక్తికి బానిస కావాల్సి రావడం, ఇందలి విషాద కథనం. మామ్‌కి నత్తి ఉన్నట్లుగానే, ఫిలిప్ కేరికి ఒంకరపాదం వుంటుంది. కోపగించినవారంతా, అతన్ని బాధపెట్టడానికి, 'కుంటి వెధవా' అని తిడుతూ వుంటారు. భౌతికమైన ఈ లోటు, తోటివారినుండి అతన్నిదూరంచేస్తుంది. అతనికి ఆదరణ, ప్రేమ, ఆప్యాయత కావాలి. వాటిని అన్వేషిస్తాడు. అవి దొరకవు. అతనికి కావల్సినప్పుడు అవి దొరక్కపోవడం విశేషం.

మామ్ చిన్నతనంలో ఒకామెను ప్రేమించాడుట. ఆమె మెప్పు పొందాలంటే, డబ్బు గడించాలి. అందుచేత డబ్బు గడించే కృషి చేశాడు. కొంత కాలం గడిచి, పేరూ, డబ్బు సంపాదించాక, ఆమెపట్ల ఇష్టం పోయిందట. మామ్‌కి, ఫ్రెంచి నవలాకారుడు మార్సెల్ ప్రూస్ట్ రచనలంటె చాలా ఇష్టం. ''మనకి ప్రేమ లభ్యం కావడంమట్టుకేకాదు ముఖ్యం; అది కావాల్సినప్పుడు దొరకడం ముఖ్యం'' అంటాడు ప్రూస్ట్. ఈ నవలలో, తన జీవితాన్ని పాడు చేసుకున్న మిల్డ్రెడ్, తనని వెనక ఆరాధించిన ఫిలిప్ కేరి దగ్గరకు చేరుతుంది. ఇప్పు డతనికి ఆమె అక్కర్లేకపోతుంది. ఆదరిస్తాడు. కాని వాంఛించడు. ఇందులో కరుణరసం ప్రస్ఫుటమౌతుంది. ఇంక అతనికి కావల్సిన ఆప్యాయత, అనుభూతిని, చిత్రలేఖనంలో పొంద యత్నిస్తాడు. చిత్రకళ అతనికి అలవడదు. స్త్రీ సంపర్కంలో వెదుకుతాడు; తన వంకరపాదం అడ్డు తగుల్తుంది. పుస్తకాలు, సంస్కృతి, కళలు—ఇవేవీ అతనికి కావల్సిన దాన్ని ఇవ్వలేవు. ఆధ్యాత్మిక చింతనలో శాంతిని చూరగొంటాడు. ''నాకాలుని బాగు చెయ్యి'' అని దైవాన్ని ప్రార్థిస్తాడు, మామ్ కి మల్లే. బాగవదు. దైవంపై గురి తప్పుతుంది. మత బోధకుడైన మామయ్య చెప్పు చేతల్లోవుంటూ, మామయ్యని ద్వేషిస్తాడు. మామయ్యకి జబ్బు చేస్తుంది—చావడు. చంపాలనుకుంటాడు. ఆయన చనిపోతే, ఆయన ఆస్తి తనకే సంక్రమిస్తుంది. విరక్తుడై జీవితానికి అర్థం లేదనుకుంటాడు. చివరకి, నాగరికతకి దూరంగావున్న, ఒకసామాన్య కుటుంబం ఇతన్ని చేరదీసి ఆదరి

స్తుంది. ఆ కుటుంబంలో ఒకమ్మాయి, ఇతని పట్ల ప్రేమ చూపెడుతుంది. ఆమెను పెండ్లాడి, శాంతినిపొంది, జీవితంతో సమాధానం కుదుర్చుకుంటాడు.

ఇదిచాలా పెద్దనవల— వెయ్యి పుటలుంటుందేమో. నవలగా సంతృప్తి కరంగా లేకపోయినా, ఇది గొప్పగ్రంథం. ఫిలిప్‌కేరీలో మానసిక ఆవేదన మినహా, ఇతరపాత్రలకి అంతరంగ జీవితంవున్నట్లు తోచదు. ముందుకుసాగేబలం లేదు కథలో. సామాజిక శక్తుల రాపిడివల్ల ఉత్పన్నమైన సంఘర్షణ లేదు. ప్రధానవ్యక్తితప్ప, పాత్రలు మానసికంగా పెరగవు. యుద్ధంలో చిక్కుకున్న పాశ్చాత్యదేశాల హాహాకారాలు విన బడకుండా, ప్రశాంతతని అన్వేషించడం, అది ఏదోవిధంగా ఒక సామాన్యవ్యక్తికి లభ్యంకావడం,— ఈగ్రంథంలో విశిష్టత. ఆదర్శతత్వం, అంతరంగచిత్రణ, ఉద్రేకంతో ఊగిపొయ్యే దైన్యం— ఈనవలలో దర్శనమిచ్చే యీలక్షణాలేవీ, మాప్ ఇతర రచనలలో అంతగా కనబడవు. ఇతర రచనలలోవున్న 'మాప్ తత్వం'—విరక్తుడై (cynic) వెక్కిరించే ఉద్దేశంతో జరిపే నిశిత బాహ్య పరిశీలన, మురికి గుంటలో నక్షత్రాల ప్రతిబింబాన్ని చూడాలన్న ఉబలాటం, శిఖరానికి చెయ్యి చాచేవ్యక్తిని లోయలోకి త్రోసివెయ్యడం, నగ్నసత్యానికి బట్టలు తొడక్క పోవడం — ఈనవలలో అంతగా కనబడదు. అందుకే ఈగ్రంథం నిలబడుతుంది.

1915లో విడాకులుపొందిన 'సిరివెల్‌కమ్' అనే ఆమెను పెండ్లాడాడు మాప్. వీరికి ఒకకుమార్తె కలిగింది. మొదటి నవల ప్రధానపాత్ర లిజ—'ఎలిజబెత్‌కు' సంక్షిప్త నామం— ఎలిజబెత్ అని ఆమెకి నామకరణం చేశారు వారి యీ దాంపత్యం పన్నెండు సంవత్సరాలు సాఫీగాసాగి, విడాకులుపొంది విడిపొయ్యారు. భార్యకు కొన్నివేల పౌనులు ఇచ్చాక, వివాహం రద్దైంది. గృహాలంకరణ వృత్తి కొనసాగిస్తూ, భార్య 1955లో చనిపోయింది. కుమార్తె, తల్లితో వుంటూ వొచ్చింది. విన్‌సెంట్ పరవిసిని అనేఅతన్ని వివాహమాడింది. ఆమె కిద్దరు సంతానం . అమెరికాలో నివాసం ఏర్పరుచుకుంది. మొదటి యుద్ధం కొనసాగేరోజుల్లో, మాప్, రెడ్‌క్రాస్ సంస్థలో పని చేస్తూ, ఫ్రాన్స్, బెల్జియమ్ దేశాలలో గడిపాడు. ఈసమయంలో వ్రాసిన 'మనపెద్దలు'— Our Betters— అనేనాటకం న్యూయార్క్‌లో ప్రదర్శించారు. అక్కడ సంచలనం కలిగింది. పనిపాటాలేకుండా, ఆస్తుల్ని అనుభవించి, పూసుపోక ప్రేమకలాపం జరుపుతూ, వ్యభిచరిస్తూ నైతిక పతనం చెందే స్త్రీ పురుషులు ఇందలి పాత్రలు. బాధ్యతారహితులైన వారిజీవితాలు నైతిక అరాజకత్వంలో అంతమొందుతాయన్న గుణపాఠం ఇమిడివుంది. కాని ఆపాఠం చెప్పివెయ్యడు నాటక కర్త.

శత్రురాజ్యాల భోగట్టా సేకరణ శాఖలో, గూఢ చారుడుగా కొంతకాలం పనిచేసి ఇటలీ, స్విట్‌జర్లండ్, దేశాలు పర్యటించాడు మాప్. అప్పటి అనుభవాలని పురస్కరించుకొని 'ఎషెండెన్' అనుపేరిట కొన్నికథలు, గాథలు, వ్రాశాడు.

కల్పితాలైనా, ఈకథలు యదార్థ సంఘటనలేనని అప్పటివారు నమ్ముతూ, గూఢచారుల శిక్షణ పాఠ్యగ్రంథంగా స్వీకరించారుదీన్ని. యదార్థసంఘటనలకి మరీదగ్గరగా వుండటం వల్లకాబోలు, కథలుగా ఇవంత ముఖ్యమైనవికావు. తర్వాత, అమెరికా, రష్యాదేశాలు పర్యటించాడు మాప్. దక్షిణ పసిఫిక్ దీవులతో— హవై దీవులు— ఆరునూసాలుగడిపాడు. ప్రసిద్ధ చిత్రకారుడు పాల్‌గాగెన్ టహిటి దీవిలో వుండి, అక్కడి స్త్రీని పెట్టుకుని, చిత్రలేఖనంలో నిమగ్నుడై, కుష్ఠువ్యాధికి గురై, చనిపొయ్యాడు. టహిటిదీవిలో, యీచిత్రకారుణ్ణి గురించిన వివరాలు సేకరించి, 'ది మూన్ ఎండ్ సిక్స్ పెన్స్'— చందమామ, ఆరుపెన్నీలు— అనే నవల వ్రాశాడు. ఇందలి ఇతివృత్తం, ఫ్రెంచ్‌చిత్రకారుడు పాల్‌గాగెన్ జీవిత విశేషాలను అనుసరించి వుంటుంది. చిత్రకారుడికి, తను తలపెట్టిన కళాసృష్టి ముఖ్యం. స్త్రీకి ప్రేమముఖ్యం. భర్తని చీరకొంగుకి కట్టిపడేస్తానంటుంది. అల్లా లొంగిపోయినవాడు, కళాసృష్టి చెయ్యలేడు. కాబట్టి ఈనవలలో చిత్రకారుడు, భార్యని, పిల్లల్ని, వొదిలేసి, నాగరిక ప్రపంచాన్ని విస్మరించి, మారుమూలైన దీవిలో వుండిపోయి చిత్రలేఖనం సాగిస్తాడు. చదువు సంస్కారంలేని ఆప్రాంతం కన్యతో గడుపుతాడు. అతిశయోక్తితో, ప్రచండవేగంతో సాగుతుంది ఈ నవలశైలి. అనుమానం వున్నవాడు, గట్టిగా బల్లగుద్ది చెప్పినట్లు, వాక్యాలు, పాదాలకి పొడుగాటి కర్రలు తగిలించుకొని వాటిమీద నడిచినట్లు సాగుతాయి. చివరలో కొన్నిభాగాలు విసుగుపుట్టించినా, శక్తివంతమైన రచనవల్ల, చివరంటా చదవకుండా వుండలేము. చందమామకై చేతులుచాచి, పాదాలదగ్గరున్న 'ఆరణా' లను ఒదులుకుంటామన్న ధ్వనివుంది, ఈనవలపేరులో.

పాశ్చాత్య నాగరికతలో దగా, కుతంత్రం, అసహజమైన విలువల అన్వేషణ, వున్నాయనీ, మానవుడు పూర్తిగా వికసించి తనశక్తులన్నింటినీ వినియోగించి ప్రయోజనాన్ని సాధించాలంటే అది యీనాగరికత కప్పిన ముసుగులో పడిపోయిన వారికి సాధ్యం కాదన్న భావం వుంది ఈనవలలోనూ, మాప్ ఇతర రచనల లోనూ. ప్రకృతిలోకి పారిపోయి, సహజంగా, స్వేచ్ఛగా జీవిస్తూ ఆనందాన్ని పొందడమే పరమావధి అన్నపాఠం డి. హెచ్. లారెన్స్ నవలల్లోనూ కనబడుతుంది. ఇది అప్పటివారికి రుచించినట్లులేదు. లారెన్స్ వలసపోయి, ఇల్లూవాకిలీలేక దేశదేశాలు తిరుగుతూ, వ్యాధిగ్రస్తుడై, చనిపొయ్యాడు. మాప్ రచనలకి స్వదేశమైన ఇంగ్లండులో పలుకుబడీ, ఆదరణా లేవు.

దక్షిణదీవుల పర్యటన చేస్తూనే, మాప్, 'పాగో పాగో' అనేచోట, ఒకవారం గడపాల్సివచ్చింది. అట్లమ్మ చెలరేగిందిట. అది తగ్గేవరకూ ఎవరూ ఓడలోకి పోకూడదన్నారట. అందుకని యాత్రీకులు అక్కడ వారం గడిపారు. ఆయాత్రికులలో, ఒక మతప్రచారకుడు, ఆయన భార్య, వేశ్యవృత్తిలోవున్న ఒకామె,

వున్నారు. ఈమెను గురించి మామ్ వ్రాసిన 'వర్షం' (Rain) అన్నకథ ప్రసిద్ధిపొందింది. ఆయన కథలన్నింటిలోకీ ఉత్తమమైందిగా దీన్ని ఎన్నిక చేశారు, విమర్శకులు. దీన్ని నాటకంగా ప్రదర్శించారు. సినిమా చిత్రంగా తీశారు.

క్షయవ్యాధికి గురై రెండు మూడు సంవత్సరాలు చికిత్స నిమిత్తమై నర్సింగ్‌హోమ్‌లో గడిపి, బాగైనాక, 1920 లో మామ్ చైనాదేశ యాత్ర చేశాడు. 1921 లో, మలే స్టేట్స్, ఇండో చైనా తర్వాత, జావాదీవులు, ఆస్ట్రేలియా దేశాలు, 1923 లో దక్షిణ అమెరికాలు, 1924 లో బోర్నియో, సయామ్‌లు, 1935 లో ఇండియా దేశాలు పర్యటించాడు. ఆయా దేశాలనుండి కథలకి, నవలలకీ అనువైన వస్తువు సేకరించాడు. తాను చూసిన వాటిని వర్ణిస్తూ, కొన్ని యాత్రా గ్రంథాలు వ్రాశాడు మామ్. మొదటిది అండలూసియా ప్రాంతం గురించినది. ఆంగ్లగద్య రచయితలైన హాజ్‌లిట్, బర్క్, న్యూమన్ మాత్యుఆర్నాల్డ్ రచనలు ఈయనకి ఇష్టం. వారి శైలిని బాగా పరిశీలించి, తన శైలి ధోరణి ఎట్లాంటిదో తెలుసుకునేందుకు యీ పుస్తకం వ్రాసినట్లు తోస్తుంది. రెండోది స్పెయిన్‌దేశం గూర్చినది. వారి చరిత్ర, సాహిత్యంపట్ల ఆయనకి ఎంతో అభిలాష. పరిశోధనదృష్ట్యా, చాలా సంగతులు సేకరించి, వ్యాసాలుగా కూర్చిన గ్రంథం—'డాన్‌ఫెర్నాన్‌డో' అన్నది. ఇందులో పొందుపరిచిన కొన్ని విషయాలు ఆధారంగా, రెండు నవలలు వ్రాశాడీయన. మూడవది చైనా దేశంలో యాత్రల వర్ణన—'ఆన్ చైనీస్ స్క్రీన్'—అన్నది. చైనాలో ఆయన చూసిన వింత దృశ్యాలు, కలిసిన వింత వ్యక్తులు, వారు చెప్పే కథలు—కొన్ని విషాదకరమైనవి, కొన్ని హాస్యపూరితములైనవి—అవన్నీ రచయిత వ్యక్తిత్వం తయారుచేసి ఇచ్చిన అద్దం ద్వారా చూస్తాం.

చైనా యాత్రాగ్రంథంనుండి కొన్ని ఉదహరిస్తాను.

దూరదేశాలలోవుండే వారి అవస్థ వర్ణిస్తూ—"తనకి చాలా ఇష్టమైన ఇంటిని చూసి తట్టుకోలేడన్న భయంతో స్వగ్రామానికి వెళ్లలేడు; పుస్తకాలు చదవడు.—చదివితే వెనకటి జ్ఞాపకాల్ని భరించలేడు. ఏ జగత్తుని మనసారా వాంఛిస్తాడో, ఆ జగత్తుతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవాలన్నట్లూ, దూర ప్రాంతంలోని వొక అధమురాల్ని కట్టుకుంటాడు."

చైనాలో అడుగడుక్కీ తగిలే దుర్వాసన్ను గురించి: "ప్రాక్ దేశాలలో మానవ సమానత పాశ్చాత్య దేశాలలోకంటె ఎక్కువగా కనపడ్డానికి కారణం, దుర్వాసనలే. పాశ్చాత్య దేశాలలో, కష్టించి పని చేసేవాడే పాలకుడవుతున్నాడు. కష్టించి పని చేసేవాడు వాసనేస్తాడు. వాళ్లతో కలవలేము.....చైనాలో అందరూ ఈ దుర్వాసనలకి అలవాటు పడి వుండటంవల్ల వారు వాటిని గమనించరు—కాయకష్టపడేవాడూ, పడనివాడూ— అందరూ సమానులే. ప్రజాస్వామ్య సంస్థలు వర్ధిల్లాలంటె మురికిగుంట అవసరం."

మూడవ యాత్రా గ్రంథం— ది జెంటిల్ మెన్ ఇన్ ది పార్లర్—అరుగుమీద కూర్చున్న పెద్దమనిషి—అన్నది. ఇందులో రంగూన్‌నుండి, హైఫాంగ్ వరకూ చేసిన ప్రయాణం వర్ణన లున్నాయి. మామ్ యాత్రా గ్రంథాలన్నింటిలోకి ఇది బాగుంటుంది. ఇందులో మంచి కథలున్నాయి. ఒకటి మేబెల్‌అనే ఆమెను గురించినది. మేబెల్, జార్జి—తాంబూలాలు పుచ్చుకున్నారు. ఇంక పెండ్లి జరగాలి. కాని ఏదో ఆటంకం ఏర్పడుతూనేవుంది. మేబెల్ తండ్రి చనిపోతాడు; యుద్ధం వస్తుంది; జార్జిని దూరదేశానికి ట్రాన్స్‌ఫర్ చేస్తారు. అది మన్య ప్రాంతం, స్త్రీలు వుండలేరు. ఏడేళ్లు గడిచాయి. చివరికి జార్జిని కలిసి పెండ్లి చేసుకో నిశ్చయించి ప్రయాణమైంది. జార్జి పెండ్లి ఏర్పాట్లన్నీచేసి, ఆమెను కలుసుకునేందుకు, ఎవరిదో కారు తీసుకుని రేవుకి బైలుదేరాడు. మధ్యలో సంశయించాడు. ఆమెనుచూసి ఏడేళ్లైంది. ఆమె పరాయిదానిలాగ కనబడసాగింది. ఎట్లా పెండ్లి చేసుకోడం? కలుసుకున్నాక, "నిన్ను చేసుగోను" అనగలడా? మొండిధైర్యం తెచ్చుగుని, ఆమెనుండి పారిపోడానికి నిశ్చయించుగుని, సింగపూర్ వెళ్లడానికి సిద్ధంగావున్న ఓడలో ఎక్కి వెళ్లాడు. మేబెల్‌కి ఇవ్వవల్సిందిగా, రెండు ముక్కలువ్రాసి, ఎవరికో ఇచ్చి వెళ్లిపోయ్యాడు. "హఠాత్తుగా పనిమీద వెళ్లాల్సి వచ్చింది. ఎప్పుడొస్తానో తెలియదు. నువ్వు తిరిగి స్వదేశం వెళ్లిపోవడం మంచిది. ముందు నేను ఏం చేసేదీ తెలియకుండా వుంది" అని వ్రాశాడు ఉజాబులో.

సింగపూర్ చేరగానే, మేబెల్‌వద్దనుండి వొచ్చిన టెలిగ్రామ్ చూశాడు. "అంతా తెలిసింది. బెంగ పడొద్దు. ప్రేమతో మేబెల్" అని టెలిగ్రాం. రంగూన్ యాత్రికుల జాబితాలో మేబెల్ పేరు ఉన్నట్లు తంతి ద్వారా తెలుసుకున్నాడు. ఆమెవెంట పడుతోందని గ్రహించి, మరో ఓడమీద సైగాన్ వెళ్లాడు.

ఐదు రోజులతర్వాత సైగాన్ చేరుకున్నాడు. హొటల్‌కి వెళ్లగానే, మేబెల్‌వద్దనుండి వొచ్చిన టెలిగ్రాం సిద్ధంగావుంది. రెండే మాటలు. "ప్రేమతో మేబెల్" అని. ఏం చెయ్యాలి? హాంగ్‌కాంగ్ వెళ్లాడు. అక్కడనుండి మనిలా వెళ్లాడు. తర్వాత షాంగై ఒక్కటేమార్గం; యొకహామా వెళ్లాలి. అక్కడ హొటల్‌కి చేరగానే మేబెల్ టెలిగ్రాం సిద్ధం. "మనిలాలో కల్సుకోలేకపోయినందుకు చింతిస్తున్నాను. ప్రేమతో మేబెల్" అని. వెనక్కి వెళ్లి, ఆమెని గందరగోళపరచడం మంచిదని తిరిగి షాంగై వెళ్లాడు. "త్వరలోఒచ్చి కలుస్తున్నా ప్రేమతో మేబెల్" అని టెలిగ్రాం. చుంగ్‌కింగ్ అక్కడనుండి, హాన్‌కో, వెళ్లి, పడవ మారి చుంగ్‌కింగ్‌వెళ్లి, అక్కడనుండి చెంగ్‌టూకి బైలుదేరాడు. అది మారుమూల గ్రామం. అతి కష్టమైన రోడ్డు ప్రయాణం. డోలీలమీద వెళ్లాలి. అక్కడికి చేరుకున్నాడు. అక్కడికి ఎవ్వరూ రాలేరు. దూరంగా టిబెట్ కొండలు కనవడతాయి. ఒక ఉదయం, డోలీలోంచి దిగింది మేబెల్. "నువ్వు ఏమీ మారిపోలేదే! జుట్టంతా వూడి, బోడిగుండు చూపుతావనుకున్నానుసుమా. పట్టు పెండ్లి చేసుకుందాం" అని చేసుకుతీరింది మేబెల్. ఇది నిజంగా జరిగిన వృత్తాంతం అని తెలిసాక, మరీ చిత్రంగా తోస్తుంది.

సాధారణంగా మామ్ వర్ణనలలో వూహాబలం, ఉపమానాలు, కవితావేశం కనబడవు. కాని ఈ గ్రంథంలో, కొన్నిఅద్భుతమైన వర్ణన లున్నాయి. నాకు నచ్చిన వర్ణన :

"సంధ్యాసమయంలో, అడివినుండి విడిపోయి ప్రాణం పోసుకుని బ్రతికిన వ్యక్తులైనట్లు కనబడతాయు చెట్లు. చెట్లేవో అడివేదో విడిగా చూడలేము. ఆ క్షణంలో ఒక ఇంద్రజాలంవుంది. దాని ప్రకారం, ఆ చెట్లల్లోకి వనకన్యలు జొరబడి స్థావరం ఏర్పర్చుకుని, తెల్లారగానే మాయమైపోతాయి. ఏదో జరిగి ఏ క్షణంలోనైనా అవి మారి, మరో ఆకృతిని తెచ్చుకునేటట్లుగా తొణికిసలాడతాయి. వూపిరి బిగపెట్టి, ఆ క్షణాన్ని నిరీక్షిస్తాం. చీకటి అలుముకుని, రాత్రి ప్రవేశిస్తుంది. ఆ మధురక్షణం గడిచిపోయి, అడివి ఆ చెట్లని తనలోకి తీసుకుంటుంది—ప్రతిభతో విర్రవీగే యువకుణ్ణి, ఆ క్షణం గడిచాక, ప్రతిభపోయి, యవ్వనం క్షీణించి, మామూలు గుంపులోకి ప్రపంచం లాక్కున్నవిధంగా అడివి, చెట్లని తనలో కలిపేసుకుంటుంది—ఇంక ఆ చెట్లకి, అడివి నుండి సంక్రమించిన జీవంతప్ప, వేరే కదలిక, ప్రాణం వుండవు."

ఈ ప్రయాణంలో, వంటచేసిపెట్టేటందుకు మామ్ ఒక తెలుగువాణ్ణి తనతో తీసుకెళ్లాడు. యెడ్లబండి ప్రయాణాలూ, పడవ ప్రయాణాలూ, అంగ్‌కోర్‌వాట్ శిథిలాల వర్ణన, అక్కడ ఉద్యోగాలుచేసే ఆంగ్లేయుల అగచాట్లు—వీటన్నింటితోనూ, విసుగు పుట్టించకుండా, ఆహ్లాదంతోసాగే మంచి గ్రంథం ఇది.

ఇండియా పర్యటనగూర్చి ప్రత్యేకంగా గ్రంథం వ్రాయలేదుగాని రమణమహర్షిని గూర్చిన ఒక వ్యాసం వుంది, ఆయన ప్రచురించిన వ్యాస సంపుటంలో. "ఏకైక సత్యంలోకి ప్రవేశించాడు మహరిషి. ఆయన చనిపోగానే, ఒక తోకచుక్క ఆకాశంలో మెల్లగా కదులుతూ, పవిత్రమైన అరుణాచలం కొండ శిఖరానికి చేరుకుని, దాని వెనక అంతర్ధానమైంది. ఈ వింత దృశ్యాన్ని ఎందరో చూసి, ఒక మహా వ్యక్తి నిర్యాణానికి చిహ్నమన్నారు" అన్న వాక్యంలో ముగుస్తుంది ఈ వ్యాసం. ఇంగులో "అంతర్ధానమైందిట"—అని, వాక్యం చివర 'ట' ని తగల్చకపోవడం గమనించతగ్గది.

ఇండియా పర్యటన జ్ఞాపకాలని మామ్ తన 'రచయిత నోట్‌బుక్' అనే గ్రంథంలో పొందుపరిచాడు. హైదరాబాద్‌లో అనేక రోగుల వ్యాధులను కుదిర్చిన యోగి వుదంతం, తాత్విక చింతన మోహంలో తాండవించే సూఫీని కలుసుకున్న ఉదంతం, సర్ అక్బర్ హైదరీగారింట్లో యోగితో జరిపిన గోష్టి, తేలుమంత్రం, టికెట్ లేకుండా రైలెక్కనీయకపోయినప్పుడు, రైల్ని నిలిపివేసిన యోగి ఉదంతం, భూమిలో వారం కప్పడి, సజీవుడైన యోగి ఉదంతం, కాశీపట్నం, తాజుమహల్ వర్ణనలు, మధురలో ఆలయాలు—ఇవన్నీ చదవతగ్గవి. హిందూతత్వాన్ని అనేకులు ఒకే విధంగా విశదీకరించడం విని, విని ఇల్లా వ్రాస్తాడు. "హిందూ తత్వజ్ఞులతోవున్న చిక్కే ఇది. పదేపదే, అవే విషయాలు చెప్తారు. సత్యం ఒకటే కావున, పదేపదే చెప్పడం సబబే ఐనా వినేవారికి ఇబ్బందిగానే వుంటుంది. ఉపనిషత్తులలోనుండి అవే ఉపమానాలుకాక మరివేటినన్నా చెప్తే బాగుండుననిపిస్తుంది. త్రాడు, సర్పము—ఈ ఉపమానం రాగానే గుండె జారుతుంది." మామ్ హిందూ తత్వ శాస్త్రాన్ని మరింత శ్రద్ధతో పరిశీలించివుంటే బాగుండుననిపిస్తుంది. కాని అది అసంభవం. చిన్నతనంలోనే హేతువాదాన్ని స్వీకరించి, నాస్తికుడుగా, చెప్పుకుంటూ, ఆధ్యాత్మిక అనుభూతులను చొరనీయకుండా, హృదయద్వారాలు మూసేశాడు ఆయన. పాశ్చాత్య తత్వంలో, చీకటి గదిలోలేని నల్లపిల్లి, తత్వజ్ఞుడి పంటి నలుపు—త్రాడూ, పామూ ఉపమానంలాగే పదేపదే ఎదురౌతాయన్న సంగతి మామ్ గ్రహించలేక పొయ్యాడనుకోలేను.

ఈ పర్యటనలోనే చిత్రమైన వృత్తాంతం విన్నాడు మామ్. కాని దాన్ని కథగా వ్రాయలేదు. అందుకు కారణం, ఆ కథకి తుదిమొదలు లేక పోవడంట.ఒకాయ నుంటాడు. ఆయన్ని 'ఏ' అందాం. ఆయనకిరోజూబోలెడువుత్తరాలు వస్తూంటాయి. ఆయన మిత్రుడు—'బి' అందాం—తనతోబాటే దూర ప్రాంతంలో పని చేస్తున్న మిత్రుడు—'బి'కి ఒక్క జాబు కూడా రాదు. అతనికి 'ఏ' పట్ల అసూయ పొడసూపుతుంది. 'నీకొచ్చిన ఉత్తరాలలో ఏదన్నా ఒకదాన్ని నాకియ్యి—ఐదు రూపాయలిస్తాను' అంటాడు 'ఏ' తో. 'ఏ' సమ్మతించి, తన కొచ్చిన జాబుని 'బి' కి ఇస్తాడు. 'బి' ఆ ఉత్తరం చదువుతాడు. అందులో ఏముందో చెప్పమని అడుగుతాడు 'ఏ' 'బి' చెప్పడు. 'ఏ'కి వెర్రెత్తిపోతుంది—ఆ ఉత్తరంలో ఏముందో తెలుసుకోవాలన్న కుతూహలాన్ని అణగ తొక్కుకోలేకపోతాడు. ఐదు రూపాయలు తిరిగిఇచ్చివేస్తాను, నాజాబు నా కియ్యమంటాడు 'బి' ని. 'బి' ఇయ్యనంటాడు. అదీ కథ. ఆధునిక కథకులు ఆ కథని అల్లా గాలిలో వదిలెయ్యడానికి వెనుదీయరు. అదినావల్లకాదు. మనస్సుకి నచ్చేముగింపులేని కథని వ్రాయలేను, అని వ్యాఖ్యానిస్తాడు.

టాజ్ మహల్ సందర్శనం ఆయనకొక అపూర్వమైన అనుభవం. అదిఒక గొప్ప కళాఖండమన్నాడు. ఆసౌందర్యానికి వూపిరి నిల్చిపోయిందన్నాడు. గుండెకాయపెరిగినట్లు, దాస్య శృంఖలాలు వీడిపోయినట్లు అనిపించిందిట.మతాలన్నీ పరమాత్మలో అంతమొంది విమోచన పొందుతున్నట్లు కళ ద్వారా కూడా తాత్కాలికమైన విమోచన పొందడం సాధ్యమన్న సాంఖ్య సిద్ధాంతం అప్పుడే చదివాడుట. మరోమారు చూశాడు తాజుమహల్‌ని. రెండోమారు, అంతటి ఆనందం పొందకపోయినా, ఒక వింత అనుభూతి కలిగిందిట. అదిల్లా వర్ణించాడు. "నే నొంటిగా వున్నాను. విడివిడిగా అమర్చిన ఆ గదులు చూస్తూవుంటే, అదంతా శూన్యమైనట్లు, నిశ్శబ్దం ఆవరించినట్లు తోచి కాస్త బెదిరాను. అర్థ రహితమైన మాటల్లో చెప్పాలంటె, చప్పుడు చెయ్యని అనంతం వేసిన అడుగుల చప్పుడు విన్నట్లనిపించింది." ఇండియా వొదిలి వెళ్లినప్పుడు, అక్కడి విశేషాలేవో చెప్పమంటారుట. 'మీకేది నచ్చింది?' అని అడుగుతారుట. అల్లా అడిగిన వారికి ఏం సమాధానం చెప్తే నచ్చుతుందో అదే చెప్పాను నేను—అని తన అనుభవాల సారాంశాన్ని ఇల్లా ముగించాడు మామ్.

"నన్ను నిజంగా కదిల్చింది టాజ్ మహల్, కాశీ, మధురలో ఆలయం, తిరువాన్నూర్ పర్వతాలు—ఇవేవీకావు. నన్ను

పెద్ద కళ్ళు, భయంకరంగా మెరుస్తాయి. పుస్తకప్రియుడు. పుస్తకాల పార్సెళ్ళు వొస్తాయి నగరంనుండి. వాటిని విప్పడం చూసి,

"ఎందుకురా ఈ సెంటంతా" అంటాడు వాకర్.

"చదవడానికి"

"చదివేటందుకు ఏమన్నా డిటెక్టివ్ గ్రంథాలున్నాయా"

"నే నవి చదవను."

"అవుతే, వెర్రి వెధవ్వి అన్నమాటె!"

సాయంత్రంపూట ఇద్దరూ పేకాడతారు. పేకాటలో దెబ్బలాడతాడు. అరుస్తాడు. తనాడిందే రైటంటాడు. పార పాట్లని చూపిస్తే,

"ముసిలాణ్ణికదూ. బాగా కనబడవ్‌రా ముక్కలు" అని తప్పించేస్తాడు. రాత్రి, బాగా తిని, తాగి వెనకటి కబుర్లు సాగిస్తాడు. పెండ్లినాడు తాగి పడివుంటే, భార్య హడలి పారిపోయి మళ్ళా రాలేదుట. టాలువాలోవున్న స్త్రీలతో తాను జరిపిన ప్రేమ కలాపాలు వర్ణిస్తాడు. ఇవేవీ మాకింటాష్‌కి గిట్టవు. మాకింటాష్, ఆదర్శజీవి. తప్పుడు పనులు చెయ్యడు.

పని చెయ్యడంలో క్రమము, పద్ధతి వుండాలంటాడు మాకింటాష్. అక్కర్లేదని వాకర్.

"ఒరేయ్—గవర్నమెంట్ ఆఫీసుల్లో పని చేసి, ఇలా తయారయ్యావురా. ఇక్కడ, నా కింద ఏడాది పని చేస్తివా, ఇదంతా వొదిలేస్తాను. నువ్వు మంచివాడవే—కాని ఒకటే లోటురా—నువ్వు తాగవు" అని మందలిస్తాడు. మాకింటాష్ మనస్సులో ఎంతటి ద్వేషం, అసూయ రేగుతుందో వాకర్‌కి తెలియదు. వాకర్ బూతులు మాట్లాడతాడు. మాకింటాష్ స్కాట్లండ్ దేశీయుడు. ఆ జాతి లక్షణాలను వెక్కిరిస్తూ, అశ్లీలాలు పలుకుతాడు వాకర్.

"నవ్వమంటారా?" అని అడుగుతాడు మాకింటాష్.

"స్కాట్లండ్ దేశంవాళ్ళని, నవ్వించాలంటె, ఆపరేషన్ జరపాలిరా" అని, విరగబడి నవ్వుతాడు, వాకర్. మాకింటాష్‌ది అర్థరహితమైన, గుడ్డి ద్వేషం కాదు. అతనికి, వాకర్‌లో మంచి గుణాలు బాగా తెలుసు. వాకర్ డబ్బు విషయంలో నిక్కచ్చిగా వుంటాడు. స్వలాభాపేక్ష లేదు. కానీ మిగుల్చుకోలేదు. ప్రభుత్వానికి, పెద్ద సిబ్బంది అడగకుండా, చాలా లాభం చేసిపెట్టాడు. నేరస్థులను శిక్షించేటందుకు, ఒక జైలు కట్టించుకోమంటే వొద్దన్నాడు వాకర్.

"జైలెందుకూ? ఈ వెధవలు తప్పుచేస్తే, ఏం చెయ్యాలో తెలుసు." కోర్టులకి పంపకుండా తనే తీర్పు చెప్పి, పరిష్కారం గావిస్తాడు. గుర్రంమీద, గ్రామం అంతా తిరిగి, ప్రతింటికీవెళ్ళి మంచి చెడ్డలు కనుక్కుంటాడు. ప్రజలకి జబ్బులుచేస్తే, తనే స్వంతమందులిస్తాడు, కాలమెల్ పాట్లాలు. ఒకడొచ్చి నా పెళ్ళాం లేచిపోయిందని ఫిర్యాదుచేస్తే

"అదృష్టవంతుడివిరా. తమ పెళ్లాలు ఎప్పుడు లేచిపోతారా అని కనిపెట్టుగున్న మొగాళ్లు ఎంతమందో వున్నా(రా!" అన్నాడు వాకర్.

అక్కడ కొబ్బరి సాగు (ప్రధానమైన వృత్తి. కొబ్బరిని పై దేశాలకు ఎగుమతి చేస్తారు. ఓడరేవుకు మంచి రోడ్లు లేవు. ఆ(గామం చుట్టూ, ఓడ రేవు వరకు వెళ్లే రోడ్డు వేయిం చాలని వాకర్ సంకల్పం. (ప్రభుత్వం వారు, రోడ్ల నిమిత్తమై వెయ్యి పౌను లిచ్చారు. (క్రితం సంవత్సరం కూలీలకి, వందపౌనులే ఇచ్చాడు వాకర్. పట్టుదలకోసం, తాను ఇతర ఉద్యోగులకంటె చౌకలో పనులు చెయ్యించగలనని బడాయి చెప్పుకోడంకోసం, రోడ్డు కూలీలకి, చాలా తక్కువ వేతనాలిస్తాడు. కూలీలు ఎక్కువ చెయ్యమంటారు. ఇందుకు మాకింటాష్ కొంత కారకుడౌతాడు.

"ఇస్తే వీడి సొమ్మేం పోయింది. ఇదంతా గవర్నమెంటు డబ్బు." అని కూలీలతో, తనపై అధికార్ని గురించి మాట్లాడు తాడు. వారు, ఇతని అండ చూసుకుని, వేతనాలు పెంచితేనేకాని పని చెయ్యమంటారు. వాకర్‌కి వొళ్లు మండిపోతుంది. ఒకపన్నాగం పన్నుతాడు. పై ఊరినుండి కూలీలని పిలిపిస్తాడు. వారికి అడిగినంతా ఇచ్చి పని చెయ్యమంటాడు.ఆ (ప్రజలలో ఒక ఆచారం వుంది. తోటివారు తమింటి కొచ్చినప్పుడు, వారే ఆతిథ్య మిచ్చి, వారికయ్యే ఖర్చులన్నీ భరించాలి. దాంతో ఆ (గామీణులు హడలిపోతారు. పై ఊరివాళ్లు తమ కొంపల్లో వుంటారు. తామే తిండి పెట్టాలి. చివరికి, వారికి ఏమీ లేకుండాపోతుంది. ఆ వూరివారు కూడా రోడ్డు పనికి సిద్ధపడి, మొదలెడతారు. కానీ ఇప్పుడు వాకర్. ఏ వేతనం లేకుండా పనిచేసే గత్యంతరం ఏర్పడుతుంది. ఈ కబురు విన్న పై (ప్రాంతాలవారు, తెగ నవ్వి, వాకర్ సాహసం గూర్చి వింతగా చెప్పుకోడం సాగిం చారు. అత నొక కథానాయకుడైనాడు. పురాణ పురుషు డయ్యాడు.

కాని, పై వూరువాళ్లు తమ (గామానికి తిరిగిపోవడం లేదు. అక్కడేవుండి రోడ్డు పని చేస్తున్నారు. వాళ్లకేం, హాయిగా జరిగిపోతోంది. ఈ గొడవ భరించలేక టాలూవా పనివాం(డు వారిని పంపించివెయ్యవల్సిందిగా వాకర్‌ని (బతిమలాడారు. అది చేస్తే, కానీ పుచ్చుకోకుండా రోడ్డు పూర్తి చేస్తామని వాగ్దాన మిచ్చారు.

"ఓరి వె(రి వెధవల్లారా—నా కోసమా యీ రోడ్డు. మీ కోసమేరా. మీ రోడ్డుకి మీకు వేతనాలేమిటి వెంగళప్పల్లారా. సరే మీరంతగా ఏడుస్తున్నారు గావున, ఒక పని చెయ్యండి. పై ఊరి వాళ్లకివ్వవల్సిన వేతనాల సొమ్ము మీ రిచ్చుకోండి. అట్లా ఇస్తిరా, మిమ్మల్ని పని చెయ్యనిస్తాను" అంటాడు వాకర్.

మాకింటాష్ మందరించబోతాడు.

"చాలా అన్యాయం. వాళ్లని వేతనాల ఖర్చు భరించమని అడిగే హక్కు నీకు లేదు."

"నీ అభి(ప్రాయం కావల్సినప్పుడు అడుగుతాలె" అంటాడు వాకర్.

ఆ రా(త్రి, కూలీంలో ఒక యువకుడు— మనూమా— అనేవాడు మాకింటాష్ గదికొస్తాడు. మాకింటాష్ గదిలో బల్లలు సర్దుకుంటూ, రివాల్వర్‌ని, (డాయర్‌లోంచి తీసి, బల్ల మీద వుంచుతాడు. మనూమా, వొంట్లో బాగా లేదు, మంది మ్మంటాడు. మాకింటాష్ లోపలి కెళ్లి మందు తెచ్చి ఇస్తాడు. మేము ఆ ఖర్చులు భరించలేం, ఏం చెయ్యం? మీ సలహా ఏమి టని అడుగుతాడు. అతనేమీ చెప్పడు. మందు తీసుకుని మనూమా వెళ్లిపోతాడు. మొన్నాడు, వాళ్లింటి కెడతాడు మాకింటాష్. (గామపెద్ద ఇల్లా అంటాడు.

"వాకర్ పెద్దాయనైపొయ్యాడు. రేపో మాపో రిటై రైతే, మీరేగా వారి స్థానంలో కొచ్చేది. ఈమరు వూ అంటిరా పైవారికి పిటిషన్ పంపిస్తాం" అని. మాకింటాష్‌కి చెమటల్లు పోస్తాయి. ఏమీ మాట్లాడడు. గబగబ తన గదికి వెళ్లిపోతాడు. (డాయర్లో, బల్లమీదా చూస్తాడు. రివాల్వర్ కనబడదు.

"ఏం చేస్తున్నావురా, వెంగళప్పా" అంటూ గదిలో కొస్తాడు వాకర్. బల్లమీద ఏదో వున్నట్లు, వున్నదాన్ని దాచి నట్లు నటిస్తాడు.

"గది బాగు చేసుకుంటున్నావు(టా. నేను స్నానానికి పోతున్నా. నువ్వూరా" అంటాడు. ఇద్దరూ స్నానానికి బైలుదేరుతారు. గుర్రాలమీద వెడతారు. అంగవ(స్త్రం ధరించి వాకర్ ఈదులాడుతాడు. అతనితో కొందరు ఆడపిల్లలూ, మరో డజను మగపిల్లలూ స్నానాలకి దిగుతారు. ఆడపిల్లల్ని ఏడిపిస్తూ, బూతులు మాట్లాడతాడు. ఏగతాళి చేస్తాడు. మాకింటాష్ కోపంగా చూస్తాడు.

"ఒరేయ్, వీళ్లు నా బిడ్డలురా" అంటాడు వాకర్. చప్పున ఇంటికిపోదాం. అన్నం చల్లారిపోతుందంటాడు మాకింటాష్.

"ఒరేయ్. నువ్వు వె(రివాడివి—మంచివాడవే అనుకో. ఒక పని చేసేటప్పుడు, మరో పని గురించి ఆలోచిస్తావురా" అంటాడు. ఇంటికెడతారు. రా(త్రి భోజనం చేశాక, అల్లా చుట్టు కాలుస్తూ షికారెళ్లే అలవాటు (ప్రకారం, వాకర్ బైలు దేరతాడు. ఒంటిగా వెళ్లడం మంచిదికాదు, కూలీలు కసిగా వున్నారు అని మాకింటాష్ వారించబోతాడు. కాని వాకర్ మానడు.

"ఊరికే అంటా(రా. వాళ్లు నన్నేమీ చెయ్యరు. తం(డిలా చూస్తా(రా" అని బైలు దేరుతాడు. నేను రానా అని అడుగు తాడు మాకింటాష్. వద్దని, ఒక్కడే షికారెడతాడు వాకర్. షికారయ్యాక నవ్వుతూ తిరిగొస్తాడు.

"చూశావా భయ పెట్టేశావ్. ఏమీ జరగలేదు. నిక్షే పంలా వున్నాను" అంటాడు. ఇద్దరూ చీట్లాడతారు. ఆవులించి లేస్తాడు వాకర్.

'పోయి పరుంటా' నంటాడు.

"రేపటి కార్యక్రమం ఏమిటి?"

"తెల్లారగట్ల గుర్రంమీద, అల్లా వెళ్ళి రోడ్డు తనిఖీ చేసి వస్తాను" అంటాడు వాకర్.

"నేనూ రానా?"

"ఒద్దు."

"నీకేమన్నా జరిగితే....."

"అట్లాంటప్పుడు నువ్వెందుకు పనికొస్తావురా అర్భకుడివి" అని, వెళ్ళి పరుంటాడు వాకర్. తెల్లారింది. ఏడైంది. తెల్లారగట్ల వెళ్ళిన వాకర్ తిరిగి రాలేదు. మాకింటాష్ ఏమీ తోచక తన గదిలో కెళ్ళాడు. అక్కడ బల్లమీద రివాల్వరుంది. నాలుగు గుండ్లులేవు. ఎవరో పేల్చేశా రన్నమాట. చేతులు వొణుకుతున్నాయి. ఎనిమిదైంది. ఇంటిముందు జనం పోగయ్యారు. గాయపడ్డ వాకర్‌ని మోసుగొచ్చి మంచంపైన పడేసి, డాక్టర్‌కి కబురంపి, సపర్యలు చేస్తున్నారు.

"ఆఖరికి చంపేశార్రా" అన్నాడు వాకర్.

డాక్టర్‌కి కబురంపానంటాడు మాకింటాష్.

"వాడొచ్చేటప్పటికి నేను చావనే చస్తాను. ఇంత ద్రావకం పొయ్యిరా. నువ్వు చెప్పింది నిజంరా మాక్. అంత పనీ చేశారు. నువ్వు మంచి వాడివిరా. ఎటొచ్చీ తగవ్. క్రితంసారి వెళ్ళినప్పుడు ఆ వెధవలతో చెప్పానురా నీ సంగతి. నువ్వు చాలా మంచివాడివని. నా ఉద్యోగం నీ కిస్తార్రా. రోడ్డు పూర్తి చేయించు. అది జరిగితే నా కింకేమీ వొద్దు, వీళ్ళని బాగా చూడు. వీళ్ళు నా బిడ్డలు. కఠినంగా వుండు—కాని దయ చూపు."

జనం చుట్టూ పోగై, అతనికి వూపిరాడదని, వాళ్ళందర్నీ బైటకి పొమ్మంటాడు మాకింటాష్.

"ఉండనీరా. వాళ్ళు నా బిడ్డలు. నా దగ్గరే ఉండాలి. దగ్గరగా రా. మరోసారి ద్రావకం పొయ్యి. జరిగిన దాన్ని గురించి గొడవ చెయ్యకు. తెల్లవాడికి ఏదన్నా జరిగితే, ఇక్కడి యీనల్లవాళ్ళకి చాలా అపకారం జరుగుతుందిరా. అసలు ఊరే లేకుండా, కాల్చివేస్తారు అధికారులు. వాళ్ళు తప్పు చెయ్యని వాళ్ళని దండిస్తార్రా. ఎవ్వడినీ దండించకూడదురా—ఇదేదో ప్రమాదవశాత్తు జరిగిందని చెప్పు. ఎవరితప్పూకాదు. చేతిలో చెయ్యివేసి ప్రమాణం చెయ్యి."

"అట్లాగే చేస్తాను." అంటాడు మాకింటాష్.

"ఒరేయ్, నాకు మతం అంటే ఇష్టం. మత గ్రంథాలు చదువుతూ వుంటావు. క్షమని గురించి ఏదో వుందే, అదేమిట్రా"

"అవును 'వారు చేసే దేమిటో వారికి తెలియదు. కావున క్షమించు' అని" అంటాడు మాకింటాష్.

"అద్దిగదిరా. క్షమించు. వారిని నేను క్షమించాను. నా బిడ్డలురా.నీ చెయ్యి ఇల్లాగియ్యి...."అని కళ్ళు మూస్తాడు వాకర్. చెయ్యి లాక్కుని, ద్రావకంతాగి, బైటకి నడిచిపోతాడు మాకింటాష్. సముద్రంలో దూకి చచ్చిపోతాడు. శవాన్ని షార్కులు తింటాయి. అదీ కథ. చివరి భాగం చదివేటప్పుడు కళ్ళంట నీళ్ళు తిరుగుతై. విషాద నాటకాలలో షేక్స్‌పియర్ మెక్‌బెత్ ఎంత గొప్ప నాటకమో విషాద కథలలో, ఇది అంత గొప్ప కథ. మెక్‌బెత్ కూడా మాకింటాష్‌వలె స్కాట్లండ్ దేశీయుడే నన్నది గమనించదగ్గది!.

ఈనాటి ఆంగ్ల రచయితలలో, సామర్‌సెట్ మామ్ కున్నంతటి ప్రచారం,మరే రచయితకీలేదనుకుంటా. పి. జి.వోడ్‌హౌస్ అగాథాక్రిస్టీ, మామ్—ప్రపంచంలో అన్ని దేశాలవారూ వీరి పుస్తకాలే ఎక్కువగా చదువుతున్నారు. ముఖ్యంగా మామ్‌కి, ప్రాక్ దేశాలలోనే కాకుండా, అమెరికా, ఫ్రాన్స్, జెర్మనీ దేశాలలో ఇంగ్లండ్‌లోకంటె, ఎక్కువమంది పాఠకులున్నారు. సారస్వతం పట్ల అభిరుచి లేనివారు కూడా ఈయన పుస్తకాల్ని ఆసక్తితో చదువుతారు. వెనకటి తరంవారిలో, బెర్నార్డ్‌షా, వెల్సుని మినహాయిస్తే మామ్ కున్నంత ప్రపంచ ఖ్యాతి మరే రచయితకీ లేదనుకుంటా. ఇంత డబ్బు మరెవ్వరూ గడించలేదు.

ఐనా, స్వదేశమైన ఇంగ్లండ్‌లో మామ్‌కి బొత్తిగా పలుకుబడిలేదు. ఆధునిక నవలని గురించి వ్రాసే గ్రంథాలలో ఈయన నవలల్ని గురించి పట్టించుగోరు. నవలలపై నవలాకారుల అభిప్రాయాలు అన్న పేరుతో ఆమధ్య వెలువడ్డ నాలుగొందల పేజీల గ్రంథంలో ఈయన పేరేలేదు. ప్రూస్ట్, లారెన్స్, ఫార్‌స్టర్, హార్డీ, హెమింగ్వే, కాఫ్‌కా, జాయిస్, కామ్యు, సార్త్రే, వర్జీనియా,వూల్ఫ్‌ల రచనల్ని పరిశీలిస్తూ వ్రాసినవారు, మామ్ రచనల్ని ఒక్క పేరాలో పేర్కొని, మరో విషయంలోకి జారిపోతారు. సంప్రదాయ సాహిత్యంలో పేరొందిన విమర్శకులు ఈయన్ని విరక్తుడని (Cynic) రెండో తరగతి రచయితకింద జమకట్టారు.

"నా ఇరవయ్యోఏట, వివేకంలేని క్రూరుడన్నాడు నన్ను; ముప్ఫైయ్యోఏట అలక్ష్యంగా వ్రాస్తానన్నారు; నలభైయ్యోఏట, విరక్తుడన్నారు; యాభైయ్యోఏట తెలివిగా వ్రాస్తానన్నారు; అరవైయ్యోఏట గాంభీర్యం, లోతులేని అల్ప జ్ఞానినన్నారు." అని వాపోయ్యాడు మామ్. రచయితగా తన అనుభవాలని సింహావలోకనం చేస్తూ, వ్రాసిన గ్రంథంలో. ఈ పుస్తకంలో ఆయన ఆంతరంగ జీవితానికి సంబంధించిన విషయాలేమీ వుండవు. పోనీ, రచనలో మెళకువలు పాటించవల్సిన సూత్రాలూ ఏమన్నా చెప్తాడేమో ననుకుంటె అదీవుండదు. పాఠకుణ్ణి,రచయిత కాల్పనికలోకి తీసుకెళ్ళడం ప్రమాదంఅంటాడు మామ్. మరి ఈ పుస్తకం ఎందుకు వ్రాసినట్లు? విమర్శకులు ఏమన్నదీ నే పట్టించుగోను, అంటాడుకాని, నే ననుకోడం ఈ పుస్తకాన్ని తన విమర్శకులకు సంజాయిషీగా వ్రాశాడని.

"జీవితాన్ని ఉన్నదున్నట్లుగా చిత్రిస్తాను. చెడుగుని విమర్శించను. మంచిని పైకి ఎత్తెయ్యను. సుఖ దుఃఖాలను సమంగా చూస్తాను.....మనుషుల్లో మంచి చెడూ కలిసివుంటాయి. వారిని అట్లాగే చిత్రిస్తాను—కాబట్టి విరక్తుణ్ణి అంటే, కాదనను" అంటాడు. చెడ్డ పాత్రలపట్ల నిరసన ప్రకటించక

పోవడంవల్లనే, విమర్శకుల కీ అభిప్రాయం కలిగిందని మామ్‌కి తెలుసు. మూడో సంపుటిలో చివరి కథ 'నీల్ మకడమ్' అన్నది. 'నీల్' స్కాట్లండ్ దేశపు యువకుడు. మలయ అడవుల్లో జీవ శాస్త్ర పరిశోధకుడైన మన్రో దగ్గర అసిస్టెంట్‌గా వుంటాడు. మన్రో భార్య, రష్యా దేశపు స్త్రీ. నడివయస్కురాలు. నీల్‌ని ప్రేమిస్తుంది. నీల్‌కి, స్త్రీలు, ప్రేమతెలియవు. శరీరవాంఛంటే తెలియదు. గిట్టదు. ఆమెని కాదంటాడు. ఆమె చివరిదాకా అతన్ని వేటాడుతూనే వుంటుంది. బలాత్కారంగా పైన బడుతుంది. అతను ఒప్పుకోడు. తనే ఆమెని చెరచబోయ్యాడని భర్తతో ఫిర్యాదు చేస్తానని బెదిరిస్తుంది—చిత్రాంగిలా. అతను లొంగడు. తరుముతుంది. అడవిలోకి పారిపోతాడు. తనూ వెంట బడుతుంది. అతను తిరిగి తిరిగి అడివిలోంచి బైటకొస్తాడు. ఆమె దోవతప్పి, అడివిలో చనిపోతుంది. సారంగధరుణ్ణి మెచ్చుగుంటాం—నీల్‌ని మెచ్చుకోం. కాదని, ఆమెని నిష్కారణంగా చంపాడంటాం. చాలామంది నీతి అంటె స్త్రీ పురుషుల మధ్య గల అక్రమ సంబంధమే ననుకుంటారు. లంచగొండితనం, నిజాయితీ లేకపోవడం, అసత్యాలాడటం, దగా, మోసం, డబ్బు, బంధుకోటిపట్ల పక్షపాతం—వీటిని గురించి, వ్యభిచారం గురించి పట్టించుగున్నంతగా, పట్టించుగోం. దీనికంతటి ప్రాధాన్యం ఇవ్వనక్కర్లేదన్నది ఆధునిక తత్వం. 'నీల్' కథలో ఈ ధ్వని వుంది. సంప్రదాయ విమర్శకులు, దీన్ని హర్షించరు.

మామ్ పట్ల వుండవల్సినంత గౌరవం వారికి లేకపోవడానికి కారణాలూహించగల్ను. ఇంగ్లీషువారు ఘనులుగా కనబడరు మామ్ పుస్తకాల్లో; ముఖ్యంగా సామ్రాజ్యవాద ప్రచారకులుగా, ఇతర దేశాల్లో పని చేసేవారిని మామూలు మనుష్యులుగా చూపి, చులకన చెయ్యడంవల్ల జాతి గౌరవానికి భంగం కలిగిందని భావించారేమో. దేశాభిమానంవల్ల వారిని మంచిగా చూపాలన్న ఉద్దేశం మామ్‌లో లేదు. మంచి చెడ్డల్ని—రెండూ సమంగా చిత్రించి అందరు మనుష్యులలాగానే చూస్తాడు.

రెండో కారణం, ఆయన రచనలు చాలామందికి రుచించడం. అందరికీ నచ్చింది చౌకబారుదై ఉండాలి. సాహిత్యం, గాంభీర్యం, లోతు, అంతర్గతమైన వైచిత్రితో నిండి ఏ కొద్దిమందికో అర్థమవాలి. అందలి అర్థాన్ని అంద చందాలనీ చెప్పేటందుకు విమర్శకు లుండాలి. ప్రతివాడికీ తెలిసిపోతే అది సాహిత్యం కాదన్న పాత భావం, చాలామందిలో వుండిపోయింది. వైరూప్య చిత్రకళ (Abstract Painting) అందరికీ అర్థమవదు. కొబట్టి అది గొప్పకళ. అల్లాగే, సాహిత్యంలో, సులువుగా బోధపడని విలువలూ, నిగూఢత, మాయ, ధ్వని, సాంకేతికాలు వుండాలి. కవిత్వం, వూహాబలం వుండాలి. మంచి శిల్పం, భాష, పదాలు వుండాలి. అప్పుడుకాని ఏ రచనకీ సాహితీ దక్షత సమకూరదు—అని సంప్రదాయ సాహిత్యవేత్తల వాదం.

మామ్ రచనలు, సులువుగా అర్థమౌతాయి. మరొకరు పరామర్శించి వ్యాఖ్యానం చెయ్యనక్కర్లేదు. స్పష్టత, ఆయన రచన ప్రధాన లక్షణం. రెండర్థాలుగల వాక్యం మచ్చుకైనా దొరకదు. అంతరార్థాలు, ధ్వనులు వుండవు. జె. బి. ప్రీస్ట్లీ రచనలు కూడా ఇట్లాంటివే! అందుకే ఆయన్ని కూడా తగిన స్థానం ఇవ్వక మూలకి తోసేశారు. ఇది అన్యాయమనుకుంటాను. ప్రజాస్వామ్యంలో, లలితకళలు నలుగురికీ అందాలన్న యీ రోజుల్లో ఈ పాత సిద్ధాంతాన్ని తిరిగి పరిశీలించి ఖండించాల్సిన అవసరం వుంది. నిత్య జీవితం వొకటి; సాహిత్య జగత్తు మరొకటి. జీవితంతో సంబంధంలేని సాహిత్య జగత్తు వుందనుకోడం జరుగుతూనే వుంది. జీవితాన్ని చిత్రించడం, ముఖ్యంకాని, (వస్తువు) అది చెప్పే విధం—సాహిత్యం ధోరణిలో—అంత ముఖ్యం కాదంటాడు మామ్. ఈ ఉదాహరణ చూడండి. "ఒక యువకుడుంటాడు. ఒకామెని ప్రేమిస్తాడు. కాని రాత్రుళ్లప్పుడే ఆమెని జ్ఞాపకం చేసుకుంటాడు."

అదీ చెప్పదల్చుకున్నది. దాన్ని ఇల్లా చెప్పవచ్చు.

"నిశీథ కరాళచ్ఛాయ లల్లుకోగానే, అతనికి ఆమె అరాళ కుంతలాలు దిగంతాలను కప్పివేస్తూన్నట్లు తోస్తుంది. కేశరాశి విప్పారిన పాయల్లో తన ముఖాన్ని కప్పుకొంటె వినీల విచల న్మేఘాలింగనంలో మైమరచిన తారానాథుడే తాననిపిస్తుంది."

ఆమె రాత్రిపూటే జ్ఞప్తికి రావడానికి కారణం ఏమిటో ఇల్లా చెప్పవచ్చు.

"ఇరులు ఆమె కురులు, మెరుపుతీవలామె నవ్వులు; తారకలామె తలలో పువ్వులు. ఆమె వూర్పు చందన ధూపం; ఆమె కౌగిలి రస రాజ్య గేహళి. అందుకే రేయి యిరుల రాకతో ఆమె అతని మదిని తాకు"

ఇల్లాగా చెప్పవచ్చు.

"ఆ యువకుడికి పనిలేదు. కాని తన కేపనీ లేదన్న విషయం ఎదుర్కోలే డతను. పగలల్లా ఏదో పని వుందనుకుని దగా చేసుకునేందుకుగాను, పగలు ఆమెని స్మరించక, రాత్రిపూటే జ్ఞాపకం చేసుకుంటాడు."చాలామంది,ఈ రెంటిలో, గంభీరమైన భాషలో సాగిన ఆ మొదటి భాగాన్నే సారస్వతం అంటారు. మామ్ ది రెండో భాగం ధోరణిలో సాగే రచన. కవిత్వం, వూహ ఆయనలో తక్కువ. ఎంతో ఉద్రేకంవస్తే, "ఆ! అల్లాగా!" అన్నవి తప్ప, దాన్ని ప్రకటించే మాటలు ఆయనకి దొరకవు. అది ఆయనకీ తెలుసు. ఉన్న శక్తుల్నే పరిపూర్ణంగా వినియోగించుకుంటాడు. నిజాయితీతో వినియోగించుకుంటాడు. ఇది చాలా ప్రశంశనీయమైన నిజాయితీ. సమకాలీనుడై, మామ్ అంతటి ప్రజామోదాన్ని పొందగల్గిన నాటక రచయిత ప్రీస్ట్లీ మామ్‌ని ఇల్లా మెచ్చుకున్నాడు.

"చాలామందిని మెప్పించేరచన ఆయనకి సాధ్యం. అనేక జాతులవారినీ, దేశాలవారినీ, వివిధ మనస్తత్వాలు గలవారినీ రంజింప చెయ్యగలడు. స్ఫుటంగా కనబడేపాత్రలు, చక్కటి కథనం వుండడమే కాకుండా, పరిపూర్ణమైన నిజాయితీతోకూడిన రచన ఆయనది. వీరందరితరపునా, నాతరపునా, జోహారులర్పిస్తున్నా."

కవితావేశం, ఉద్రేకప్రకర్ష కాస్త లోపించడంవల్ల ఆయన రచనల్లో అంతరంగజీవిత చిత్రణ అంతగా వుండదు. నాటకంలో పాత్ర, చెప్పినదానివల్లా, చేసినదానివల్లా మనకి ఎల్లా విశదమౌతాడో ఈయన కథల్లోకూడా, పైకగపడేవాటినీ, బాహ్యరంగంలో సంభవించినవాటినీ పురస్కరించుకుని, వ్యక్తులు చిత్రించ బడతారు. సాధారణంగా పాఠకుడుకూడా వీటినిబట్టి వ్యక్తులకి విలువకడతాడు కావున, ఈరకం చిత్రణ, వారికి నచ్చుతుంది. లోతు, గాంభీర్యంలోతు లేకపోవడంఅంటే ఇదే. మనం పరిశీలించిన రెండు గొప్పకథలలోనూ ప్రధానవ్యక్తులు, సంస్కారంలేనివారు. పల్లెప్రాంతపు భాయీలు. వారిలో కల్ల, కపటం, తికమకల మనస్తత్వం వుండదు. పెద్దగా చిత్రించేటందుకు తగినంత అంతరంగ కథనమూ వుండదు. మామ్‌కి అట్లాంటివారే అభిమానులు.

చరిత్రలో వ్యక్తులు, పురాణపురుషులు, మహానుభావులు—వీరిని చిత్రించే శైలిలో గాంభీర్యముండాలి. ఉదాత్తమైన పదజాలం కావాలి, నిజమే.కాని ఈనాటి సమాజాన్ని, మనమెరుగున్న మామూలు వ్యక్తుల్ని చిత్రించడానికి, మామ్ అలవరుచుకున్న శైలి సరైందేననుకుంటాను. అల్లా వ్రాయడం, —విసుగు లేకుండా,—అర్థంకోసం వెనక్కిముందుకీ వెళ్లకుండా, భాషని గురించి పట్టించుకోక, విషయంలో లీనమైపోయి, మానసిక అనుభూతిని పొందేటట్లా—వ్రాయగల్గడం, అనుకున్నంత సులువుకాదు. సాధనవల్లకాని అది అలవడదు. సహజమైన ప్రతిభ వుంటేగాని, అలవడినా, నిలబడదు.

రచించడం బదులు, మాటలు చెప్పినట్లుగా రచించడం —అది ఈయన శైలి విశిష్టత. బొడ్డులోంచి సంగీతం రావడం లాంటిది కదూ. వ్రాయడు—చెప్తాడు. కలంతో రచనకాదు. బుజంమీద చెయ్యివేసి, కళ్లల్లోకి చూసిచెప్పడం. నిలబెట్టేటట్లు మాటలుచెప్పడం—ఆ మాటల్నే కలంతో కాగితంమీద పెట్టడం. ఇదికూడా ఎందుకు ఉత్తమ సాహిత్యంకాదో నాకర్థంకాదు. భాషతో ఆసనాలు, మాటల ఇంద్రజాలం, పాండిత్యప్రకర్ష ముఖ్యమా? తోటిమానవుణ్ణి, మన మనస్సుల్ని అర్థంచేసుకుని, జీవితపు వైచిత్రిని కాంక్షతో పరిశీలించి, మరుగుపడ్డ మానవత్వపు కోణాలని వెలిగించి, 'రసానుభూతిని కలిగించడం, పాఠకుడు ఆ పొందిన దానితో తన దృక్పథాన్ని సరిదిద్దుకుని, శీలాన్ని పెంపొందించుకుని, నైతిక చింతనని విస్తృతం చేసుకుని, జీవిత సంగ్రామానికి సంసిద్ధుడు కావడం ముఖ్యమా?

''కోట్లాదిజనం కడుపునిండా తిండిలేక పస్తుంటూవుంటే అనేక ప్రాంతాలలో రాజకీయ స్వాతంత్ర్యం అంతరించి పోతూ వుంటే, యుద్ధాల అనంతరం, వేలాదిమందికి సుఖం దూరమై పోతూంటే, ఇన్నాళ్లూ ఆశ పెట్టుకుని బ్రతుకుతూ వొచ్చిన ప్రజకి జీవితపు విలువలపై నమ్మకం సడలిపోతూవుంటే, ఈ కథలు, నాటకాలు, నవలలు వ్రాయడం వెర్రికాక, మరేమిటో నాకు తెలియదు. మేం ఇంకేమీ చెయ్యలేంగనక, ఇవి వ్రాస్తున్నాము—అని నా సమాధానం. ఇవి వ్రాస్తూ కూర్చోడంకంటె ముఖ్యమైన పనులెన్నో వున్నాయి, నాకు తెలుసు. కాని నాకు చేతనైనపని ఇదొక్కటే. ఇల్లు తగులడుతూవుంటే, చేదెడునీళ్లు పొయ్యనందుకు మమ్మల్ని కసురు కుంటారు. చేదతో నీళ్లు తోడడం మాకు చేతకాదు. ఆ రేగే మంటల్ని చూస్తూవుంటె, వర్ణించేటందుకు మంచిమంచి మాటల్ని వెదుకుతూ అద్భుత రసాన్ని చూరగొంటాం.''

ఇదివ్రాసిన మామ్‌ని రెండోతరగతి రచయితల జాబితా లోంచి తీసేసి, మొదటి తరగతి రచయితల జాబితాలో వెయ్యడానికి వెనుదీయను. కావలిస్తే ఆజాబితాలో మొదటి ఇరవైమంది అయ్యాక ఆయన పేరు చేర్చండి. ఇదిత్వరలోనేజరుగుతుందనుకోడానికి నిదర్శనాలున్నాయి. తెలుగువారికి కథలంటే అభిమానం. ఆరంగంలో నేడు మంచి కృషి జరుగుతూవుంది. విజయం సాధిస్తున్నారు. ఈ కథలు ఇంగ్లీషులో లభ్యమైతే పైదేశాలవారిని రంజింప చేస్తాయి. వీరు సాధిస్తున్న ఫలితాలకి ఇప్పుడిప్పుడే ఆదరణ లభిస్తోంది. ఈ ఆదరణ పూర్తిగా లభ్యమైననాడు మామ్ మొదటి తరగతి కథకుల జాబితాలో చేరతాడని నా ఆశ. ఆంధ్రులలో కాస్త మామ్‌తత్వం వుంది. మామ్‌లో కాస్త ఆంధ్రత్వంవుంది. ఉభయులూ చెప్పదల్చుకున్నపాఠంకూడా వొకటే : తోటి మానవుణ్ణి కరుణించు, వీలైతే ప్రేమించు. దూషించకు, ద్వేషించకు, తీర్పుచేసి శిక్షించకు. తోటి మానవుణ్ణి తీర్పుచేసి శిక్షించే అర్హత మానవుడికి లేదు.



# 1965: మనమూ - ప్రపంచము

శ్రీ 'పరిశీలక్'

**1965** చివరకు అంతర్జాతీయంగా భారత్ పరిస్థితి ఏమిటి? కాశ్మీర్ వివాదం పరిష్కారం కాలేదు. కమ్యూనిస్టు చైనాయొక్క దురాక్రమణ ముప్పు తగ్గలేదు. ఉత్తరపు సరిహద్దున ఒక శత్రువుకు (పాకిస్తాన్) మరొక శత్రువు (చైనా) తోడై నిలచాడు. మన శ్రేయస్సుకు అవసరమైనంతగా అంతర్జాతీయ సుహృద్భావం లభించడంలేదు.

స్వప్రయోజనాల (భద్రత—రక్షణ) దృష్ట్యా చూచినప్పుడు, దేశానికి ఉత్తరపు సరిహద్దున ఏర్పడిన ముప్పును తప్పించడం తక్షణకర్తవ్యం. ఈకర్తవ్య నిర్వహణం రెండు భాగాలు. ఒకటి సైనిక ఆయత్తత. రెండు, అంతర్జాతీయ సుహృద్భావసాధనకు అనువైన దౌత్యనీతి అనుసరణ. సైనిక ఆయత్తతకు సంబంధించినంత వరకు, దేశస్థితి గతంలోకంటే మెరుగుగా వుంది. కమ్యూనిస్టు చైనాద్వారా నేఫాలోను, పాకిస్తాన్‌వల్ల కచ్‌బాడవలోను సైనికంగా పొందిన అపజయాలు, అపఖ్యాతి కాశ్మీర్ రంగంలో ''అప్రకటిత'' యుద్ధంద్వారా పొందిన విజయం వల్ల తీరిపోయినాయి. భారత సైనికపాటవానికి పరిగణనవచ్చింది. ''పశుబలాన్ని—పశుబలంతో ఎదుర్కొనడానికి సిద్ధం'' అనేవిధానం అమలులోకి వచ్చి, ధర్మం— శాంతి— సహజీవనం— పంచశీల మొదలైన నీతి ప్రబోధాలు, అందుకు సంబంధించిన నైతిక నాయకత్వ ఘట్టానికి స్వస్తి చెప్పించింది. వాస్తవికతకు అనువైన విధంగా కొత్తఘట్టం ఆరంభమైంది. ప్రభుత్వంతో పాటు, భారత ప్రజలుకూడా, అటు చైనాను, ఇటు పాకిస్తాన్‌ను ఎదుర్కొని తీరాలని మానసికంగాను, సైనికంగాను ఆయత్తమై వుండడం ఇందుకు నిదర్శనంగా వుంది. కాని, ఇందుకు తగినట్టుగా అంతర్జాతీయ సుహృద్భావ సాధనకు అనుసరించవలసిన దౌత్యనీతిలోను, అంతర్జాతీయ పరిస్థితుల అవగాహన పద్ధతిలోను మార్పు ఇంకా రాలేదు. జాతీయ స్థాయిలో కానవచ్చిన మార్పు, అంతర్జాతీయ దౌత్యనీతిలో ప్రతిబింబించడంలేదు. ఆకారణంచేత అంతర్జాతీయ సుహృద్భావం అవసరమైనంతగా భారత్‌కు లభించడం లేదు.

కమ్యూనిస్టు చైనా మనసరిహద్దులలో కొన్ని వేల మైళ్లు దురాక్రమణచేసి, తిష్ఠవేసివున్నా, పాకిస్తాన్ మనమీద రెండుసార్లు దాడులు జరిపినా, ప్రపంచరాజ్యాలకు మనమీద సానుభూతిలేకపోయింది. ఏదోవిధంగా అటుపాకిస్తాన్‌తో రాజీపడి చైనాను సంయుక్తంగా ప్రతిఘటించమని కొందరు; ఇటుచైనాతో సమాధానానికి వచ్చి అంర్జాతీయ సామ్రాజ్యవాదాన్ని నిరోధించమని మరికొందరు సలహాలు చెప్పడం, రాజీపథకాలు సూచించడం జరుగుతూవుంది. ఈ అంతర్జాతీయ ధోరణులను గమనించినప్పుడు మన స్థితి ఇలాఎందుకు మారిందనే అనుమానం కలగడం సహజం. ఈ అనుమానం తీరడానికి, మనల్నియీస్థితికి తెచ్చినపూర్వచరిత్రను, పర్యాలోకన చేసుకొనడం అవసరం.

## 2

ప్రపంచ రాజకీయాలలో మిత్రులు— శత్రువులు అనేవారు శాశ్వతంగా ఉండరు. శాశ్వతంగా ఉండేవి —ఆయా దేశాల స్వప్రయోజనాలు. ఆ ప్రయోజనాల సాధనకు అనుసరించవలసిన విధానాలు: ఆ విధానాలే అంతరా తీయంగా మిత్రులనుకాని,శత్రువులనుకాని పెంచగలవు. రెండుదేశాలమధ్య స్నేహం ఏర్పడాలని వాంఛిస్తే, అందువల్ల మనకు వచ్చే ప్రయోజనంతోపాటు, అవతలి దేశానికికూడా రాగల ప్రయోజనాన్నిగురించి నచ్చచెప్ప గలగాలి. ఇలా

నచ్చచెప్పగలగాలంటే ఇతరదేశాలను మనం అర్థం చేసుకొనేపద తులలో మార్పు రావాలి.

ఉదాహరణకు బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, రష్యాలను మనం ఎలా అర్థం చేసుకుంటూవచ్చామో పరిశీలించుకుంటే, అంతర్జాతీయ సుహృద్భావాన్ని మనం ఎలా కోల్పోయామో తెలుస్తుంది.

జాతీయోద్యమంనాటినుంచి బ్రిటన్, ఫ్రాన్స్ లను సామ్రాజ్యవాదశక్తులుగా మనం పరిగణిస్తూ వచ్చాము. విమర్శిస్తూవచ్చాము. మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత కూడా వీటిపట్ల మన దృక్పథం మారలేదు. విమర్శనా పద్ధతీ మారలేదు. ఇవి కూడా ప్రజాస్వామిక దేశాలని గుర్తించలేకపోయాము. ఆ దేశాల ఆంతరంగిక పరిస్థితులనుబట్టి, వాటి విధానాలు రూపొందుతాయని, ఆ రాజ్యాలలోని ప్రజా స్వామికశక్తుల స్వభావాన్నిబట్టి అవి వ్యవహరించవలసి వుంటుందని గ్రహించలేకపోయాము. అవి ఎన్నిదేశా లకు స్వాతంత్ర్య ప్రదానం చేసిందీ అంచనా వేయలేకపోయాము. పైగా వాటిని శత్రువును విమ ర్శించినట్టుగా కటువుగా విమర్శించాము. సూయజ్‌పై దాడి జరిగినప్పుడు బ్రిటన్‌పై చేసిన విమర్శ; ఆల్జీరియా వ్యవహారంలో ఫ్రాన్స్‌పై చేసిన ప్రకట నలు ఇందుకు ఉదాహరణలు. ఇలా విమర్శించే హక్కు మనకు కలదని, అది జాతీయతత్వ లక్షణమని, అది పీడిత జాతుల సమైక్యతా మార్గమని భావించాము. కాని సూయజ్ వ్యవహారంపై బ్రిటన్‌లో ఈడెన్ ప్రభుత్వ పతనంలోను, ఆల్జీరియాకు స్వాతంత్ర్య మివ్వడంద్వారా ఫ్రెంచి రాజకీయాలలో డీగాల్ తెచ్చిన మార్పులను, అందులోని ప్రజాస్వామిక లక్షణాలను ప్రశంసించలేకపోయాము. ఇక గోవాపై మన పోలీసు చర్యను పాశ్చాత్య రాజ్యాలు ఖండించడాన్ని సామ్రాజ్య వాదంకింద జమకట్టాము. టిబెట్‌ను కమ్యూనిస్టు చైనాకు కట్టబెట్టడంలో సైనిక ప్రమాదం రాగల దన్న హెచ్చరికను కలోనియలిస్టు దృక్పథంకింద పరిగ ణించాము.

అమెరికాకు వలస ప్రాంతాలులేవు. అది సామ్రాజ్య వాద దేశముకాదు. కాని రాజకీయ బానిసజీవితం అను భవించిన మనకు, సాంఘిక న్యాయం వాంఛిస్తున్నమనలో కేపిటలిజంమీద ద్వేషం పెరిగివుంది. ఆ ద్వేష ప్రవృత్తే సంపన్నమైన అమెరికాను కేపిటలిస్టు దేశంగా మనము భావించేట్టు చేసింది. సామ్రాజ్యవాదం అనుయాయిగా చిత్రించింది. జాతీయోద్యమాల విజయానికి, సాంఘిక న్యాయసాధనకు అమెరికా భారీ ఎత్తున అందజేసే అంతర్జాతీయ ఆర్థిక సహాయం నిజలక్షణాలను గుర్తించకుండా చేసింది. ఆ దేశపు కేపిటలిస్టు వ్యవస్థలో ఆధునికంగా వచ్చిన మార్పును, శ్రేయోరాజ్య ధోరణులను గమనించకుండా చేసింది. కమ్యూనిజం విస్తరణను నిరోధించడంలో అమెరికాకుగల అంత ర్జాతీయ చింతనను, లక్ష్యాలను ఆకళింపు చేసుకొన లేని స్థితిలో వుంచింది: వియత్నాం పోరాటంలో ఉత్తర వియత్నాంనుంచి దక్షిణ వియత్నాంకు గెరిల్లాలు, ఆయుధాలు వస్తున్నందున, వానిని ఆపడానికి ఉత్తర వియత్నాంలోని సప్లయి మార్గా లను, గెరిల్లా స్థావరాలను అమెరికనులు బాంబు చేయడం అన్యాయంగా భావింపజేసింది. కాశ్మీర్‌కు వచ్చే పాక్ దుండగులను నిరోధించడానికి మనం పాక్ స్థావ రాలమీద విమానాలతో దాడులు చేయడాన్ని అమెరికా విమర్శించడం అక్రమం అనిపింపజేసింది.

సోవియట్ రష్యాలో ప్రజాస్వామ్యంలేదు. పార్టీ నియంతృత్వంవుంది. వలస ప్రాంతాలు లేవు. అంత ర్జాతీయ కమ్యూనిస్టు గూఢచారిదళం వుంది. సామ్రా జ్యం అనేది లేదు. కాని బాల్కన్, బాల్టిక్ దేశాలతో కూడిన కమ్యూనిస్టువలయం వుంది. కేపిటలిజంలోని దోపిడీ లక్షణం లేదు. కాని దానిలో అంతర్జాతీయ విస్తరణతత్వం వుంది. అయినా ప్రజాస్వామికశక్తులకు నిలయమనుకునే భారత ప్రభుత్వందృష్టికి రష్యాలోని ప్రజాస్వామ్యవిరుద్ధలక్షణాలు కానరావు. హంగరీలో, పోలెండులో ప్రజావిప్లవాలను అది అణచివేయడం అన్యాయం అనిపించదు.

కేవలం అగ్రరాజ్యాల విషయంలోనేకాదు. చిన్న రాజ్యాల విషయంలోకూడా భారత్ అవగాహన పద్ధ తులు— ప్రవర్తన విచిత్రంగా వుంటూవచ్చాయి. నేపాల్, బర్మా, లంక, మలేసియాలతో మనసంబంధాలు ఇందుకు నిదర్శనాలు.

నేపాల్ మన పొరుగునవున్న చిన్నహిమాలయరాజ్యం సర్వవిధాలా భారత్‌పై ఆధారపడివున్నదేశం. అయినా

టిబెట్‌లో మానవహక్కులు— పౌరస్వత్వాల పున రుద్ధరణ కోరుతూ సమితి సర్వసభ్య సమావేశంలో వచ్చిన తీర్మానంపై అది వ్యతిరేకంగా వోటుచేసింది. అల్జీర్స్ సభలో రష్యాకు ప్రాతినిధ్యమివ్వడాన్ని నేపాల్ వ్యతిరేకించింది. ఇది భారత్ విధానాలకు విరుద్ధం. మన పొరుగునవున్న నేపాల్‌కుకూడా మనవిధానాలు నచ్చలేదనిదీని తాత్పర్యం. ఇందుకు కారణం—నేపాల్ రాజ్యాంగాన్ని మనం విమర్శించడం. నేపాల్ రాజుపై తిరుగుబాటుచేసి భారత్‌లో తలదాచుకున్న వారిని పట్టిఇవ్వకపోవడం; భారత్ ఆయుధాలు చాటుగా నేపాల్‌కు చేరడాన్ని నిరోధించకపోవడం; నేపాల్ లోని కొందరు రాజకీయనాయకులను మిత్రులుగా భావించి సమర్థించడం; చైనా దండయాత్ర సందర్భంలో నేపాల్‌ను సంప్రతించకుండా, అది మన "రక్షిత రాజ్యం" అని ప్రకటించడం; అది చిన్న దేశమైనా ఆదేశ స్వాతంత్ర్య ప్రతిపత్తిని, మనదేశ స్వాతంత్ర్య ప్రతిపత్తితో సమమైనదిగా పరిగణించి వ్యవహరించక పోవడం; నేపాల్ మన విధానాలకు విరుద్ధంగా వ్యవహరించడానికి మూల కారణం అయింది.

బర్మా సర్వవిధాలా భారత్‌కు మిత్రదేశం. భారత్ పెట్టుబడులు, ఆదేశంలో విశేషంగా వున్నాయి. కార్మికులు వున్నారు. వర్తక వాణిజ్య సంబంధాలు వున్నాయి. మనకువలెనే సోషలిస్టు సమాజస్థాపనను బర్మా కోరుతున్నది: ఇందుకు అది అనుసరించిన విధానాల వల్ల భారత పెట్టుబడులకు, వ్యాపారాలకు నష్టం కలిగించింది. ఆనష్టాలను తగ్గించుకొని, భారత్ బర్మా అనుబంధాన్ని సుస్థిరం చేసుకొనగల మార్గాన్ని మనం అనుసరించ లేకపోయాము. మనవలెనే బర్మాకూడా చైనా సరిహద్దుల్లో వుంది. ఉనికిని బట్టి, చైనా— భారత్ సరిహద్దు వివాదంలో దానికి "తాటస్థ్యం" తప్పనిసరి అయింది. విబంధ విధాన ప్రబోధంలో ప్రసిద్ధిచెందిన భారత ప్రభుత్వం, బర్మా అనుసరించే విబంధ విధానాన్ని అర్థం చేసుకొనలేక పోయింది. మన అంతర్జాతీయ అవగాహనలో లోపం కలదనడానికి బర్మా— భారత్ సంబంధాలు ఒక నిదర్శనంగావున్నవి.

లంకకూడా చిన్న స్వతంత్రదేశం. అచ్చటిరాజకీయ ఆర్థికజీవితంలో స్థానిక భారతీయులున్నారు.— వారి భాష (తమిళం) కీలక పాత్ర నిర్వహిస్తున్నది ఇది లంక జాతీయజీవితంలో క్లిష్టపరిస్థితిని తెచ్చిపెట్టి నది. ఆదేశ శ్రేయస్సు, మన సుహృద్భావం పెంపుదలకోసం, మన సహకారంద్వారా పరిష్కరింకావలసిన ఈ సమస్యలను మనం చిరకాలం నిర్లక్ష్యం చేశాము. అంతర్జాతీయ సుహృద్భావ సాధనలో మన పొరుగు దేశాల పట్ల మన నిర్లక్ష్య వైఖరికి లంక—భారత్ సంబంధాలు చక్కని ఉదాహరణంగా చెప్పుకోవచ్చు.

మలేసియా ఆదినుంచి భారత్‌కు అండగావుంది. నీఫాలో చైనా దురాక్రమణను, కాశ్మీరులో పాక్ దురాక్రమణను అది ఖండించింది. అది ముస్లిం దేశమని, దానికీ చైనీయుల సమస్య కలదని మనం గుర్తువుంచుకోవాలి. అయినా ఇండోనీసియాతో దానికి గల వివాదంలో భారత్ వైఖరి అస్పష్టంగాను, అవకాశవాదపూరితంగాను వుండిపోయింది. ఇండోనీసియాను కించపరచరాదని భావించడం, మలేసియాలో బ్రిటన్ పలుకుబడిని పరోక్షంగా సమర్థించినట్టు కాగలదని భావించడం ఇందుకు కారణం. ఇందువల్ల ఇండోనీసియా— భారత్ సంబంధాలు వృద్ధి చెందలేదు. మలేసియాకుకూడా సుహృద్భావ ప్రతినిధి వర్గాన్ని పంపించవలసిన అవసరం భారత్‌కు ఏర్పడింది. మిత్ర భావం చూపిన దేశానికి కూడా శంకలు కలిగించే విధంగా భారత్ వ్యవహరిస్తూ వచ్చినదనడానికి మలేసియా—భారత్ సంబంధాలను ఒక ఉదాహరణంగా చెప్పుకోవచ్చు.

కేవలం దేశాల విషయంలోనేకాక, వ్యవస్థల (నియంతృత్వం— కమ్యూనిజం) విషయంలో కూడా భారత్ అంతర్జాతీయ అవగాహన— ప్రవర్తన దేశ శ్రేయస్సుకు అనువుగా వుండలేదు.

ఉదాహరణకు: మనదృష్టిలోపాకిస్తాన్‌లో అయూబ్‌ఖాన్ ఒక నియంత. కాని అదేపరిస్థితులలో ఐక్యఅరబ్ రిపబ్లిక్‌లో అధికారం చెలాయిస్తున్న నాసర్ నియంతకాదు. చైనాలో వున్నది కమ్యూనిస్టు నియంతృత్వంతోకూడిన హన్‌జాతి సామ్రాజ్యతత్వం. కాని రష్యాలోవున్నది కమ్యూనిస్టు నియంతృత్వంతో కూడిన రష్యన్‌జాతి సామ్రాజ్యతత్వంకాదు. ఎన్‌క్రుమా నియంతృత్వం కిందవున్న ఘనాతో మనకు సుహృద్భావ సంబంధాలుకావాలి. కాని అయూబ్‌ఖాన్ నాయకత్వాన

వున్న పాకిస్తాన్‌తో అమెరికా సుహృద్భావ సంబంధాలు కలిగి వుండకూడదు.ప్రపంచంలోని వివిధ వ్యవస్థలపట్ల భారత్ అవగాహన సమంగాలేదన డానికి ఇది నిదర్శనాలు.

అంతర్జాతీయ రంగంలో మన అవగాహనలో ప్రవర్తనలో ఇంతగా ద్వంద్వప్రమాణం (double standard) వున్నప్పుడు, ఇతరులు మనలను, మన విధానాలను సవ్యంగా అర్థంచేసుకొనడం లేదనడం నిరర్థకం. ఆపత్కాలంలో ఆయాదేశాలకు రకరకాల దౌత్య ప్రతినిధులను, పార్లమెంటరీ బృందాలను పంపించడం నిరుపయోగంకాక, అంతర్జాతీయ ప్రవర్తనలో మన అపరిపక్వతను అదివెల్లడిచేస్తున్నది.

## 3

అంతర్జాతీయంగా మన అపరిపక్వస్థితికి మరొక ఉదాహరణ— విదేశ ఆర్థిక, ఆహార, ఆయుధ సహాయ స్వీకరణలోచూపుతున్న భేషజాలు: విదేశపు పెట్టుబడులు, ఆహారధాన్యాలసప్లయి, ఆయుధాలవిక్రయం అనేవి అంతర్జాతీయవర్తక వాణిజ్య సంబంధాలలో ఒక భాగం. ఆయాదేశాల పారిశ్రామిక శక్తినిబట్టి వ్యాపారాలు, సహాయాలు జరుగుతాయి. ఆయా దేశాల పరిస్థితులనుబట్టి,రాజకీయ ఆర్థిక విధానాలకు : ఇవి ప్రాతిపదికగా వుంటాయి. ఉదాహరణకు కెనడా, ఆస్ట్రేలియాలలో గోధుమలు అధికంగా ఉత్పత్తి అవుతాయి. వానిని విదేశాలలో విక్రయించనప్పుడు దేశీయంగా రైతులు దెబ్బతింటారు.రాజకీయ విపరిణామాలను, ఆ దేశాలు ఎదుర్కొనవలసి వస్తుంది. అయితే అంతర్జాతీయ మార్కెట్‌లో అమెరికా గోధుమల పోటీ వీనికి వుంది. కనకనే కమ్యూనిస్టు చైనాకు కెనడా, ఆస్ట్రేలియాల గోధుమల విక్రయం జరుగుతూవుంది. పశ్చిమజర్మనీ, బ్రిటన్, స్విట్జర్లాండ్ మొదలైన దేశాలలో ఆయుధోత్పత్తి పరిశ్రమలు వున్నాయి. విదేశాలకు ఆయుధాల విక్రయం అనేది ఆ దేశాల ఆర్థిక సుస్థితికి మనుగడకు అవసరం. వానిని విక్రయించనప్పుడు, నిరుద్యోగం మొదలైన బాధలవల్ల ఆ దేశాల ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు దెబ్బతిని పోగలవు.

ఈసంగతి ఇట్లా అని మనం గుర్తించినప్పుడు అంతర్జాతీయ ఆర్థిక, ఆహార, ఆయుధ సహాయస్వీకరణ పట్ల ఇప్పుడు చూపే భేషజాలకు ఆస్కారంలేదు. అమెరికా గోధుమలు చేదు. రష్యాఉక్కుతీపి, అనే ఆలోచనకు తావులేదు. ''నాటో'' భాగస్వాములైన టర్కీ, ఇరాక్‌లవద్ద వున్న అమెరికా ఆయుధాలు పాకిస్తాన్‌కు చేరినందుకు అమెరికాను నిరసించిన పద్ధతిలోనే, ఇండొనీసియా స్వీకరించిన సోవియట్ జలాంతర్గాములు పాకిస్తాన్‌పరం అవుతున్నప్పుడు రష్యాను కూడా నిరసించాలి. అసలు అంతర్జాతీయ ఆయుధ సహాయ విధానాన్ని నిరసించాలి. ఒకరిని విమర్శించడం ఒకరిపట్ల మౌనం వహించడం అంతర్జాతీయంగా సక్రమ ప్రవర్తన కాబోదు. మనకు ఆపదవచ్చినప్పుడు, తిరిగి అన్నిరకాల ఆయుధ సహాయాన్ని ''అర్థించడం'' కూడా సమర్థనీయంకాదు.

విదేశసహాయాలకు సంబంధించిన మరొక అంశం —కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఆయా దేశాల సహాయం ఆశించినంతగా రాకపోవడం, లేదా అసలు ఆగిపోవడం. ఈ పరిస్థితిని చారిత్రకదృష్టితో అర్థం చేసుకొని, భవిష్యత్తులో మిత్రత్వానికి భంగంరానట్టుగా వ్యవహరించడం అంతర్జాతీయ రాజనీతికాగలదు. ఉదాహరణకు—నాజీ జర్మనీవల్ల బ్రిటన్ ఆపత్కాలంలో వున్నప్పుడు, అమెరికానుంచి ఆయుధసహాయం అధ్యక్షుడు రూజ్వెల్టు ఎంతగా ప్రయత్నించినా, ప్రధాని చర్చిల్ ఆశించినంత త్వరగా లభించలేదు. ద్వితీయ ప్రపంచయుద్ధకాలంలో స్టాలిన్ కోరిన విధంగా పశ్చిమరాజ్యాలసహాయం చేరలేదు. మార్షల్ పథకంద్వారా ఐరోపా పునరుద్ధరణకు అమెరికా ప్రయత్నించడంలో ఫ్రాన్స్, ఇటలీలలో ఎదురైన సమస్యలు, పశ్చిమజర్మనీ పునర్నిర్మాణంలో ఫ్రాన్స్—రష్యాల నుండి అమెరికాకు వచ్చినప్రతిఘటన చారిత్రకమైన ఉదాహరణలుగావున్నాయి. వీనిదృష్ట్యా చూచినప్పుడు భారత్— పాక్ వైరుధ్యంలో అమెరికా పొందుతున్న విమర్శలు ఏమాత్రం ఎక్కువకాదు. అవి స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన ఆయాదేశాల దౌత్యనీతిలో అంతర్గతమైన ఒకతరహా విభిన్నాభిప్రాయాలుగా చెల్లుబడి అయినవేకాని, భారత్ చూపుతున్నంత కటువైన ధోరణిలోను, ఎడముఖం—పెడముఖం తత్వంలోను శత్రుత్వ ధోరణులను పెంచలేదు.

ఈ విధంగా అంతర్జాతీయ పరిస్థితుల అవగాహనలోను, ప్రవర్తనలోను లోపాలవల్ల భారత

విబంధ విధానం ఆచరణలో భారత స్వప్రయోజనాల సాధనకు అనువైన అంతర్జాతీయ సుహృద్భావాన్ని ఇంతవరకు సమకూర్చలేక పోయింది: ఉత్తర సరిహద్దులలో ముప్పును నివారించలేక పోయింది.

## 4

1965 చివరలో సరికొత్త పరిణామం భారత్—పాక్ వివాదంలో రష్యా మధ్యవర్తి కావడం. అమెరికా—బ్రిటన్‌లు దానిని సమర్థించడం. ఇది నిజంగా ఆసియా గత చరిత్రకు విరుద్ధమైన పరిణామం. జారు చక్రవర్తులకాలంనుంచి ఆసియాలో రష్యా కాలు పెట్టకుండా నివారించాలని బ్రిటన్ ప్రయత్నించింది. తన రాజకీయ అధికారం చెల్లినంతవరకు బ్రిటన్ యొక్క దౌత్యనీతి, రక్షణవ్యూహం, కనీసం రెండు శతాబ్దాలపాటు రష్యా ప్రాబల్యాన్ని నిరోధించింది: కాని 1965 చివరకు కామన్వెల్తు సంబంధాలద్వారా ఆసియాలో రష్యాయొక్క రాజకీయ ప్రాభవాన్ని బ్రిటిష్ దౌత్యనీతి తగ్గించలేక పోయింది. అమెరికాకూడా, పసిఫిక్ ప్రాంతంలో సైనిక వ్యూహాలతోకూడిన విధానాలద్వారా చైనా కమ్యూనిజం విస్తరణను అరికట్టలేక పోయింది.

చైనా రష్యాదేశాలమధ్యఅంతర్జాతీయకమ్యూనిస్టు నాయకత్వాన్ని గురించి వివాదం వచ్చినతర్వాత, ఆల్జీరియాసభలో రష్యా ప్రాతినిధ్యాన్నిగురించి జరిగిన వాదోపవాదాలు అనంతరం, టిబెట్ స్వాతంత్ర్య సమస్యపై సమితి ఓటింగ్‌లో పెక్కు ఆసియారాజ్యాలు తటస్థంగా వుండిపోవడంతో ఆసియాలో ఇకనుంచి రష్యా కీలకపాత్ర వహించడాన్ని అమెరికా—బ్రిటన్‌లు అంగీకరించి, ప్రోత్సాహించడం ప్రారంభించాయి. వానికి విరుద్ధంగా ఫ్రాన్స్ ధోరణి చైనాకు అనుకూలంగా వుండడం గమనార్హం.

ఈ నూతన పరిణామ స్వభావాన్ని సంగ్రహంగా ఒక్కమాటలో చెప్పుకోవాలంటే—ప్రచ్ఛన్న యుద్ధ (Cold War) వాతావరణం ఆసియాను ఆవరించింది. అంతర్జాతీయంగా అమెరికా—రష్యాల పోటీస్థానే, ఆసియాలో రష్యా—చైనాలమధ్య పోటీ ప్రారంభమైంది. ఐరోపాలో విభక్త జర్మనీ స్థితి, ఆసియాలో విభక్త భారతఖండం (పాక్—భారత్) స్థితి ఒక్కటిగా తయారైంది. భారత సరిహద్దుల భద్రత, కాశ్మీర్ సమస్య అనేవి అపరిష్కృత సమస్యలుగా నిలిచిపోగల ప్రమాదం ఏర్పడింది. ఏ విబంధ విధానంద్వారా అంతర్జాతీయ ఉద్రిక్త వాతావరణాన్నుంచి తప్పించుకోవాలని భారత ప్రభుత్వం ఇంతవరకూ ప్రయత్నిస్తూ వచ్చిందో, ఆ విధానం ఆచరణలో విఫలమైపోయిందని 1965 నిరూపించింది. అంతర్జాతీయంగా భారత్ పరిస్థితిని ఒక ప్రశ్నార్థంగా మిగిల్చి వేసింది.

---



# తెలుగు సామెతలు

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారిదివఱలో ప్రకటించిన "తెలుగు సామెతలు" అనే గ్రంథానికిది ద్వితీయ ముద్రణ—ఇందు, ప్రథమ ముద్రణకన్నా హెచ్చుగా సామెతలుండడమే కాక రెండు పీఠిక లున్నవి. మొదటి దానికి శ్రీ ఎస్. రాఘవాచారిగారును, రెండవదానికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారును కర్తలు—

లక్షలాదిగా ఉండే తెలుగుసామెతలలో ఒకలక్ష సామెతలుసేకరించడానికి సంకల్పించి, కీర్తిశేషులు చిలుకూరి నారాయణరావు గారు 'సామెతల యజ్ఞం' ప్రారంభించారు. సేకరించిన వానిని అకారాదిగా సమకూర్చారు—అకారా ద్యనుక్రమణికలు సంతరించడంలో చిలుకూరివారిని మించిన సిద్ధహస్తులు—ఆంధ్రదేశంలో లేరనడంలో అతిశయోక్తి లేదు. 1946 లో పెదపూడిలో సాహిత్య పాఠశాలలో ఉపన్యసించడానికి వచ్చినప్పుడు వారు, తాము సంకలనం చేసిన సామెతలను—రెండు పెద్ద మూటలతో తెచ్చారు. ఆ పాఠశాలలో పాల్గొంటున్న మా అందఱికి చూపారు.అనితర సాధ్యమైనవారికృషినిఅభినందించాము.

సాహిత్య పాఠశాల మూలంగానే కాక, ఆనాడు సాహిత్య లోకానికి పై విషయము సుపరిచితమైనా, ప్రస్తుతం ప్రకటితమైన గ్రంథ పీఠికలలో, చిలుకూరివారి కృషి ప్రస్తావన లేకపోవడము చిత్రంగా ఉన్నది. మొదటి దానిలో రెండవ పుటలో.

"సామ్య శబ్దమునకే సామ్యతలను అసాధురూప మేర్పడి యుండవచ్చుననియు, అదియే సామెతగా తెలుగులో వ్యారి ప్రచారములో నున్నదనియు కీ. శే. డాక్టర్ కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావుగారి వాదము" అని వారి పేరు ఉట్టంకింపబడినదే గాని, వారు చేసిన పరిశ్రమను గూర్చిన ప్రశంసే లేదు. రెండవదానిలో చిలుకూరివారి ప్రసక్తే లేదు. సామెతల విషయంలో సామ్యత ఉన్న ఒక కళాప్రపూర్ణుని, కళాప్రపూర్ణులే పేర్కొనకపోవడం—వింతలలో వింత.

ఇరవైయేండ్ల క్రిందట సామెతలను గూర్చిన సంగతులీ గ్రంథంలో ప్రసక్తం కానప్పుడు—అయిదిరవైల క్రింద జరిగిన విషయాలిందులో లేకపోవడానికి మన మాశ్చర్యపడ నక్కఱలేదు.

తెలుగులో సామెతల సేకరణ, నూఱేండ్లనాడు—తెలుగు నేర్చిన తెల్లవారి మూలంగా ప్రారంభమైనది. కెప్టెను యమ్. డబ్ల్యూ. కార్ దొరగారు—రెండు వేలకు పైగా సామెతలు సేకరించి—వానిని అకారాదిగా ఏర్పఱచడమే కాక, వాని నన్నింటిని ఆంగ్లేయభాషలోనికి అనువదించారు. తెలుగు సామెతలతో ఇతర దేశపుసామెతలను కొన్ని చేర్చారు. తెలుగు సామెతలతో సన్నిహిత సంబంధంగల సంస్కృత లోకోక్తులను—అనువదించారు.—సామెత వివరణలిచ్చారు. అది 1869 లో ముద్రితమైనది.

తెలుగు సామెతలు మొదట సేకరించిన కీర్తి కార్ దొర గారికి చెందగా వారి అనుమతిపైని తెలుగులో తొలిసారిగా, అకారాదిక్రమంగా సామెతలను అచ్చువేసిన యశస్సు పువ్వాడ వేంకటరావుగారికి చెందుతుంది. వేంకటరావుగారు 1850—1890 ప్రాంతాలలో మదరాసులో తెలుగు గ్రంథాలను ముద్రించిన ప్రముఖులలో ఒకరు. 1851 లోనే ప్రథమంగా తెలుగు భారతాన్ని సంపూర్ణంగా ముద్రించారు. 1869 వ సంవత్సరంలో వారు తెలుగు సామెతలను 'ఆంధ్ర లోకోక్తి చంద్రిక'[1] అనే పేరుతో ప్రకటించారు. ఆ పుస్తకము నేడలభ్యము. పాఠకుల ఉపయోగార్థం— ముఖపత్రాన్ని యిచ్చుచున్నాను.

ఆంధ్ర లోకోక్తిచంద్రిక

అనగా

తెనుగు సామితలు

వీటితో కూడ కొన్ని సంస్కృత లోకోక్తులు

చేర్చబడి యున్నవి.

Telugu & Sanskrit Proverbs

Translated into English and

explained

Captain M. W. Carr.

C. K. S. Press,

Vepery Madras.

Price Rs. 10.

అని కలదు.

1. ఇది పెద్ద గ్రంథం— వావిళ్లవారు దీనిని సంగ్రహంగా అచ్చు వేశారు. ముఖపత్రంమీద.

ఈ గ్రంథము
కేప్టన్—యం. డబ్ల్యు. కార్ దొరగారు
అనుమతి ప్రకారము
వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలయందు
పువ్వాడ వేంకటరావుగారి వలన
అచ్చు కూర్పించి ప్రచురింపబడితెు
మదరాసు.

ఈ పుస్తకము
అన 1869 దో సం. సెప్టెంబరు నెల


ఇందులో 162పుట లున్నవి. 2708 తెలుగు సామెతలూ, 488 సంస్కృతం లోకోక్తులూ ఉన్నవి. చాలా లోకోక్తులకు మూల శ్లోకాలు యివ్వబడినవి. మొట్టమొదట అచ్చుపడిన గ్రంథం కాబట్టి సామెతల స్వరూప నిర్ణయాని కిది తోడ్పడుతుంది. నే నీ సమీక్షలో ఈ ప్రతినే ఆధారంగా తీసుకొన్నాను. పూర్వ ముద్రణ—అని పేర్కొన్నాను.

ప్రథమ ముద్రణ పీఠికలో తమిళ కన్నడ భాషలలో సామెతల ప్రస్తావన వచ్చినది—23 నుండి 28 పుటల వఱకు సాహిత్యములైన తమిళ, తెలుగు సామెతలు— 29,30 పుటలలో సాహిత్యములైన— తెలుగు కన్నడ సామెతలు యివ్వబడినవి. 31 వ పుటలో వీనిని గూర్చి యీ క్రింది వాక్య మున్నది.

"దక్షిణదేశ భాషలలో నున్న సామెతలను ప్రత్యేకముగా పరిశీలించి వాని పౌర్వాపర్యమును పరిశోధనచేసి నిర్ణయింప వలయును"

ప్రస్తుత గ్రంథ ప్రకటన కైదేండ్లకు పూర్వమే అట్టి పరిశోధన జరిగినది. గ్రంథములు ప్రకటితములైనవి. ఆ వృత్తాంత మిది—

1960 లో దక్షిణ భాషా పుస్తక సంస్థవారు[2] తెలుగు కన్నడ తమిళ మలయాళ భాషలలోని సాజాత్యములైన సామెతలను[3] సేకరించి ప్రకటింపదలచి మదరాసు విశ్వవిద్యాలయాధికారులను కోరిరి. విశ్వవిద్యాలయాధ్యక్షుల యనుమతిని ఆ విశ్వవిద్యాలయమునగల నాలుగు భాషల శాఖాధ్యక్షులును—సమిష్టిగా ఆయా భాషలలో సాజాత్య సామెతలను, జాగరూకతతో చర్చించి సంకలనము చేశారు. తమిళభాషకు కీ. శే. ఆర్. పి. సేతుపిళ్ల, కన్నడమునకు యమ్. మరియప్పభట్టు, మళయాళమునకు డాక్టరు యస్. కె. నాయరు, తెలుగునకు నేను నియామకులమైనాము. కొంచెము హెచ్చు తగ్గుగా 500 సాజాత్యములైన సామెతలు సేకరించాము—తెలుగులో 420 మాత్రమే కనిపించినవి. ఆ సామెతలు—ఆయా భాషలలో వారికి సుగమమయ్యేటట్లుగా నాలుగు భాషల సామెతలు వారివారి భాషా లిపులలో నీయబడినవి. ఉదాహరణకు తెలుగులో నేను సంధానించిన—'సాటి సామెతల' నుంచి చూపుచున్నాను.

(తె) తెలుగు : ఆడే కాలు, పాడే నోరూ వూరకుండవు.

(క) కన్నడము : ఆడిదకాలు హాడిదబాయు సుమ్మనె ఇరదు.

(త) తమిళము : ఆడియకాలుం పాడియవాయుం సుమ్మా ఇరాదు.

(మ) మళయాళము : ఆడియకాలుమ్ పాడియ వాయుమ్ వెరితె ఇరిక్కా.

తె : నిండుకుండ తొణకదు.
క : తుంబిదకొడ తుళుకువుదిల్ల.
త : నిఱై కుడమ్ నీర్ తుళుంబాదు.
మ : నెఱుక్కుడమ్ తుళుంబుక ఇల్ల.

పై వానిలో చాలావఱకు భావనలోనే కాక భావ వ్యక్తీకరణ విధానంలో కూడా, ఎంత సామ్య మున్నదో, అది తెలుగువారు గమనింపదగ్గ విషయం. తక్కిన భాషలవారు పై రీతిగా వారి వారి భాషలలో వ్రాసుకొన్నారు. ఈ సందర్భమున నడచిన చర్చల నుండి—సామెతలను గూర్చి ఎన్నో విషయాలు సంగ్రహింప గలిగాను.

ఈ సామెతలలో రెండు మూడు తమిళ, మళయాళ భాషలకు సంబంధించినవైనా వానిలో లేవు. కంచి నేడు తమిళ నాడులో ఉన్నా—కథ కంచికి మన మింటికి—కంచేడు వాడలు—కంచంత కాపురం—కంచి మేక—మొదలైన సామెతలు పూర్వం తమిళంలో లేవు. 'కంచికి పోయినా మంచానికి నాలుగే కాళ్లు' అన్న దొక్కటే—ఈ తరవాత సామెతలలో కెక్కింది.

ఇక్కడ చెప్పవలసింది చాలా ఉంది. ఒక్కటి మాత్రమే చెబుతాను. కంచి తెలుగువారి దక్షిణపు పరిహద్దు. కథ కంచికి—మన మింటికి అంటే—కంచివరకు కథ తెలుగుభాషలో చెప్పుకోవచ్చు. ఆపైని మన భాష కాదు. తెలుగుభాషలో వ్యవహారము కుదరదు—అని అర్థం. ఆంధ్రభాషాభూషణంలో కేతన—కాశికివెళ్లదలచిన తెలుగువారు కంచినుండే బయలుదేరాలని వ్రాశాడు. ఈ సందర్భంలో కాంచికి 'కాంతి' అనే పేరున్నదన్న మాట మనం మఱచిపోరాదు. ఇట్లే "మళయాళములో చెవులు కుట్టుతారని మాయవరం నుంచి చెవులు మూసుకొని పోయి నట్టు" అన్నది మళయాళ భాషలో లేదు. చెడి చెన్నపట్నం చేరు-అన్న సామెతలో అర్థం చాలా ఉన్నది.

క్రీ. శ. 1898 లో కావ్యాలలోని సామెతలను సేకరించి, భట్టిప్రోలు రామచంద్రయ్యకవి 'ఆంధ్రకవితా రత్నాకరము' అనే గ్రంథాన్ని ప్రకటించాడు. పందొమ్మిది వందల నలభైలో

---

2. The Southern Languages Book Trust, Madras.

3. Comparative Proverbs in Dravidian Languages.

మధురకవి నాళం కృష్ణారావుగారు తెలుగు జాతీయాలని సామెత లను, ఉదాహరణపూర్వకంగా కావ్యాల నుండి సమకూర్చి ఆంధ్ర లోకాని కందజేశారు.)

(క్రీ. శ. 1960 లో నిత్యసాహిత్యజీవనభిక్షువు వేదునూరి గంగాధరంగారు—'పసిడి పలుకులు' అనే ప్రశస్త గ్రంథములో, తెలుగు సామెతలు, వ్యవసాయ సామెతలు, నానాదేశ సామెతలు—ఇంకా ఎన్నో తెలుగు నుడి విశేషాలు వెలయించారు. అకాడమీవారి పదబంధ పారిజాతం—రెండు సంపుటాలలోను సామెత లున్నాయి.)

ద్వితీయ ముద్రణ పీఠికలో సామెతలను గూర్చి చెప్పిన కథల్లోను, వివరాలలోను కొన్ని విమర్శనీయాంశాలను విశద పఱుస్తున్నాను.

1. సాలిజాంద్ర సభా మధ్యే సాతానిః పండితోత్తమః. పుట (44)

ఈ సామెత ప్రసక్తి నేను మొదట 1962 ఏప్రిలు 21 తేదీని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు జరిపిన—చిన్నయ సూరి శతకవార్షిక వర్ధంతిలో, నా4 యుపన్యాసమునతెచ్చి, దాని పుట్టుకకు కారణము వివరించాను. ఆనాటి సభకు అధ్యక్షత వహించిన శ్రీ విశ్వనాథవారే—ఈనాటి తెలుగు సామెతల సంకల నానికి అధ్యక్షులు. ఈ సంగతి సుంతైనా ఇందులో లేదు. భావి పరిశోధకుల ఉపయోగార్థం ఆ అర్థశ్లోకాన్ని పూర్తిగా యిక్కడ తెలుపుతున్నాను.

"సాలి జాంద్ర సభా మధ్యే సాతానిః పండితాయతే
వుల్లీవన సమూహేషు జోరీగః కోకిలాయతే."

1962 లో నేను 'సాతానిః పండితోత్తమః' అని అప్పటికి వాడుకలో ఉన్నదే తెలిపాను. తరువాత పూర్తి శ్లోకం కోసం ప్రయత్నించాను.అది ముందు నేను ఉదాహరించిన 'ఆంధ్ర లోకోక్తిచంద్రిక'లో లభించింది—పై పాఠముతో కూడా.—అందులో 123 వ పుటలో 2650 సామెతగా ఉండడమే కాక—2651 వ సామెతలో తెలుగున

"సాలె సభకు సాతాని పెద్ద. ఉల్లివనానకు జోరీగ కోకిల" అని ఉన్నది.

2. చిలుసులేని తద్దినం, బులుసులేని యజ్ఞం. (పుట. 47)

బులుసు అచ్చయశాస్త్రులుగా రపర విద్యారణ్యులైన పాపయ్యశాస్త్రిగారి తండ్రి. అచ్చయశాస్త్రిగారు, పిండిప్రోలు లక్ష్మణకవి, శిష్ట్లు కృష్ణమూర్తిశాస్త్రిగారలు సమకాలీనులు. వేదమే గాక వేదాంతమన్నా అచ్చయశాస్త్రులుగారికి అంతులేని అభిమానం. లక్ష్మణకవి భగవద్గీతలను తెలుగు చేయడానికి సంకల్పించి కొంతభాగ మాంధ్రీకరింపగా, అచ్చయశాస్త్రులుగారు వేదాంతశాస్త్రం వెల్లడికాగూడదని స్వయముగా లక్ష్మణకవి యింటికి వచ్చి ఆ ప్రయత్నం మానిపించారట.

3. వాతాపి జీర్ణం—వజ్ర శరీరం—(పుట. 51)

ఈ సామెతనే "అగస్త్య మంత్రము పలకడము" అని తెలుగు కవులు వాడారు.

సీ. పా. కక్కూర్తి మెక్కి యగస్త్యమంత్రము వల్కు
బొడ్డు నంటుచు నొక్క భూతనేత

నవరము చిననారాయణకవి కువలయాశ్వ చరిత్ర—2—150

కడుపు నిమిరించు కొంచు నగస్త్య మంత్ర
ములు నొడివి. దశా. 2వ ఆశ్వాసం.

అగస్త్య భ్రాతతో కూడా—అగస్త్య మంత్రము పలక డము—ఇందు లేవు.

"అందఱూ ఒక్క యెత్తు—అగస్త్యుడు ఒక యెత్తు." అన్న సామెతలో 'అగస్త్యుడు' మాత్రమే ఉన్నాడు.

అగస్త్య భ్రాత—పూర్వ ముద్రణలో ఉన్నది.

4. బాదరాయణ సంబంధం—(పుట. 53)

దీనిని గూర్చి యీ క్రింది శ్లోక మున్నది.

"త్వద్గృహే బదరీద్వారో మద్గృహే బదరీ తరుః
బాదరాయణ సంబంధా ద్యూయం యూయమ్ వయం వయమ్."

5. "నానాటికి తీసికట్టు నాగంభట్టూ. (పుట. 53)

ఇది ఒక పద్యంలో చివరి పాదం. పద్యం. ఇది,"

అని పూర్తి పద్య మియ్యబడినది—"నానాటికి తీసిపెట్టు నాగంభోట్లూ" అని పూర్వ ముద్రణ.

ఇట్లాంటిదే—288 వ పుటలో "పేరిశాస్త్రికి గలిగెరా పెదవిపాటు" అనే సామెత.

"గీ. ఉక్కు చెడ దిన్న దశ దిక్కు లొక్కటైన
చుక్కలిల (బడ్డ) గులగిరుల్ ప్రక్కలైన
మొక్కపాటింట నోటను ముక్క లేదు—
పేరిశాస్త్రికి గలిగెరా పెదవిపాటు."

పద్యం చివర పాదాలే గాక మొదటి పాదాలు రెండో పాదాలు మూడోపాదాలున్న సామెతలు చూడండి.

పుట 295. పో . . . .

"పోకలు నమలుచు నాకులు చేబూని సున్న మడుగువాడు శుద్ధ విధవ."

ఇది, "పోకలు నమలుచు నాకులు చేకొని సున్న మడ్గినవాడు శుద్ధ విధవ—" అనే సీసపద్యం—మొదలు—

పుట 51—ఇ—

---

4. నా యుపన్యాసము—అకాడమీవారు ప్రచురించిన "సాహిత్యోపన్యాసములు" అను గ్రంథమున ముద్రితమైనది. అందులో 57 వ పుటలో పై సామెతను గూర్చిన సంగతి కలదు—స్థల సంకోచముచేత, చిన్నయసూరిని గూర్చి చెప్పవలసిన వింకను కొన్ని యున్నను వానిని విడిచిపెట్టవలసి వచ్చినది. పున ర్ముద్రణ భాగ్యము లభించిన అప్పై విషయములతో పై విషయ మును జేర్చెదను.

ఇద్దఱు కూడి, ఏకాంత మాడంగ, వద్ద చేరేవాడు వట్టి వెధవ.

వట్టి విధవ.'' అనే రెండవ పాదం—

పుట 41—:—

''అలితో కలహించి ఆకలి కాదని పస్తు పండుకొన్నవాడు పంజా విధవ.''

ఇది, అలితోఁ గలహించి య్యాఁకలి గాదని పస్తున్నవా డొక్క పంజా వెధవ—అనే మూడవ పాదం.

ఈ మూడు సామెతలు పూర్వముద్రణలో లేవు—ఇవి చాటుపద్య మణి మంజరి ప్రథమ భాగం 204 వ పుటలో 'భైరవా' అనే శీర్షిక క్రింద ఉన్న సీసపద్యంలోనివి—మొదటి పాదాన్ని సరిగా ఉదాహరించి, తక్కిన రెంటిని కొంచెము మార్పు చేసినా, అవి పై గ్రంథం నుండి గ్రహింపబడ్డవన్న మాట వాస్తవం.

పుట. 61. ఉద్ధతుల మధ్య పేదలకుండ తరమా ?

ఇది కవికర్ణరసాయనములోనిది.

గీ. ఒత్తుకొని వచ్చు కటి కుచోద్వృత్తిఁ జూచి
తరుణి తను మధ్య మెచటికో తలగిపోయె
నుండెనేనియుఁ గనుబడకున్న నహహ
ఉద్ధతుల మధ్యఁ బేదల కుండ దరమె ?

'తరమె' అనునది 'తరమా' అని మారినది.

కాశీలో కన్ను మూసినా రాని పుణ్యం—కాళహస్తిలో కాలుపెడితే వస్తుంది. (పుట. 56).

ఇది ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యములో నత్కీరునికి సంబంధించినది. నత్కీరుడు శాపగ్రస్తుడై కైలాసానికి శాప మోక్షణానికి వెళుతూ, కాశీలో స్నానం చేశాడు.కాని శాప మోక్షణ కాలేదు. సుబ్రహ్మణ్యస్వామి దయవలన గయతో ఒక రాక్షసునితో పోరి జయించాడు. సుబ్రహ్మణ్యస్వామి, నత్కీరుడు శాపావధికి కైలాసానికి పోనక్కరలేదని దక్షిణ కైలాసమైన శ్రీకాళహస్తిలో లింగాన్ని దర్శిస్తే చాలునని అతడిని కాళహస్తిలో ప్రవేశపెట్టాడు. నత్కీరుడు కాళహస్తీశ్వరుని నుతించి కైలాసము పొందాడు. కాళహస్తి దక్షిణ కైలాసంగాని—దక్షిణ కాశి కాదు.

శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమే యిందుకు ప్రమాణం.

మ. ప్రణతుల్సేయుచుగాంచెకుంభజాడు లోపాముద్రతోఁ గూడి ద
క్షిణ కైలాసము నంబికా హరకృత శ్రీ పాదుకాన్యాసమున్
మణి మంత్రౌషధ వాసమున్ భవమహామాయావిపర్యాసమున్
గణనాతీతనటీవిలాసము సమగ్ర శ్రీసముల్లాసమున్.(1-109)

ఓనమాలే బుక్కులు ఒకటే రెండే రెక్కలు (పుట 56).

ఇది అక్షరాభ్యాసం లేకుండా, చిన్నప్పటినుంచి వేదం సంత చెప్పుకొనే వేదపండితులని గూర్చినది. వారిలో వేదం, ఎంత చదువుకున్నా—నిశానీదారు లుండేవారు. వెనుక ఉర్లాం సంస్థానంలో వేద పరీక్షలు జరిపి ప్రతి శ్రావణికి-వారికి బహుమతులు రాకపోకలకు ఖర్చు లిచ్చేవారు. ఆ పరీక్షలో నెగ్గినవారికి 'ఉర్లాంవద్దు' అనేవారు. పెండ్లిండ్లశుభకార్యాలలో వారికే ప్రథమ సంభావన—వారూ అంతే—వేదపరీక్షలతోపాటు శాస్త్ర పరీక్షలు జరిగేవి. కీర్తిశేషులు తాతారాయుడుశాస్త్రులుగారు ఉర్లాం పరీక్షలలో మొదట ఉత్తీర్ణులైనవారే. వేదాలని సంరక్షించి వేద పండితులను పోషించిన—ఉర్లాం—శ్రావణి చరిత్ర నేడు విస్మృత ప్రాయమైనది.

సింగినాదం జీలకఱ్ఱ. (పుట. 57).

''పూర్వం ఎఱుకలవాళ్లు ఆడవాళ్లు కొమ్ము వూదుతూ జీలకఱ్ఱ అమ్మడానికి వచ్చేవాళ్లు. ఎఱుకలవాళ్లలో మగవాడికి సింగడని ఆడవాళ్లకి సింగి అని పేరు'' అని 58 వ పుటలో వివరణ ఉన్నది. అయితే—ఈ గ్రంథపీఠికలోనే 17 వ పుటలో ''పూర్వ కాలమున జీలకఱ్ఱ వర్తకులు వూరూర అమ్ముటకు వచ్చినపుడు తమ రాక నెఱింగించుటకై శృంగనాదము చేసెడివారట'' అని పై వివరణానికి విరుద్ధముగా నున్నది. ఇందులో సరియైన వివరణ మేది ?

ద్విపదకావ్యం—ముదిలంజ దిడ్డిగంత—(పుట.58).

''ఇవన్నీ ఒక రాశిలోవని వేణుగోపాలశతకం వాడు వ్రాశాడు. పూర్వం మన దేశంలో ద్విపద కావ్యానికి పెద్ద మర్యాద లేదు'' అని వివరణ.

ఈ రెండవ వాక్యాన్ని బట్టి ద్విపద కావ్యానికి మన దేశంలో పూర్వకాలంలో పెద్ద మర్యాదలేదని నవీన కాలమున వానిని 'పెద్దగా' మర్యాద చేయుచున్నామని కదా అర్థం. ఇది యెంతవఱకూ సమంజసమో చూడడం అవశ్యకం.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో 'ఐహికాముష్మిక ద్విపద హేతువుగా' ద్విపదను తీర్చిదిద్దిన పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రలలో పండితారాధ్య చరిత్ర ద్విపదను—శ్రీనాథమహాకవి పద్యకావ్యముగా రచించాడన్న సంగతి సాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధమైన విషయం. ద్విపదలోనే రంగనాథ రామాయణం ఉత్తరకాండ సహితంగా వెలసింది. పూర్వయుగంలోనే మడికిసింగన భాగవత దశమ స్కంధము పోతన కన్న ముందుగా ద్విపదలో అనువదించాడు. గౌరన హరిశ్చంద్ర కథ, నవనాథ చరిత్ర (ఇది శేషగిరి పద్య ప్రబంధాన్ని అనుసరించిన ద్విపద) ఆనాటివే. శ్రీనాథుని పల్నాటి వీర చరిత్ర ద్విపద. ఆనాడు ప్రచుర ప్రచారంలో ఉన్నది.

మధ్య యుగంలో ద్విపదకావ్య చక్రవర్తులు తాళ్లపాకవారు వెలిశారు. పెదతిరుమలయ్య హరివంశ ద్విపద దొరకలేదు. ఇక ''దినమునకు వేయి ద్విపదలు తాను చేసిన నియమాల ననుసరించి చిన్నన్న వేంకటేశ్వరునిచేత, మకరకుండలములు'' బహుమతి పొందాడు. ''చిన్నన్న ద్విపద కెఱుఁగును—అనే తెనాలి రామలింగ కవి ప్రశంస అప్పకవీయం మూలంగా అబాలగోపాలమూ ఎఱిగినదే. శైవ కవులలో పిడుపర్తి బసవన, సోమనాథుడు ద్విపద కావ్యాలు వ్రాశారు. ఇంకొక విశేషం—ఈ కాలంలోనే పద్య

కావ్యాలని, ద్విపదలుగా అనువదించుట అనే పథకం ప్రారంభ మైంది. అప్పుడు ద్విపద కావ్యానికే మర్యాద లేకపోతే, ఆ కవులంతా ఆ పద్య కావ్యాలను ద్విపదలుగా చేయవలసిన ఆవశ్యకత యేమో వాఙ్మయ చరిత్రకారులే తెలపాలి.

మహాభారతాన్ని కవిత్రయంవలె, ద్విపదలో ఆతుకూరి తిమ్మన—బాలసరస్వతి సోమన అనువదించారు.⁵ వారు కవిత్రయ పద్యకృతి అనుసరించారు. తెలుగుభాషలో పెద్ద ద్విపద కావ్యాన్ని కట్టా వరదరాజు రచించాడు. ఆతని రామాయణం నాలుగు సంపుటాలలో ప్రకటితమైనది.

దక్షిణ దేశాంధ్ర వాఙ్మయంలో పచ్చకప్పురపు తిరు వెంగళకవి చౌషష్ఠి లీలావిలాసం అని నామాంతరమున్న చొక్క నాథ చరిత్ర ద్విపదలో వ్రాశాడు. "తెనుగున నెఱవాది ద్విపదకు రాజు" అని చెప్పుకొన్న భద్రకవి లింగకవి దేవాంగ పురాణము, పానందోపాఖ్యానము అనే రెండు ద్విపద కావ్యాలు రచించాడు. తంజావూరి రఘునాథ నాయకుడు నలచరిత్ర ద్విపదగా సంత రించాడు.

వేదాంతతత్వజ్ఞురాలు తరిగొండవెంగమాంబ భాగవతము ద్విపదగా రచించినది. ఆరు స్కంధాలు లభ్యమవు తున్నాయి. ఆమె పోతన భాగవతాన్ని అనుసరించింది. తేకుమళ్ల రంగాశాయికవి ద్విపద భాగవతం వ్రాశాడు.

పద్య ప్రబంధాలకీ ద్విపదానువాదాలు వెలువడడమే ద్విపద రచనకు మర్యాద కలదని తెలుపుతుంది. జక్కన విక్రమార్క చరిత్ర కొండయకవి ద్విపదగా అనువదించాడు. (ఇది అము ద్రితం.) చింతలపూడి ఎల్లన ('రాధామాధవ కవి') విష్ణుమాయా నాటకాన్ని, కంకటి నారసింహరాజు (ఉత్తర రామాయణకర్త కంకంటి పాపరాజు సోదరుడు) ద్విపదగా అనువదించాడు. ఇది 1868 లో అచ్చయినది. శబ్దరత్నాకరంలో బహుజనపల్లివారు, ఈ గ్రంథాన్ని ప్రామాణికముగా దీసికొని, ఎన్నో ప్రయో గాలు ఉదాహరించారు. మనుచరిత్రను పూండ్ల వెంకటరమణయ్య గారు ద్విపదలో వ్రాశారు.

ముద్రితమైన వానిలో—దోనూరి కోనేరుకవి బాల భాగ వతము, శ్రీష్టులూరి వేంకటాచార్యుల శ్రీనివాస విలాస సేవధి, చక్రపురి రాఘవకవి నలచరిత్ర, రత్నాకరము గోపాలకృష్ణకవి సౌగంధికప్రసవాపహరణము—ఘట్టుప్రభువు సురాభాండేశ్వరము, చిత్తూరు గంగాధరకవి భల్లాణ చరిత్ర, శేషము చెన్నుభట్టు అభిమన్యు కల్యాణము, పోశెట్టి లింగన్న—నవచోళ చరిత్ర (ఇదిగాక నాలుగు ద్విపదకావ్యా లితను వ్రాశాడు), కూచిమంచి తిమ్మకవి సారంగధర చరిత్ర క్రీ.శ.16—18 శతా బ్దాల మధ్య వెలసినవి. నూఱేండ్ల క్రిందట ఆర్వీటి మాధవ దాసు అనే కవి వైశ్యపురాణము ద్విపదగా వ్రాశాడు. అది 1870 లో అచ్చయినది. అందు పదివేలకు పైగా ద్విపదలున్నవి.

అముద్రితంగా ఉన్నవానిని, పైవానితో చేరిస్తే పూర్వం రెండు వందల ద్విపద కావ్యాలకుపైగా ఉన్నట్లు స్పష్ట మవుతున్నది.

పూర్వ చ్ఛందోగ్రంథాలలో కవిజనాశ్రయం దగ్గఱనుండి అందఱూ ద్విపదకు లక్షణం చెప్పారు. ద్విపదకావ్యాలని (శివకవుల రచనలు) తప్పతక్కిన వానిని లాక్షణికంగా అంగీకరించారు.

ఆంధ్రవాఙ్మయమంతా అనుకరణమూ, అనువాదమూ —అన్న మాటలకు అపవాదంగా, 'స్వతంత్ర రచన లివిగో' అని యెత్తి చూపుటకు పూర్వము వెలసిన బసవపురాణ, పండితా రాధ్య చరిత్రలు చాలును. ఇతరదేశభాషలైన కన్నడ, తమిళ ములలో తొలిసారిగా భాషాంతరీకరణ గౌరవము బడసినవి ద్విపద కావ్యాలే.

పూర్వం ద్విపదకావ్యాని కెంత మర్యాద ఉండేది తెలపడానికి పై వివరణ చాలును.

మున్నూరు కాపత్తుకు ముష్టికోడలు. (పుట. 59)

"ఆ వూరిలో పంట తక్కువ" అని వివరణ.

'మున్నూరు' అనేది వూరిపేరు కాదు—అది ఒక కులం పేరు.

ఇందే 339 వ పుటలో

"మున్నీటి కులానికి ముప్పులేదు—మొండికాలికి చెప్పు లేదు" అనే సామెతక్రింద అర్థ మిట్లు వ్రాయబడియున్నది.

మున్నూటి కాపులు=తెలంగాణాలో ఒక సంసారుల (రెడ్ల) తెగ. (మున్నూటి కూటి కాపులు)

వీ రిప్పుడు సామాన్యులుగా ఉన్నా పూర్వము రాజులతో సమానంగా ఉండేవారు. శాసనాల్లో వీరి ప్రసక్తి వస్తుంది. చరిత్ర చతురాననులు చిలూకూరి వీరభద్రరావుగారి కాకతీయాంధ్ర చరిత్రలో త్రిశతగణమని వీరి చరిత్ర విపులముగా ఉన్నది.

"చీపు లావుకం త్రొక్కినట్లు." (పుట. 63)

చీపు=ముసలివాడు, లావుకం=ఒక పక్షి—దీని వివరణ..

"ఇది ఒక మంచి శకునము. నక్కని త్రొక్కటం, లావుకం త్రొక్కటం ఇది నుడికారం. అవి దారిలో తగలడమని అర్థము. లావుకాన్ని త్రొక్కితే స్త్రీ సంభోగం జరుగుతుందని శాస్త్రం. చీపు లావుకం త్రొక్కడం ఎంత ఆక్షేపణ."

మూలము—170 వ పుటలో 'చీ' క్రింద పై సామెత యిట్లున్నది.

1 చీకులావుకం త్రొక్కినట్టు

పుట యడుగున—1. చీకు=ముసలి 2. లావుకం= స్త్రీ సంభోగ శకునము. మూలములో రెండుచోట్ల 'చీకు' అని స్పష్టముగా అచ్చయి యుండగా మీది వివరణలో మూడుచోట్ల చీపు అని యుండుట దురూహ్యముగా ఉన్నది.

చీకు=ముసలి అని మూలములో అర్థమీయబడుటచేత —'చీపు' కు అదే అర్థము వివరణలో నున్నది. అయితే మొదట

---

5. ఈ ద్విపద భారతాన్ని పూర్తిగా—ఆంధ్ర విశ్వకలా పరిషత్తువారు ప్రకటించి యున్నారు.

చీకు అనే మాటకు గ్రుడ్డితనము, అంధత్వము—అనే అర్థం ప్రసిద్ధముగా నున్నది. పై సామెతలో కూడా 'గ్రుడ్డితనమే' అర్థమని యీ క్రింది పాంశమువల్ల తెలియగలదు.

ఇది నన్నెచోడని కుమారసంభవము నుండి గ్రహింప బడినది.

ఉ. అక్కజమై మహార్థ నివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్
గ్రుక్కిదమైన సత్కృతియ గుర్వగుఁ గా కిల చీకులావుకం
ద్రొక్కిన యట్లు నోరఁ గొలఁదుల్పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కడు నక్కనైన కృతియుం గృతియందురె వానిమెత్తురే."
(1—38)

దీనికి మూలమైన యీ క్రింది కన్నడ పద్యమునుండి 'చీకు' అనగా గ్రుడ్డితనమని స్పష్టపడుతుంది. అందు అంధ లావుక న్యాయమని కలదు.

ఉ. జీయనె బల్లవర్ నెఱయె సత్కృతివేళద పేల్ ఘుణాక్షర
ప్రాయదె శబ్దమొందెరడు మత్తె విచారిసి నోడె కాకతా
ళీయదె వాక్యమొందెరడు కూడెనిఘుర్ని వో "డంధ లావుక
న్యాయదె" భావ మొందెరడు లేసెనె పేళ్దు రదిర్పు దొప్పమే.
(చంద్రప్రభ పురాణము. 1—48).
(మానవల్లివారి ముద్రణ.)

కన్నడమున "కురుడంలావుగెయం మెట్టి దంతె" అని కూడా కలదు. ఇది ఘుణాక్షర కాకతాళీయ న్యాయాల వంటిది.

ఇక పీఠికలు విడిచి గ్రంథంలో ప్రవేశిస్తాను. ఇందులో ఉన్న ప్రతి సామెతను గూర్చి ఇంతో అంతో చెప్పవలసినది ఉన్నా ఒక్క—'అ' కారం క్రింద యిచ్చిన వానిని కొన్ని విమర్శిస్తున్నాను.

అ.

1. అంగడిమీద చేతులు అత్తమీద కన్ను.

ఈ సామెత మొదటిరూపం—

"అత్తలలో చేతులు అంగట్లో కన్నులు." ఇది ఎల్లన విష్ణుమాయానాటకంలో కనిపిస్తుంది.

అత్తకు ఎప్పుడూ కోడలికి చేతులనిండా పనులు చెప్ప డానికే తల పని చేస్తుంది. కోమటికి కన్ను లెప్పుడూ అన్ని వస్తువులమీద ఉంటాయి. అయితే రాధికాసాంత్వనంలో ముద్దుపళని ఈ సామెతను ఎంతో చమత్కారంగా వ్యత్యస్తం చేసి వాడింది.

ఆ. వె. నందసుతుఁడు మున్ను నామీది ప్రేమచే
నొకటి చేయబోయి యొకటి సేసె
అత్తమీది కన్ను అంగడిపై చేతు
లాయె నుసురుఁ జెలియ లరసి నవ్వ. (3—28.)

పై పద్యంలో మార్పు అంగట్లో ఉండవలసిన కన్నులు అత్తమీద ఉన్నవని చెప్పడమే. ఇది రాధవాక్యం. 'శ్రీకృష్ణుడొక్కటి చేయడానికి మఱియొకటి చేశాడని' అనగా—తనమీద కన్ను ఇలాదేవిపై త్రిప్పినాడని చెప్పుట. సామెత మార్పునకు నవ్వు.

2. అంటాముట్టరాని అగ్రహారం—

ఈ సామెత యిందులో లేదు.

అగ్రహారము, రాజులు బ్రాహ్మణులకు ధారాదత్తము చేసిన భూమి. రాజులు భూపతులు—అనగా భూమికి భర్తలు. అయితే, ఈ బ్రాహ్మణులకు దానము చేసిన అగ్రహార భూమి మాత్రము వారికి చెల్లెలు వావి.

"ఏకైవ భగినీ లోకే సర్వేషా మపి భూభుజామ్—
నభోగ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా"

విప్రదత్తమైన వసుంధర ఒక్కటే రాజునకు భగిని—చెల్లెలు; ఆ భూమికి కర—పన్ను లేదు. అని ఒక అర్థం. అకర గ్రాహ్యం—చెయి ముట్టడానికి వీలులేదని మఱియొక అర్థం. నభోగ్యా—రాజులకు భుక్తము కానిది,అనుభవించడానికి వీలులేనిది, అంటరానిది—అని మఱియొక అర్థం.

ఇది నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రులుగారు చెప్పినది.

3. "అందఱూ ఒకయెత్తు, అగస్త్యుడు ఒక యెత్తు"

నక్షత్రమండలంలో అన్ని నక్షత్రాల కన్నా అగస్త్య నక్షత్రంపెద్దది. ఈ సామెత జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించినది.

4. ("అందఱూ నవ్వినట్లే నేనూ నవ్వితే నాపై బడెనమ్మా నాలుగు సుస్కానీలు దండుగ."

ఇచట—సుస్కానీ=దమ్మిడీ కన్న చిన్న నాణెము అని అర్థము కలదు. (పుట. 4. క్రింద)

నిఘంటువులో 'సురకాని' ఉన్నది కాని 'సుస్కానీ' లేదు.
సురకాని—కానిలో నాల్గవ భాగము.
సురకాని యెత్తు చేసిన
పరిణతిమై మేరు కుధరభారము బాపున్—
పాండురంగమాహాత్మ్యము—4 ఆ

కానిలో రెండవ భాగము 'అరకాని'—నాల్గవ భాగము సురకాని. )

5. "అందానికి కోతిపిల్ల మా అవరపిల్ల."

"అందమున క్రోఁతిపిల్ల యీ యఱవపిల్ల."సరియైన రూపం.

6. "అకటా వికటపు రాజుకు అవివేకప్రధాని చాదస్తపు పరివారము."

అకటా వికటపురాజు—అవ్యక్త ప్రధాని—తన ఒళ్లు తా నెఱుగని బంటూ—తలతిక్క ప్రజలు—అని పూర్తి సామెత.

7. అక్కలు లేచెవఱకు నక్కలు కూస్తాయి.

(లేచేవఱకు—అని ఉండాలి.) ఇది తెలుగు బ్రాహ్మణ కుటుంబాలలో ప్రసిద్ధమైన కామేశ్వరి కొలువునకు సంబంధించిన సామెత.

క్రీడాభిరామ పీఠికలో కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రులు గారి కామేశ్వరి కొలువును గూర్చి, ఆ కథను గూర్చి 96 నుండి

103 వ పుట వఱకు విస్తరించారు. అందుండి పై సామెతకు సంబంధించిన భాగ ముదాహరిస్తున్నాను.

"ఏకవీరగుడి గడవగానే కామవల్లీమహాలక్ష్మివలపును బాడుచు నొక జక్కులపురంధ్రి గానవచ్చెను. తత్కథాది వర్ణనము కొంత గలదు. ఇందుఁ గొంత విస్తరించి చెప్పవలసిన విషయ మున్నది. కామవల్లీమహాలక్ష్మికే కామేశ్వరి యని నామాంతరము. ఏడ్గు రక్కలలోఁ గడగొట్టదైనను కామవల్లీమహాలక్ష్మి ముఖ్యురాలు గావున నామెపేరు ప్రధానముగాఁ బేర్కొనబడుచున్నది. తక్కిన యార్వురకును వేర్వేఱు పేరులు గలవు. మొత్తమున వారి కెల్లరకును 'అక్క'లని పేరు. నేటికిఁ గూడ సర్వాంధ్ర దేశమునను బ్రాహ్మణాది వర్ణములవారి కీ కామేశ్వరి (అక్కలు) ఇలువేల్పు. ఈ దేవి యిలువేల్పుగా గల యిండ్లలో వివాహాది శుభకార్యములు జరిగినతోడనే యక్కల కొల్పును జరుగును. ఆనాఁడేఘురు ముత్తయిదువుల కర్చన జరుగును. ఆంగ్లేయుల యుద్ధ గీతములవలె యుద్రేకజనకమైన గాన ఫణితిని 'కామేశ్వరి పాట' వీర వాద్యములతో నానాడు పాడుదురు. ఆపాట తీవరములో స్త్రీలకు కొందఱకు సివమెత్తును. ఆ యర్చనము జరుగువాడెంత తొందరించినను భోజనములగుటకు సూర్యాస్తమయ మగును.

"అక్కలు లేచేటప్పటికి నక్కలు కూస్తాయి"అని నానుడి."

8. అగసాలి పొందు—వెలమల చెలిమి నమ్మరాదు.

ఇది సుమతి శతకములోనిది.

వెలయాలి సేయు బాసలు
వెలయఁగ నగసాలి పొందు వెలమ చెలిమియున్
గలలోనఁ గన్న కలిమియు
విలసితముగ నమ్మరాదు వినరా సుమతీ. 97 ప.

9. "అగ్గికి పోయినమ్మ ఆరునెలలు గర్భమై వచ్చినట్లు."

ఇదే.—అగ్నిహోత్రమునకు పోయిన—సోమిదేవమ్మ ఆరు నెలల గర్భముతో వచ్చినది—అని పూర్వముద్రణ పాఠము.

ఈ సామెత చూడగానే ఈ క్రింది పద్యం జ్ఞప్తికి వస్తుంది.

"ఇంగలమంచువచ్చి యడియేనని కొత్తమసాని మ్రొక్కఁగా కొంగు బిరాల్న బట్టి తిరుకొంగటు దీసి జలారి చెంతనే వంగఁగఁ బెట్టి . . . . . . . . .
. . . . . . మణితెట్టెనుగా శఠగోపజియ్యరూ."

10. అగ్గిలో ఆజ్యం పోసినట్టు.

అగ్నిలో నే వోసినమాడ్కి. కు. సం. (2—177)

11. "అగ్రహారంలో తమ్మళిజోస్యం."

ఎమ్మెలు నా ముందఱనా
యమ్మక్కరో ! చెల్ల నగ్రహారములోనన్
తమ్మళి జోస్యము లన్న వి
ధమ్మిది నీ వలన నాకుఁ దథ్యమ్మయ్యెన్.

రుక్మాం. 5—88.

'తమ్మళి' అనే రూపము ప్రాస స్థానములోఁ ఉన్నా 'తంబళి' అని వ్యవహారములో నున్నది.

నంబి కవిత్వంబు తంబళ జోస్యంబు· —వేణు. శ.

12. "అచ్చమైన సంసారి ఉచ్చబోసి ఇల్లలికిందట."

ఈ సామెతకు కొల్లేరు దగ్గమైన కథకు సంబంధముంది.

13. అటునుంచి నరుక్కు రమన్నారు.

మహా ప్రసిద్ధులైన వాసిరెడ్డి వేంకటాద్రినాయఁనివారి పాలనలో ఒకప్పుడు దారిదోపుడఁగాంద్రు విశేషంగా ప్రజలకు హాని కలిగిస్తూండేవారు. వేంకటాద్రినాయఁడుగారు మహావీరుడు కావడంచేత, వారి నందఱినీ పట్టుకొని, ముందెన్నడూ వారి బాధ కలుగకుండా, దొరికిన దొంగల నందఱిని (నూఱు మందిని) వరుసగా నిలబెట్టి తలలు నరకుట కారంభించేరు. ఒక కొన నుండి నరకుట కారంభించినతోడనే తరువాతివాండ్రు అటునుంచి 'అంటే' అవతల కొన నుంచి నరుక్కురమ్మన్నారట. ఆ రీతిగా కొందఱిని నఱికిన తర్వాత అయినా, నాయని వారికి జాలిపుట్టి తక్కిన వారిని విడచిపెడతారని వా రూహించారు. కాని నాయనివారు శత్రుశేషం ఉందరాదని— రెండవకొన నుండి ఆరంభించి, వారినందఱను నిశ్శేషంగా సంహరించి, ప్రజలకు— దొంగభయం లేకుండా చేశారు. వారినాటినుంచి ఈ సామెత వ్యాప్తమైనది— ఈయనకు సంబంధించినది "వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు తులాభారం తూగితే—కరెడ్ల కామక్క వంకాయల భారం తూగిందట" అన్న సామెత—378 వ పుటలో ఉన్నది.

14. అటయితే కందిపప్పు, ఇటయితే పెసరపప్పు.

శుభమైతే కందిపప్పు—అశుభమైతే పెసరపప్పు.

15. అడవి ఉసిరికాయుకు సముద్రపు ఉప్పు కలిసినట్లు.

సంస్కృతములో లవణామలకీయన్యాయము.

"అడవి యామలకము నంబుధి లవణంబు
గూడినట్టు లయ్యె నేడు చూడ. —కుచే. 2—78.

16. అడుకులు తింటె ఆయెనా ! కడుపులో కుట్టెత్తినప్పుడు గదా.

మొదట సుఖంగా ఉండి, తరువాత సంకటపడడం—

"అడుకులు తిన్నట్లగునే
కడుపునఁ గుట్టెత్తినపుడు కడుఁ బఱచితి నాఁ

---

6. క్రీడాభిరామము—తృతీయ ముద్రణం 1952.

డొడ లెఱుఁగక పాండు సుతుల
నుడిగి మడుగవలసె నిప్పు డొక సాత్యకిచేన్."
భార. ద్రోణ. 4—89.

17. అడుగు తప్పితే పిడుగు తప్పుతుంది.

కొంచెము జాగరూకత వహిస్తే కొండంత ప్రమాదం తప్పుకోవచ్చును.

అప్పు డాదారి గడతేఱ నగు ప్రయత్న
మెట్లు చింతింపవలయు రాకేందువదన
అడుగుఁ దప్పినచోఁ దప్పు పిడుగటంచు
నొడువమును వినదువే గద పుడమిలోన.
—శుక. 1—319 ప.

18. అడుగు దాటితే అక్కఱ దాటుతుంది.

తనపని తీరగానే తరలి పోవడం.

. . . . . శీఘ్రము
పఱతెంచె ననుట యడుగు వాసినచో న
క్కఱ వాయుననుట నిజమని
యెఱుఁగరుగా . . . . —శుక. 3—146.

19. అడుసు ద్రొక్కనేల కాలు కడుగునేల.

చిన్నయసూరి. నీతిచంద్రిక. మిత్రలాభము.

20. ఆత్తా నీ కొంగు తొలగిందన్నా తప్పే—లేదన్నా తప్పే—

ఏ మనడానికి వీలులేనప్పు డనేమాట.

నక్క యురులలోనఁ జిక్కుకొన్న వితాన
గోరి మనము చేసికొన్న పనికిఁ
బేగులోని తీట వితమాయె ననరాదు
అత్త కోక తొలఁగినటులఁ బలుక.—రాధికా (3–48)

21. అదిగో పసుపు—ఇదిగో ముసుగు.

ఈ సామెతను విశదపఱచే కథ వేటూరివారి "మూన్నాళ్ల ముచ్చట" లో ఉన్నది.

22. అద్దంమీద పెసరగింజ పడ్డట్టు.

ఆలా మగని పందు పోట్లాట అద్దముమీద పెసరగింజ వేసినంతసేపు. అని పూర్వ ముద్రణ.

స్వల్పాతి స్వల్పకాలం. అద్దముమీద గుండ్రని వస్తువు నిలువనే నిలువదు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర—పురాతన ప్రకరణమున నీ సామెత నిట్లు వాడియున్నాడు మల్హణుని కథ.

"సద్భక్తిపరుఁడవు సత్కవీశ్వరుఁ డ
వద్భుత కవితా సమగ్రత మెఱసి
పై చని యద్దంబుపై మిన్నగింజ
వైచిన బడు నెంత వడినంత మాత్ర
యిద్ధ సమాధి భూయిష్ఠతఁ దగిలి
శుద్ధత నేకాగ్ర సుఖ మనోవృత్తి
హొరుఁ బ్రశంసింపుమా వరదు డయ్యెడిని."
—పుట. 366.

ఇట 'పెసరగింజ'కు 'మినపగింజ' కలదు. ఇది ప్రాచీనము.

23. అద్దంలో నీడకాశ పడినట్లు—

అలభ్య వస్తువు కాశించడము.

అద్దములోని నీడ కెటు లాసపడం బొసగున్ తలోదరీ.
—ఉ. హరి. 5—157.

24. అనుములు తిన్నతరువాత అపాన వాయువులకు వెరిస్తే ఎట్లా?

దీనికి కళింగ ప్రాంతంలో ఇలా ఉన్నది.

"అనపచేను ఆమడ దూరాన్న ఉండగా బట్టి[7] పిత్తులు బారెడేసి."

25. 'అనువుగానిచోట నధికుల మనరాదు'—

అనువుగాని చోట నధికుల మనరాదు
కొంచె ముండుటెల్ల గొప్పగాదు —వేమన.

26. అన్నం లేకపోతే పట్టుబట్ట.

ఈ సామెత పూర్తిగా వేసిన గాని అర్థముగాదు.

"అన్నం లేకపోతే వరి అన్నం—బట్ట లేకపోతే పట్టుబట్ట."
(పూర్వ ముద్రణ)

"బట్ట లేకపోతే పట్టుబట్ట" అని యీ సామెతను గూర్చి పీఠిక—61 వ పుటలో వ్రాయబడి యున్నది. అయితే మూల ములో "బట్ట లేకపోతే" అనే మాట లేదు.

27. "అన్నాలన్నీ సున్నాలు — అప్పాలన్నీ కప్పలు."

ఇది పూర్వ ముద్రణలో ఉన్నది.
దీనితో మరో సామెత కూడా వ్యాప్తిలో ఉన్నది.
"అన్నమంతా సున్న మవాలి, అప్పాలన్నీ కప్ప లవాలి
అయ్యలంతా కొయ్య లవాలి, అమ్మలందఱూ బొమ్మ
లవాలి."

ఇది తెలుగు కవులలో ఉద్దండుడైన వేములవాడ భీమకవి చరిత్రకు సంబంధించినది.

దాక్షారామంలో వేములవాడ భీమకవి రండ కొడుకైన కారణంచేత, ఆతని వెలివేశారు. ఒకనాడు ఒక బ్రాహ్మణుని ఇంట్లో సమారాధన జరుగుతూన్నది. భీమకవిని పిలువలేదు. ఆతడు తన మాహాత్మ్యాన్ని చూపించడానికి, గడియవేసిన ద్వారము వద్ద కూర్చొని—"అన్నమంతా సున్నం కావాలి, అప్పా లన్నీ కప్పలు కావాలి" అంటూ పాడడం మొదలెట్టాడు. అంతతో అన్ని విస్తరాకుల్లో అట్లే మారినవి. ఇంటాయన

7. సామెతలలో సభ్యాసభ్యతలు సడలించవలసిన ఆవశ్యకత ఉన్నది.

వెంటవే వచ్చి ఆతని క్షమార్పణ వేడుకొన్నాడు. భీమకవి అనుగ్రహంచేత అన్నీ పూర్వ రీతిగా మారేయి.

28. అన్ని రుచులు సరేకాని అందులో ఉప్పులేదు.

పూర్వం ఒకాయన అందంగా ఉన్న అబ్బాయికి తన కూతురినిచ్చి పెండ్లిచేశాడు. ఆమెకు చిన్నప్పటినుంచి చదువునం దాసక్తి. అందుచేత ఇంటివద్ద తెలుగు, సంస్కృతము అభ్యసించి పెద్దమనిషయ్యేసరికి, పెద్ద విద్వాంసురాలైంది. శోభనపు గదిలో భర్త చదువులేనివాడని తెలియడం చేత, అతణ్ణి చూచి "అన్నీ బాగావే ఉన్నాయి కాని అందానికి తగిన చదువు లేకపోవడంచేత మోదుగుపువ్వులాగ రాణించడం లే"దని సగర్వంగా ఆక్షేపించింది. ఆ యెత్తిపొడుపు మాటలు గ్రహించి, ఆ అర్థరాత్రి ఎవ్వరితో చెప్పకుండా లేచి కాశీ వెళ్లిపోయాడు. మర్నాడు ఎంత వెతకినా అల్లుడు కనిపించక పోవడంచేత, అత్తమామలు కంగారు పడ్డారు. కూతురు మాత్రం తను చేసిన పని దాచిపెట్టింది. ఇట్లా ఏళ్లు పూళ్లు గడిచాయి. పన్నెండేళ్లవఱకూ చూచి అల్లుడి అయిపు లేక పోవడంచేత, అతనికి యథావిధిగా కర్మ చేసి కూతురిని వితంతువుచేసి యింట్లో కూర్చోబెట్టేరు.

కాశీ వెళ్లిన అల్లుడు అఖండ పండితుడై తన అత్తవారి పూరు వచ్చాడు. అంతకుముందే అతని పేరు ప్రఖ్యాతి ఆ వూరివారందఱికీ పరిచితమైంది. అతడు తన భార్యకు జరిగిన శాస్తిని తెలుసుకొన్నాడు.

ఇంతట్లో. ఇంత గొప్పపండితుడు వచ్చాడని మావగా రాతని తన యింటికి ఆహ్వానించాడు. అందఱూ భోజనానికి కూర్చున్నారు. మామకు, వచ్చినవాడు తన అల్లుడే అని తెలియదు. కూతురు వడ్డన చేయడం ప్రారంభించింది. పండితుడు భోజనంచేస్తూ ఆ అమ్మాయిని ఎలాగ ఎత్తి పొడవడం అని చూస్తున్నాడు. అన్నీ పదార్థాలలోను రుచులు బాగావే ఉన్నాయి. లోపంలేదు. ఇంతలో ఆమె చారు వడ్డించింది. చారులో ఉప్పు వెయ్యడం మఱచిపోయింది. అదను చిక్కిందని వెంటనే ఆ పండితుడు ఒక శ్లోకం చదివి ఆక్షేపించాడు. దాని అర్థం ఏమంటే "ఇంగువ జీలకఱ్ర వేయడంచేత అన్నీ రుచులు బాగా ఉన్నా—అందులో—అనగా చారులో ఉప్పు లేక పోవడంచేత మోదుగుపువ్వులాగ శోభించడంలేదు." అని. ఈమాట వినగానే తక్షణం గిరుక్కున తిరిగి వంటింట్లోకి వెళ్లి ఏడ్చింది. అందఱూ జరిగిన సంగతి గ్రహించారు. అల్లుడని తెలుసుకొని ఆనంద పడ్డారు.[8]

29. అన్యాయపు వూరిలో ఆలూ మొగుడికే రంకు.

అన్యాయపు వూరిలో ఆలూ మొగుడికి రంకు—అని పూర్వ ముద్రణ.

రంగావధూత రచించిన "అన్యాయ పట్టణ కథలు" అనే పుస్తకంలో ఈ సామెతకు సంబంధించిన కథ ఉన్నది. ఇది చాలా కాలం క్రిందట అచ్చుపడ్డది.

30. అమ్మను పట్టుకొని వసంతా లాడినట్లు.

ఈ సామెత 29 వ పుటలో—'అవ్వను పట్టుకొని వసంతా లాడినట్లు' అని యున్నది. కాని 'అమ్మను పట్టుకొని' అనునదే నిర్ధారకముగా ఈ క్రింది ప్రయోగంలో కనిపిస్తున్నది.

"కమ్మని తేనెలు జడిగొన
నమ్ముల నిటు నింతురయ్య యబ్జాలయపై
అమ్మను బట్టి వసంతము
జిమ్ముద మను పలుకు నిజము చేసి మనోజా.
—లక్ష్మీవిలాసము 4—68.

31. అరగడియ భోగం—ఆరు నెలలు రోగం.

ఇదీ 92 వ పుటలో ఇచ్చిన—

ఒకనాటి సుఖం—ఒక ఏటి కష్టం—అనే సామెత సమానార్థము గలవి.

ఇదే ఒకనాటి సుఖం—ఒక యేటి దుఃఖం—అన్న రీతిగా యీ క్రింది పద్యంలో కనిపిస్తుంది.

ఉలిమిరి చెక్కయున్ మిగుల
సుక్కయుఁ జప్పని రొట్టెముక్కయున్
మలినపు గుడ్డలున్ దలకు
మాసిన ముండలు చీకటింటిలోన్
దలచిన రోతవచ్చు నొక
నాటి సుఖం బొకయేటి దుఃఖ మా
పలివెల వారకాంతల....కున్
పదివేల దండముల్.

32. అరచేత వెన్న పెట్టుకొని నేతి కేడ్చినట్లు.

దీనికీ క్రింది కవి ప్రయోగ మున్నది.

"కమలమిత్రుడు భద్రకవిలింగవిభుడు
నెఱయ నాతనికం టె నేర్పరి గలడె ?
నెఱివెన్న చేబట్టి నెయ్యేల వెదుక."
ద్విపద పానందచరిత్ర—అవతారిక—

33. అరచేతిలో ఉసిరికాయ వలె.

అరచేతిలోని యుసిరిక
సరణిని గనుపట్టు నన్ను సంపగిమన్నా !
పరమానందయతి. సంపగిమన్న శతకము. ప. 7.

ఇది 'అరచేతి నిమ్మపండువలె' అని ప్రయుక్తమై యున్నది.

. . . . . విభుం
డరచేలోపలి నిమ్మపండువలె సత్యాసక్తి మన్నింప.
సారంగ. 2—111.

34. అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలు,—

అంకమ్మ అనేది 'మహాంకాళి'శబ్దానికి అపభ్రంశరూపము.

---

8. భారతి. జూన్ 1932. పూర్వము 'భారతి' లో "పిట్ట కథలు" అని ప్రకటింపబడినవానిలో సామెతలకు సంబంధించి కథ లున్నవి. పై కథ అందునుండి గ్రహించినదే.

మహాంకాళమ్మ, అంకాళమ్మ, అంకాలమ్మ, అంకమ్మ, అని రూపాంతరాలు. అక్కలమ్మ, అక్కమ్మ—అనే రూపాలు మహా కాళి శబ్దానికి సంబంధించినవే.

మహాకాళి పూజ అర్ధరాత్రమందే జరుగును. అంకమ్మ, అక్కమ్మ అయినట్లే అంకయ్య, అక్కయ్య అయినాడు.

35. అవ్వపేరే ముసలమ్మ.

నన్నయ కాలమున 'అవ్వ' యనునది వయసుగల స్త్రీలకే వర్తించేది. తరువాతి కాలమున 'అవ్వ' యనగా ముసలిది అని రూఢి అయినది. నన్నయయే ఈ విషయాన్ని యీ క్రింది ప్రయోగం మూలంగా స్పష్టపరచాడు.

"అబ్బాలకు రోదన ధ్వని విని యంతిపురమున నున్న "ముదు పలి యవ్వలెల్లన్" (సభా. 1—149).

"అవ్వను పట్టుకొని వసంతా లాడినట్లు"— అన్న సామెతకు (29 వ పుట) "ముసలాపె (ముసలి ఆపె)తో వసంతా లాడినట్లు" అన్న సామెత ఈ గ్రంథమందే 341 పుటలో ఉన్నది. ప్రాచీన కన్నడమున—అవ్వ పదము, విశేష ప్రచారమున నున్నట్లు బసవపురాణ పండితారాధ్య చరిత్రలవలన తెలియవచ్చుచున్నది.

36. అసిమిలో దొకటి అమ్మేదొకటి.

"అసిమిలోని దొకటి యమ్మెడి దొక్కటి
నీ చరిత్ర మాకు నేడు తెలియ
వచ్చె . . . . . . . .  (హరి. 2—151)
ద్వి. అమ్మెడు దొకటియు నసిమిలో దొకటి
ఆడు మాటలు పరమార్థ సార్థములు
ప్రభులింగలీల-14 వ గతి.

"అసిమిలోని దొకటి యమ్మెడి దొక్కటి"
చెన్నబసవపురాణము 4—55.

37. అస్సిలేదు గస్సిలేదు చచ్చినట్టు తొంగోసి

అస్సిలేదు గస్సిలేదు—పల్లకుండ తొంగో" అని ఇంకో రీతిగా యీ సామెత ఉన్నది. అర్థ మొక్కటే.

ఇది కాళిదాసును గూర్చి వాడుకలో ఉన్న కథకు సంబంధించినది. 'అస్సి'— అనగా అస్తి. 'గస్సి' అనగా కశ్చిత్—ఇక వినండి.

ఒక రాజకుమార్తె చాలా చక్కనిది. అంతకంటె చక్కగా చదువుకొన్నది. రాజ పురోహితు డామెను మోహించాడు. కాని ఆమె తిరస్కరించింది. పురోహితు డామెకు తగిన శాస్తి చెయ్యాలని—వివాహ సందర్భంలో రాజుగారికి మూర్ఖుడైన పసుల కాపరిని విద్వాంసుడని నమ్మించి, ఆమెకు పెండ్లి చేయించాడు. శోభనపు గదిలో గురకలుపెట్టి భర్త నిద్రపోవడం చూచి, ఆతనిలేపి "అస్తి కశ్చి ద్వాగ్విశేషః" అని ఆమె ప్రశ్నించింది. పసుల కాపరి కాబట్టి వెంటనే అస్సిలేదూ గస్సిలేదు. పల్లకుండా తొంగో—అని అన్నాడు. ఆమె జరిగిన సంగతి వెంటనే గ్రహించి అతనితో నీకు చదువు రాకపోయినా నే చెప్పినట్టుచేస్తే వస్తుంది అన్నది. ఏమి చెయ్యాలి అని తిరిగి ప్రశ్నించేడు.ఈ అర్ధ రాత్రిని నీవు కాళికాదేవి ఆలయానికివెళ్ళి, ఆ గుడిలో కూర్చుని తలుపులు గడియబెట్టు. కాళి వచ్చినా తలుపులు తీయకు. ఆమె నీవు కోరినదిస్తానని చెప్పినప్పుడు తియ్యవచ్చును అన్నది. ఆతడాలాగే గుడిలో కూర్చుండగా కాళి వచ్చింది. తలుపులు తీయమన్నది. ఆతడు తెరవలేదు. నీకు కావలసినదేమి అని అడిగింది. విద్య కావాలన్నాడు. అది యిస్తే నేతెరుస్తా నన్నాడు. సరే, తలుపు సందులోనుంచి నాలిక చాపమన్నది. నాలిక చాపేడు. ఆమె బీజాక్షరాలు నాలికపై వ్రాసింది. వెంటనే తలుపులు తెరచి మహోత్సాలంగా—"జయమాతంగ తనయే" అని ప్రారంభించి శ్యామలా దండకం చెప్పాడు. అప్పటినుండి 'కాళిదాసు' అయినాడు. తన భార్య ఆనాడు అన్నమాట శాశ్వతంగా ఉండిపోయేటట్లు ఆ వాక్యాక్షరాల క్రమాన్ని కావ్యాలు వ్రాశాడు.

అస్తి:—అస్త్యుత్తరస్యాందిశిదేవతాత్మా
హిమాలయోనామ — నగాధిరాజః—కుమార సంభవము.
కశ్చిత్:—కశ్చిత్కాంతావిరహగురుణా స్వాధికారాత్ ప్రమత్తః
—మేఘసందేశం
వాగ్విశేషః—వాగార్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
—రఘువంశము

అకారం క్రింద యిచ్చిన ఆరోపాలలో విమర్శనీయాలు కొన్ని:—

అయ్యవారటకంత అయ్యవారి పెండ్లాం పుటికంత. పుట 23.

పూర్వ ముద్రణలలో పై సామెత ఈ రీతిగా ఉన్నది.
"అయ్యవా రయ్యవారు అటికంత
అయ్యవారి పెండ్లాము పుటికంత
పుటిక తీసుకొనిపోయి మూలయింట్లోపెట్టితే
నక్క యెత్తుకొనిపోయింది నారాయణా(1869 ము.)

అయ్యవారయ్యవారటికంత
అయ్యవారి పెళ్ళాం పుటికంత
పుటిక తీసుకొనిపోయి మూలపెడితే
నక్క ఎత్తుకొనిపోయె నారాయణా (1960 ము)

"అయ్య సవాశేరు—లింగం అరవీసెడు" పుట24

ఇటువంటిదే 409 వ పుటలో—
"శెట్టి సేరు—బుడ్డ సవాసేరు" అన్నది.
'సెట్టిసేరు లింగం పదిశేర్లు' అని (1960. ము.) వాడుకలోకూడా యిదే సామెత.

దీన్ని అన్వర్థంగా ఉపయోగించినవారు—సెట్టి లక్ష్మీ నరసింహంగారు (సెట్టి మాష్టరుగారు). రసికులైన మహాకవులు.

ఆయన చెన్నపురి రాజధాని కళాశాలలో కందుకూరి వీరేశలింగం గారివద్ద తెలుగుచదువుకున్నారు. తన చిత్ర

హారిశ్చంద్రీయ నాటకంలో నాంది ప్రస్తావనలో గురువుగారైన వీరేశలింగం గారిని యిల్లా స్తుతించారు.

"ప్రోడు ప్రాకులు మొలకెత్తు పోల్కి కావ్య
ములు రచించుటయే గాక, బోడితలలు
మరల మొలకెత్త చేసిన మాన్యుడెవడు
కందుకూరి వీరేశలింగం బతండు.

ఇలా గురుస్తుతి చేయడం భావ్యమా అని నటి అడుగుతుంది. వెంటనే

సూత్రధారుడు—అబ్బో! ఆయ నెక్కడ నే నెక్కడ?
"సెట్టి సేరు, లింగం పది శేర్లు"—అని జవాబిచ్చేడు.

అల్లుని మంచితనం గొల్లమీద సాహిత్య విద్య లేదు. పుట 28.

ఈ సామెత లేదు.

అల్లుని మంచితనంబును
గొల్లని సాహిత్య విద్య కోమలి నిజమున్
బొల్లున దంచిన బియ్యము
తెల్లని కాకులును లేవు తెలియర సుమతీ. 8 వ.

అల్లుని మంచితనంబును గొల్లని రసికతయు లేవు. (3—34)

ఈ పద్యంలో మూడో పాదంలో ఉన్న పొల్లున దంచిన బియ్యము—అనేది 293 వ పుటలో 'పొల్లుదంచి బియ్యం చేసినట్లు—' అ—'పొ' క్రింద నున్నది.

అలిగి తంతే పఱుపుపై పడ్డట్లు—పుట 27.

అని సామెత—

దీన్ని మొదట పాల్కురికి సోమనాథుడు ప్రయోగించాడు.

ద్వి. నెఱి నల్గి తన్నిన పఱుపుపైఁబడిన
తెఱఁగు నా కయ్యెనో దేవ సోమేశ
పండితారాధ్య చరిత్ర—387. పు.

నాచన సోముడు— ఈ రీతిగానే వాడాడు.

క. వెఱవకు కంతుఁ జేసిన
కొఱగామికి వగచు చోట గుణరత్నము చే
కుఱెఁ నీకు నలిగి తన్నిన
పఱుపుపయిం బడినయట్లు పద్మదళాక్షీ.
ఉ. హరి. 5—153.

ఇది 'అ' క్రింద లేకపోయినా—'త' క్రింద—190 వ పుటలో

"తంతే దూది పరుపుమీద పడ్డట్లు" అని యీాయ బడింది. పై ప్రయోగాలను బట్టి—'అ' క్రింద ఉండాలి.

అతికాలిపుంట నెత్తి నెత్కి కెక్కడం—పుట 26.

ఇది లేదు.

చ. . . . . . .రోషనము జ్వలితాక్షుఁడౌటఁ జి
దిన యతికాలి పుంట నడు నెత్తికి నెక్కి ఝటా
ఝటంబునన్ దశా. 7 ఆ.

'అ' క్రింద పూర్వ ముద్రణ (1869) లో కొన్ని మార్పులతో ఉన్నాయి. కొన్ని లేవు.

అటయితే వైద్య కట్నం—ఇట్లైతే వైతరణీ గోదానం
అడ్డ గోడమీద పిల్లి.
అడ్డా గోడా మీద అదీ రోటీ ఉండాది అతడూ వస్తే ఖావు కనా.
ముంగిట్లో యేమో మూలుగుతూ ఉండాది
మూలా వున్నా మునగా క్రరా లావు కనా.
అది కుమ్ము, ఇది దుమ్ము, పదరా పందిట్లోకి.
అధికాషాడం—
అయితే ఆతడి ఆలాయె కాకపోతే దాసురాలాయె.
అల్లుల్లో మల్లు పెద్ద.

ఇంకా కుమార సంభవము, బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర—మొదలగు వానిలోనూ, ఇతర కావ్యాలనుండి 'అ' క్రింద చేర్చవలసినవి చాలా ఉన్నవి.

తక్కిన సామెతలలో కొన్నింటిని గూర్చి మాత్రమే వివరిస్తాను.

ఆకాశంలో చిత్రం వ్రాయడం పుట 32.

అసాధ్యకార్యం—

రేపగలు జేయు—నాకసమున—జిత్ర రూపములు వ్రాయు పండి 1.359 పుట.

ఇదిలేదు.

ఆకాశానికి వెంట్రుక ముడివేసినట్లు

ఈ సామెతకు ప్రతిగా విజయనగర ప్రాంతంలో ఒక సామెత ఉంది. "వెలగాడ కొండకి వెంట్రుకకీ ముడి వేశాను. వస్తే వెలగాడ వస్తుంది. పోతే వెంట్రుక పోతుంది". వెలగాడ విజయనగరం దగ్గఱ కొండ.

ఆపద మొక్కులు సంపద మఱపులు పుట 37.

ఆపతి మొక్కులు, సంపతి కుంట్లు—పూర్వ ముద్రణ పాఠము. ఇదియే సరియైనది.

ఆపత్తికి 'ఆపతి' సంపత్తికి 'సంపతి' వైకృతములు.

పోతన భాగవతమున (12—27) జీవుదాపతఁలనుఁ గుంది—అని 'ఆపతి' శబ్దమును వాడాడు. 'ఆపతి' మొక్కులవాడు ఏడుకొండలవాడు ఆతడే 'సంపతి' పువ్వుబోడిపతి—సంపతి పువ్వుబోడి' రామాభ్యుదయము పీఠిక 17.

(చూ. అకాడమీవారి భాగవతము—ప్రథమ సంపుటము. పీఠిక—170 పుట.—154. శిరి క—ఆపదలను.)

**ఆఱుమూడగు—** పుట 40.

కార్యము చెడు—

'ఆఱు మూడగు వ్యవహారంలో ఆర్మడి' అయినది—**ఆఱు** మూడైనది—అనే

**ఆఱు మూడైనా మూడు ఆఱైనా కాకతప్పదు.**

ఈ రెండింటికీ సంబంధముంది—ఇది **తెలు** గంకెలతో **తెలిసికోవలసినది.**

తెలుగులో మూడు అంకె 3—ఆరు అంకె ౬ **అవి** రెండూ ఒక్కలాగే ఉంటాయి—అవి తిరగవేస్తే యిట్లా ఉంటవి.

3...ఆరు— 3 మూడు—3 తిరగవేస్తే ౬. ఆఱు మూడయిందంటే—కార్యం చెడింది—మూడాఱైందంటే అదే అర్థం. ఎంత కష్టమైనా, ఎన్ని అడ్డంకులు వచ్చినా కార్యంసాధించే మనోనిశ్చయాన్ని యీ సామెత తెలుపుతుంది.

**ఆవములో రాగిముంత.** పుట 42.

ఇది కుమ్మరావములో రాగిముంత నేరుట—అనునదే.

పాల్కురికి సోమనాథుడు బసవ పురాణములో

'ఇలనావమున గల్గనే రాగిముంత'అని వాడి యున్నాడు. (పుట 134)

(ఆంధ్ర గ్రంథమాలా ప్రచురణము.)

ఆవము—ఆపాక శబ్దభవము.

**ఇత్యపులు కూయగా కోనంగు డేయగా**

**అప్యేకదంతుండు-పున్నపుంసకమెక్కి ఆడెనమ్మా** పుట 51.

పూర్వముద్రణ.

దీనిని గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కంలో వాడారు.

**ఈగంత ప్రభువు ఏనుగంత పేరు.** పుట 56.

కాటమరాజు కథలో 'భట్టు రాయబారము' కథాభాగాన్ని **సంస్క**రించే సందర్భంలో బ్రౌనుదొరగా రిట్లా వ్రాశారు.

**"The occurance described in this poem took place at the time when Bhujabala Vira Nallasiddha Deva Chola Maharaz (a little baron with a long name) ruled Neloor. And it has been ascertained that this was in the year 1081 of Salivahana or A. D. 1159**

తెలుగున—"భుజ బల వీర నల్లసిద్ధి దేవ చోళ మహారాజా నెల్లూరు ఏలుచుండగా—శా. శ. 1081—క్రీ.శ. 1159 ఈ గ్రంథ కథార్థము జరిగినది. ఈగంత ప్రభువు—ఏనుగంత పేరుగా పై మహారాజా విశేయ మున్నది."

**ఈదాడంటే కోదాడన్నట్టు.** పుట 57.

వీనికి సంస్కృతము తెలిసినగాని యీ సామెత అర్థముకాదు.

**ఈదాడు**=హింతాలము; **కోదాడు**=కోవిదారము.

**"ఈనిన పులికి ఆక లెక్కువ".**

ఈనిన పెగులికి ఇల్లల్లా చాలదు—అని వాడుక.

**ఉప్పుతో తొమ్మిది—పప్పుతో పది.** పుట 63.

ఉప్పుతో గూడ నిత్య జీవితాని కుపయోగించే తొమ్మిది వస్తువులు—

ఘటం, పటం, జలం, కాష్ఠం— తండులస్తైలమేవచ

శాకమగ్ని సహాయుక్తం—లవణం నవ సంయుతం

ఘటం—కుండ, పటం—గుడ్డ, జలం—నీరు. కాష్ఠం—కట్టె, తండులం—బియ్యం, తైలం—నూనె, శాకం—కూర, అగ్ని—నిప్పు, లవణం—ఉప్పు, వీనిలో ఉప్పే రుచులకెల్ల మొదలు కాబటి చివరిదైనా మొదటిదిగా పరిగణితమైనది. పప్పు మన ఆహార పదార్థాలలో మొదటలేదు. తరువాత వచ్చినది. కాబట్టి ఉప్పుతో తొమ్మిది, పప్పుతో పది—అన్న సామెత వాడుకలయినది.

ఆహార సమస్య తీవ్రంగా ఉన్న ఈనాడు—మన ఆహారం లోకి పప్పు ఏలాగు వచ్చిందో పరిశీలించాలి. మించుపల్లి వ్యాఖ్య

**ఉప్పుముల్లెను నీటిలో ముంచినట్లు—**

ఉప్పు ముల్లియ నీర నున్న నందణగు

చొప్పున.... పండి. 1—182 పు.

ఉప్పు ముల్లియ నీరముంచిన యట్లు బస. 42 పు.

**ఉల్లిచేసిన మేలు తల్లి అయినా చేయదు.**

ఈ సామెతను గూర్చిన కథను నే నీ వరకే తెలిపితిని. చూ. భారతి—డిసెంబరు 1959 కలగూరగంప—పుట. 90.

**వూరులేనిదే పొలిమేర—** పుట 66

గ్రామోనాస్తి కుతస్సీమా"

ద్వి.....మటి యూరు లేక

పొలి మేర గల్గనే. పండి. 1—636.

ప్రస్తుత కీర్తి! "గ్రామో

నాస్తి కుతస్సీమా9" యనిన యీ స్మృతి క్రియ—

అనుభవసారము. 174 ప.

**కాసర కూసర గాడిద వాలకము —పుట 117**

ఉ. కాసర కూసరై తుదికి గాడిద వాలకమై వెసం రసా
భాసకు **మూల**మై వికట పద్ధతియై సిగపట్ల గోత్రమై
చేసితి వింత కాపురము సిగ్గను **మా**లిన దాన నేను నీ
కోసము మోసపోయితిని కొంగను నమ్మిన చేప పోలికన్.

**కూచెమ్మ కూడబెడితే మాచమ్మ మాయం చేసిందట.** పుట 126

---

9. "సహారేస్తు పరస్తాతా" అనుటకు "సహారేస్తు పరస్తాత" అని అప్పకవి వ్రాయగా చిన్నయసూరి—అనుకరణంబున నిడుదకుంగుఱచయని యొకండు వలికినది **నిరాకరణంబు**(సంధి.53 సూ)అని ఆక్షేపించినాడు. పై సోమనాథ ప్రయోగమునుబట్టి అప్పకవి వ్రాసినది **సరి**యైనదే.

"కూచెన్న కూడ బెడితే పూచన్న మాయం చేశాడు" అని వాడుక.

క. ఇంచుకయును నే ప్రయుంపక
సంచితముగ ధనము విభుఁడు సానుల కొసగెన్
గుంచెన్న కూడ బెట్టగ
మంచెన మాయంబుచేసె మర్యాదలరన్
రుక్మాం. 4—105.

ఢిల్లీకి ఢిల్లే—పల్లెకు పల్లే    పుట 189.

అల్లితిమి లోచుగతి కవి
తల్లజు లొనరించు గ్రంథ తతి కిది సమవా
ఢిల్లికి ఢిల్లే పల్లెకు
పల్లే అని చెప్పు నట్టి సల్కులు వినరే
బుద్ధచరిత్ర—తిరుపతి వెంకటకవులు.

పైన పటారం—లోన లొటారం    పుట 200.

పైకి పటారం—లోలొటారం
పటహారవ శబ్ద తద్భవం—పటారం
లోష్ఠారవ శబ్ద తద్భవం—లొటారం.
పైన— పటహము—తప్పెటల ధ్వని. లోన లోష్మము— చిల్ల పెంకుల చిందులాట.   మించుపల్లి వ్యాఖ్య.

భాస్కరాచార్యుల (భాష్యకారుల) వెంట్రుకలైతే మాత్రం పీనకు తంతులవతవా.    పుట 313.

ఇది—అలతాళ్లపాక చిన్నన్న రోమములైన తంబురా దండెకు తంత్రులౌనె : అని గ్రంథస్థమై యున్నది.

సూరన్న చిన్నవాడు. పేరన పెద్దవాడు. అయ్యే కెత్తరా కోళ్ల గంప.    పుట 408.

ఇది సూరన్న సుఖవాసి. పేరన్న పెద్దవాడు. అయ్యే కెత్తరా కోళ్ల గంప—అని పూర్వ ముద్రణ.

ఇదే సూరన్న సుకవాసి, పేరన్న పెద్దవాడు—బుచ్చన్న బుద్ధిమంతుడు—అచ్చన అంతకంటె—కామన్న కడసారి. చేసే వారెవరు—అని వాడుకలో ఉన్నది.

స్థాలీపులాకన్యాయంగా, సామెతలను గూర్చి కొన్ని సంగతులు మాత్రమే తెలివిడి చేశాను. అవి ఏవిధంగా రూపొందాలి అని దిఙ్మాత్రంగా సూచించాను—జాతికీ, మతానికీ, సంప్రదాయానికీ, సాహిత్యానికి, చరిత్రకూ, సంస్కృతికి సమస్త వ్యవస్థలకు సామెతలే ఆయువుపట్టులు. జీవనాధారం. సర్వంకషంగా కూలంకషంగా సామెతలను గూర్చిన పరిశ్రమ సఫలీకృతమైతే ఆంధ్ర జాతీయ జ్యోతి అభ్రంకషంగా భాసిస్తుంది.

ప్రణవం మూడుమాత్రలలో ప్రపంచం యిమిడినట్లుగా 'సామెత' మూడక్షరాలలో సర్వమూ ఇమిడి ఉంది.

---

[తెలుగు సామెతలు—ద్వితీయ ముద్రణము. సంపాదకవర్గం అధ్యక్షులు: కళాప్రపూర్ణ, కవి సమ్రాట్టు విశ్వనాథసత్యనారాయణగారు. ప్రకాశకులు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, సైఫాబాదు, హైదరాబాదు. పుటలు 44+414. వెల. రు. 10 లు.]



# శ్రీ శంకరన్ కురుప్‌కు జ్ఞానపీఠం బహూకృతి



1944 లో శ్రీ శాంతిప్రసాద్ జైన్ భారతీయ జ్ఞానపీఠం అన్న సంస్థను నెలకొల్పారు. ప్రాచీన లిఖిత గ్రంథాలను ప్రచురించడము, సమకాలీన సాహిత్యాన్ని ప్రోత్సహించడము దీని లక్ష్యాలు. సమకాలీన భారతీయసాహిత్యాన్ని ప్రోత్సహించడానికి యీ పీఠంవారు ఇటీవలనుండి ఉత్తమ గ్రంథానికి లక్ష రూపాయలు బహుమతి ఇచ్చే ఏర్పాటు చేశారు. ఆ బహుమతి ఇప్పుడు మళయాళకవి శ్రీ శంకరన్ కురుప్‌కు లభించింది.

శ్రీ శంకరన్ కురుప్ ''ఓడక్కుళల్'' అన్న కావ్యం వ్రాశారు. ఆ మాటకు 'వేణువు' అని అర్థం. ఇది ఖండ కావ్యాల సంపుటం. ఈ గ్రంథానికే ఆ బహుమతి వచ్చింది.

శ్రీ కురుప్ 1901 జనవరి 3 న జన్మించారు. విద్యాభ్యాసం ప్రాచీన పద్ధతిలో కొనసాగింది. సంస్కృతాన్ని ఆయన చిన్నప్పటినుంచి అభ్యసిస్తూవచ్చారు. మళయాళంలో ఉన్నత పరీక్షఇచ్చి, కొచ్చిన్ సంస్థాన పండిత పరీక్షలో నెగ్గారు.

1921 లో కొచ్చిన్ సంస్థానం సర్వీసులో చేరారు. అది ఉపాధ్యాయ పదవి. ఆ పదవిని నిర్వహిస్తూ, ఆయన క్రమంగా మహారాజా కళాశాల మళయాళం పండితులుగా అభివృద్ధిలోకి వచ్చారు.

1950 లో శ్రీ కురుప్ ఆ ఉద్యోగంనుంచి విరమించుకున్నారు. ఎర్నాకులంలో స్థిరపడ్డారు.

శ్రీ కురుప్ మంచి వక్త. చక్కని రచయిత. ఈయన మళయాళంలోనికి టాగూరు గీతాంజలిని, ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను, కాళిదాసుని మేఘదూతను అనువదించారు.

## కీర్తిశేషులు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

బహు భాషా కోవిదులు, సాహిత్య విమర్శకులు, ప్రముఖ రచయితలు, సహజవక్తలు అయిన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి 1965 డిసెంబరు 14 వ తేదీ సాయంకాలం చెన్నపురిలోని మైలాపూరులో కాలధర్మం చెందారు.

శ్రీ సత్యనారాయణమూర్తి జన్మస్థలం గోదావరీ తీరస్థమైన పేరవరం గ్రామం. ఆయన 5 వ ఫారం వరకు ఆంధ్రదేశంలో చదువుకున్నారు. అప్పుడు దేశంలో నాయకత్వం వంగీయులది. భారత రాజధానికూడ కలకత్తాయే. వంగీయుల ప్రసంగాలతోను, రచనలతోను ఉత్తేజితులయిన శ్రీ సత్యనారాయణమూర్తికి కలకత్తాకు వెళ్లి చదువుకుందామని బుద్ధి పుట్టింది. కలకత్తాకువెళ్లి చదువుకొని శ్రీ ఆశుతోష్ ముఖర్జీ శిష్యులుగా ఇంగ్లీషు సాహిత్యంలో ఎం. ఏ. పట్టం పుచ్చుకున్నారు. తర్వాత వేదాంత శాస్త్రంలో డాక్టర్ రాధాకృష్ణన్ అంతేవాసిగా



ఎం. ఏ. పట్టం పుచ్చుకున్నారు. పిదప బి. ఎల్. పరీక్షలో ఉత్తీర్ణులయారు. వంగభాషను, హిందీ, సంస్కృత, పాళీ సాహిత్యాలను అధ్యయనం చేశారు.

విద్యార్థి దశలోనే ఆయన వంగభాషనుంచి పెక్కు గ్రంథాలు తెలుగులోకి అనువదించారు. వంగ సాహిత్యాన్ని, రవీంద్ర సాహిత్యాన్ని తెలుగు దేశానికి పరిచయం చేసిన వారిలో వీరే ప్రథము లనవచ్చు. నలభై సంవత్సరాల క్రితమే రవీంద్రుని ముక్తధార మొదలైన నాటికలను, నవలలను అనువదించారు. ద్విజేంద్రలాల్ రాయ్ నాటకాలు రాణాప్రతాప్, మివార్ పతనం, దుర్గాదాస్, మొదలయినవాటిని అనువదించారు.

ఆయన ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలలో, భారతిలో పెక్కు సాహిత్య విమర్శ వ్యాసాలు, యాత్రా నుభవ వ్యాసాలు వ్రాశారు.

ఆయన "విద్యార్థి ప్రకాశిక"అనే గ్రంథాన్నిరచించి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి అంకితమిచ్చారు.

ఆయన బి. ఎల్. పట్టం పుచ్చుకున్నతర్వాత మద్రాస్ హైకోర్టులో కేశవరావు రామదాసుపంతులు గారిదగ్గర అప్రెంటిస్‌గావుండి, రాజమండ్రి, విశాఖ పట్టణాలలో న్యాయవాదిగా కొంతకాలం పని చేసి, పిదప ఆ వృత్తి వదలి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. "స్వరాజ్య" ఆంగ్ల దిన పత్రికలో కొంతకాలం పనిచేశారు. ఎస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. విజయవాడ కళాశాలలో పదేళ్లపాటు ఆంగ్ల శాఖా ధ్యక్షులుగాను, మాస్కోలో పుస్తక ప్రచురణశాఖలో కొన్ని సంవత్సరాలు పనిచేశారు. మద్రాసు రామ కృష్ణ మఠంవారి వివేకానంద శతవార్షిక గ్రంథ మాల తెలుగు శాఖలో పనిచేశారు.

ఆయన మంచి వక్త. దేశమంతటా ఆంధ్రాంగ్ల వంగ భాషలలో అనర్గళంగా పెక్కు విషయాలపై ప్రసంగించారు. ఆయన చిన్ననాడే టాగూరు 'లా'ప్రైజు సంపాదించారు. సాహిత్య భూషణ, భారత తీర్థ పండిత, విద్యాసాగర, ఆధ్యాత్మికరత్న మొదలైన అసంఖ్యాక బిరుదులు పొందారు.

శ్రీ సత్యనారాయణమూర్తి అంత్యకాలానికిముందు రెండు నెలలుగా గుండె జబ్బుతో ఆస్పత్రిలోఉన్నారు.

ఆయనకు సతీమణి నలుగురు పిల్లలు ఉన్నారు.



## లేఖలు :

# అస్తిత్వవాదము

ఆర్యా,

'సర్వాస్తి వాదము' బౌద్ధదర్శనములలో నొకటి., నేటి 'అస్తిత్వవాదము' (Existentialism) ఆ దర్శనములో నొక శాఖతప్ప మరేమీకాదని డిసెంబరు "భారతి" లో 'శ్రీపాదుక' వ్రాసిన లేఖ పాఠకులను తికమక పెట్టడానికి చేసిన ప్రయత్నం తప్ప మరోవిధంగా కనిపించదు. పాశ్చాత్య తాత్త్వికుల గ్రంథాలతో పరిచయమే ఉంటే ఈవిధమైన వ్రాత లేఖకుడు వ్రాసివుండడు.

'నిత్యము, సార్వజనికము అయినదానిని మానవానుభవముల ద్వారా వెల్లడించుట, జగద్రహస్యమును గ్రహించుట' అనునిర్వచనము సరికాదు. "An introspective humanism or theory of man which expresses the individual's intense awareness of his contingency (that is, existence, menaced by death and depe-dent on oneself for shaping the course and quality of one's life) and freedom; a theory which states the exist-ence of the individual precedes his essence" (Webster's New Ccllegiate Dictionary.)

ఈనిర్వచనములో వ్యక్తియైన మానవునికి, అతను అస్తిత్వానికిచ్చే విలువకూ దానిద్వారా జరిగే అన్వేషణకే, ప్రాధాన్యం. తత్ఫలితంగా 'నిత్యమూ సార్వజనికమూ' అయినది గోచరిస్తుందా? అటువంటిది ఉన్నదా? అనేవిషయానికి ప్రాధాన్యం లేదు. "There is no question here of finding again an abstract behind the concrete; the impulse toward God is no less concrete than the impulse toward a particular woman...This impulse can be only purely individual and unique....God, value and supereme end of transcendence, representes the permanent limit in terms of which man makes known to himself what he is....." (Satre: Existentialism and Human Emotions)

లేఖకుడిచ్చిన నిర్వచనములో 'నిత్యము, సార్వజనికము' అయినదానికి ప్రథమస్థానము యివ్వబడినది. కాని దానినిగ్రహించుట, వెల్లడించుట, 'అస్తిత్వవాద' రీత్యా, మానవ అస్తిత్వమునకు విలువ, ప్రయోజనము కాదు. మానవుని అస్తిత్వమునకు'అస్తిత్వ'మే విలువ. మానవుని అస్తిత్వము 'సార్వజనికము'లో ఒకభాగముగా, ఒకవిశేషముగా, నెంచుట 'అస్తిత్వవాదము'నకు విరుద్ధము. అయితేమానవుని అస్తిత్వప్రకాశము ఏవిధముగనైన ఉండవచ్చును. సార్త్రే పైనచెప్పినట్లు అదిఒక స్త్రీమీద వలపేకావచ్చు, భగవంతుని మీద ప్రేమేకావచ్చు; 'నిత్యమూ సార్వజనికమూ' అయిన ఒక దానిని గ్రహించుటేకావచ్చు; అది వేరు విషయము, అప్రధానము.

అస్తిత్వవాదమునకూ హెగెల్‌కూగల సంబంధాన్ని పేర్కొంటూ "The real is the rational' అనేవాక్యాన్ని ఉల్లేఖించటం జరిగింది. కర్క్‌గార్డ్ దానిని ఒప్పుకోలేదు. సరిగదా అది అస్తిత్వవాద దృక్పథానికి వ్యతిరేకమని విమర్శించాడు. "Hegel"s 'the real is the rational and the rational is the real' is ctiticised by Kierkegaard as 'not only presumptious but ridiculous, for it rests upon the assumption that a particular part of an as yet uncom-pleted scheme which is not in process of being created by itself could know what its completed form must be. If the world were a system it would take God himself, not Hegal, or anybody to know it. Finite individuals are like figures of comedy when they claim to demonstrate that any individual occupies a specific place in some rational system of the world .... No one can know his place, no one can have his duty proved to him, but each must take his courage in both hands and choose as best he can......" (Existentialism : Ency-clopedia Britannica)

పై విమర్శ దృష్ట్యా— విత్యము సార్వజనికము అయిన దానివి సహేతుకముగ వెల్లడించుట మానవుని ధర్మము, కర్తవ్యము అనిచెప్పుటగాని, ఒకమాన వుడు వివేచనద్వారా సృష్టించిన లేక నిరూపించిన విషయాన్ని పరమార్థంగా, అనుసరణీయంగా స్వీక రించమని ఇతరులను ఆదేశించుటగాని 'అస్తిత్వ వాద' దృక్పథమునకు వ్యతిరేకము. 'అస్తిత్వవాదము' చెప్పునది "నీదారి నువ్వుచూచుకో, నీ అస్తిత్వానికిఅర్థం పరమార్థం వుందో లేదో నువ్వే నిరూపించుకో" అని మాత్రమే!

అస్తిత్వవాదానికీ యితర తాత్విక వాదాలకూగల ప్రధానమైన భేదం— 'It is a tendency or attitude rather than a philosophical school'. (En. Br.). ఒక్కమాటలో చెప్పాలంటే ఆదర్శానికి ఆచరణకూ గల భేదాన్ని సమసింపజేసి ఆచరణనుంచి (జీవితంద్వారా) విలువలను రూపొందింప జేయటమే ఈ వాదంయొక్క ప్రధానోద్దేశం. ఈ ఉద్దేశం నెరవేరడానికి ఎవరికివారు ఆత్మజిజ్ఞాస (self introspection) చిత్తశుద్ధితో, ధైర్యంతో, చేసుకుని ముందుకు నడవాలి. విషయం యిలావుంది కాబట్టే అస్తిత్వవాదుల్ని సార్త్రే భక్తులనీ, లేక మరొకరి అనుయాయులనీ అనుకోవటమే తప్పు! సార్త్రేకు భక్తుడవటంతోటే ఆవ్యక్తి 'అస్తిత్వవాది' అనే పేరుకు తగని వాడవుతాడు! 'అస్తిత్వవాదా'నికీ అను సరణకూ చుక్కెదురు. లేఖకునికి 'అస్తిత్వవాదపు' అను పానులు తెలిసినట్లయితే, 'సార్త్రేసిద్ధాంతాన్ని వివరించే వ్యాసాలు రాలేదే?' అనిఎవరిమీదో ఆరోపించి వుండడు! సార్త్రేసిద్ధాంతాన్ని పాఠక లోకానికి తెలియజెయ్యడం ముఖ్యమనుకుంటే లేఖకుడే ఆపని చెయ్యవచ్చుకదా! లేఖకునిలో ఆచరణకూ ఆదర్శా నికీ గల దూరమేమిటో తెలుస్తూనే వుంది!

అస్తిత్వ వాదాన్ని నిరూపించడానికైనా ఉదాహరణకు తెలుగులో రచనలులేవని ఏ ధైర్యంతో చెబుతున్నాడీ లేఖకుడు? గోపీచంద్ వ్రాసిన 'మెరుపుల మరకలు' నవలలోని ఉషారాణి అస్తిత్వవాదానికి ఉదా హరణగా ఉన్నదని నేను "నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు" అనే వ్యాసాల్లో, 'భారతి' లో వ్రాశాను. అందుకు భిన్నాభిప్రాయం ఉన్నట్లయితే ఈ లేఖకుడు సోపపత్తికంగా, స్పష్టంగా నా వ్యాసాన్ని ఖండిస్తూ వ్రాయవచ్చునే!

గణిత, భౌతిక, రసాయనిక శాస్త్రజ్ఞుల్ని పేర్కొంటూ— "ఆయా శాస్త్రములలో ఉన్నత పరీ క్షలు ప్యాసైనవాళ్లు.....కొందరు తమ విధ్యుక్త ధర్మాన్ని మరచిపోయి, అవసరములేనట్టి తక్కువరకపు సాహిత్య వ్యాసంగానికి పూనుకుంటున్నారు. అట్టివారు బుద్ధిమాంద్యమువల్లనేకాక, కీర్తి వ్యామోహముచేత, అయోగ్యమైన దురహంకారముచేత కూడ బాధపడు చున్నారని ఒప్పుకోవాలి." సాహిత్య వ్యాసంగం చేస్తున్న శాస్త్రజ్ఞులు (Scientists) తెలుగులో ఎందరోలేరు. పై వాక్యాలు ఎవరి నుద్దేశించి వ్రాయబడినవో అందరికీ తెలుస్తూనేవుంది. ఇలాంటి పిరికి వ్రాతలు అసూయనూ కుళ్లనూ వెళ్ళగక్కే మాటలు సాహిత్య వ్యాసంగానికి పనికిరావు. పై శాస్త్రజ్ఞులు చేసిన సాహిత్య వ్యాసంగాన్ని చేతనైతే విమర్శించాలి. లేకపోతే వూరుకోవాలి! ముసుగు పేరుతో ఏవో రెండు మాటలు విసరితే ఏమి సాధించినట్లు?

వెనకటికి ఎవరో 'ఆ! పంచ పాండవులంటే మా తాత మంచంకోళ్లలాగా ముచ్చటగా ముగ్గురేగా!' అన్నట్లు ఆ ధోరణిలో, 'అస్తిత్వవాదాన్ని' 'సర్వాస్తి వాదం'తో ముడి పెట్టబోవటం హాస్యాస్పదం. తెలుగు భాషాసమితి ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము ఏడవ సంపుటము—దర్శనములు, మతములు'అస్తిత్వవాదము' అనే పారిభాషిక పదాన్ని అంగీకరించింది. ఇది సార్త్రే భక్తుడెవరో చేసిన అవక తవక పనిగాదు. (Existence) అనే పదానికి విశిష్టమైన అర్థం కర్కెగార్డ్‌తో ప్రారంభం అయింది. తెలుగులోకూడా 'అస్తిత్వ' పదం ఆ అర్థంలోనే రూఢి అయింది. దీన్ని యిప్పుడు మార్చవలసిన అగత్యంగాని అధికారంగాని ఎవరికీలేదు!

"where the mind is without fear, where the head is held high, where knowledge is free .. .into that heaven, O Father let my country awake"

అని టాగూర్ మహాకవి పెట్టుకున్న మొర భగవంతుడింకా ఆలకించినట్లులేదు. బుద్ధులు మారితేగాని దేశానికీ వాఙ్మయానికీ మేలు చేకూరదు. స్తబ్దతపోదు!

చిత్తూరు ఆర్. ఎస్. సుదర్శనం.

---

# గ్రంథ విమర్శలు

## తెలుగునుడి, నానుడి

(రచన:—బి.స.బంగారయ్య ; వెలువరింతలు:— తెలుగు నానుడి కూటమి. బెజవాడ ; వెల:— ఏడు రూపాయలు.)

ఒకానొకప్పుడు ఒకానొక తెనుగు దొడ్డ యిల్లాలు గడప ద్రొక్కిన చుట్టాలకు అన్నము పెట్టుచుండెను. వడ్డన చేయుచు, "అయ్యా! పప్పు కావలయునా? ఉప్పు కావలయునా?" యని యాయిల్లాలు చుట్టాల నడిగినది. అంత వారి కనులలో కెంపు లూరినవి. వారు "ఈ యాహారము నిషిద్ధము. "సూపము" అని వాడక పప్పు అని వాడితివి. "లవణము" అని యనకుండ ఉప్పు అని అంటివి. నీకు తెలుగంటు తగిలినది. పోయి సచేలస్నానము చేసిరమ్ము" అనిరి. సూపము, లవణము సంస్కృత సమములు. వచ్చిన చుట్టాలకు గీర్వాణమునందు మోజెక్కువ. తెలుగన్న గిట్టదు. తెలుగు "శూద్రభాష" గదా! అందుచే తెలుగు మాటల వాడుక వారి కేవగింపు కల్గించినది.అదియే వారిని పై మాదిరిగా పలికించినది. ఇది కట్టుకతయో లేక నిజముగా జరిగినదో తెలియదు. కాని దీనివలన ఒక రహస్యము తెలియుచున్నది. తెలుగు మాటల వాడుక గిట్టని పట్టని వా రీ తెలుగునాట నున్నారు. వారికి దేవభాష యగు సంస్కృతమునందు మరులెక్కువ. ఈ మరు లీనాటివిగావు. తెలుగులో కైత వెలసిన నాటినుండి యేసరేగినట్టివి. ప్రాచీన కవులు కొందఱు తమ గ్రంథావతారికలలో వెల్లడించిన తలపులే యిందుకు తార్కాణము. అదేమి పాపమో తెలియదుగాని సంస్కృత సాహిత్యమునుండి యనువాదము చేయునపుడు కూడ ఆంధ్ర కవులు కుండపోతగా సంస్కృతమునే కురియించిరి. ఇట్టివారినే మొల్ల మందలించినది. ఈ సంస్కృత మయరీతికి నన్నయ మూలపురుషుడనుచున్నారు. కాని నన్నయకు ముందే నూట యేబది యేండ్ల క్రిందట వెలువడిన శాసనములలో అచ్చముగా నన్నయ రచించిన పద్యములవంటివే కలవు. ఎందఱో కవులు నన్నయ బాటనే ద్రొక్కిరి. నన్నయది మార్గకవిత. ఈ మార్గకవితకు ప్రతిభటముగా వెలసినది దేశికవిత. ఈ కవితకు శైవకవులు ఆదిమ తీర్థములు. మార్గ కవిత సంస్కృత భాషా సంప్రదాయములను నిలువు దోపుడు చేసినది. దేశికవిత దేశభాషారీతులను స్వీకరించినట్టిది. మార్గకవితలో తెనుగు పలుకుబడి యుండదని, దేశికవితలో సంస్కృత వాసన యుండదని దీని యర్థముగాదు. వాడినచోట్ల, నన్నయ కండ గల తెలుగునే వాడెను. శివకవులు—అందును పాల్కురికి సోమనాథుడు—దీర్ఘ సమాసమయ రచనను చేసిరి. కావ్యకళ మందగించునట్లుగా వేదాదులనుండి సంస్కృతోక్తులను కుప్పించిరి. ఏ కవితలో కబ్బము లల్లినప్పటికి ప్రాచీనకవులు తమ నాటి తెలుగును వాడుచునే యుండిరి. ఈ వాడుట యే మితిలో నున్నది యన్నది వేరుమాట. తననాటి తెలుగునకు మహా కావ్య గౌరవము కల్గించిన వారిలో తిక్కన అగ్రసరుడు. గేయ కవిత అల్లిన తాళ్లపాక కవులు, క్షేత్రయ్య మున్నగువారు తెలుగునకు వెలుగు కలిగించిరి. అయిననేమి? తెలుగు కబ్బములలో సంస్కృతమే కొలువు చేసినది. ఇది సంస్కృత శ్లోకమా? తెలుగు పద్దెమా? యను అనుమానము వచ్చుదాక తెలుగువారు తెలుగును వీడి సంస్కృతమును వాడిరి. ఇట్లగుటకు కారణమేమి ? చరిత్ర గతియే. ఆ చరిత్ర పునరావృత్తము గాకుండ పరాకు లేకుండుట యిప్పటివారి విధి. ఆ విధిని గుర్తునకు తెచ్చువారిలో "తెలుగునుడి, నానుడి" యను గ్రంథము రచించిన బంగారయ్యగా రొకరు. వీరెంతో పట్టుదలతో ఈ గ్రంథమును రచించిరి.

సంస్కృతము త్రుళ్లు తగ్గిన తరువాత ఈ తెలుగునాట కొన్నాళ్లయినను ఉర్దూబాస చెల్లినది. పిదప తెల్లవారి యేలుబడి వ్రేళ్లువారినప్పటినుండి ఆంగ్లభాష రాజభాషయై స్వేచ్ఛా విహారము చేసినది. ఆంగ్లభాష బోధనా భాష యైనది. నాటినుండి నేటి దాక విద్యావంతుల "విశాలదృష్టి" వలన తెలుగు మఱుగయినది. ఆనాడు రాజాస్థాన పండితుల, రాజుల మమకారముతో సంస్కృతము ఎదురులేని యేలుబడి సాగింపగా, గుజ్జుగల తెలుగు చచ్చినది. ఈనాడు—శ్వేత

ముఖుల పరిపాలనము పంచబంగాళమయినప్పటికి— ఆంగ్లభాష ప్రభావము చూపుచున్నది. నుడిలో, నానుడిలో, కారకములో ఆంగ్ల భాషా సంప్రదాయములే అంపిల్లుచున్న రోజులివి. ముందు ముందు రాష్ట్ర భాష యనబడు హిందీ రాపిడి యెక్కువ యగును. ఎక్కువయగు చిన్నెలేమాత్రము తక్కువగాలేవు. సంస్కృత ప్రాబల్యమువలన తెలుగు సగము చావగా, ఆంగ్లభాష యొత్తిడివలన మిగిలినది చచ్చియు చావని దయినది. విద్యావంతులలో మాదిరిగా పల్లెల వారిలో ఇంకను తెలుగు చావలేదు. వారు నిరక్షరులన్నమాట మనము మఱవరాదు. ఈనాడు పొట్టకోసినను అక్షరము కానబడని తక్కువ కొలాలవారిలో, రాయలసీమలో, తెలంగాణములో అచ్చమయిన తెలుగు విజ్జిరాలుచున్నది. బహుళ ప్రచారముగల వార్తా సాధనములలో సహితము తెలుగునకు చోటు లేకపోవుచున్నది.

క్రొత్త పోకడలు ఎక్కువ యగుచున్న ఈ శతాబ్దములో తెలుగుపట్ల మాటలతో మక్కువ యెక్కువ యయినది యని చెప్పవచ్చును. దీనికి కారణములు రెండు మూడు కలవు. ఆ కారణములు కొన్ని సాంఘికములు. కొన్ని చారిత్రకములు. కొన్ని భాషా విషయకములు. సాంఘికముగా కులముల హెచ్చు లొచ్చులు కూలిపోయినవి. ఎల్లరు మాటాడు బాస వాడ దగినది యయినది. దీనికి దీప్తి కలిగించినది వ్యావహారిక భాషోద్యమము. కథ—నాయికా నాయకుల తత్త్వము మున్నగునవి మారిపోయినవి. రచయితల చూపు మారినది. అంతకుముందులేని క్రొత్తదనము సాహితీ ప్రపంచములో పిసాళించినది. చారిత్రక కారణములలో ఆర్య ద్రావిడ ద్విజాతి సిద్ధాంతము బలపడినది. ఆర్యులు విదేశీయులు. వారి భాష మార్పులు పొందిన సంస్కృత భాష. వర్ణ వ్యవస్థ ఆర్య సంస్కృతికి పుట్టకీటు. తెలుగు, ద్రావిడ భాషా కుటుంబములో పుట్టి పెరిగినది. ఇది సంస్కృతజన్యముగాదు. సంస్కృతమువలన చియ్యబట్టిన భాష యిది. ద్రావిడులు కళా సౌందర్య లోలుపులు. ఆర్యులు యుద్ధ తంత్ర పరాయణులు. గూఢచారులవంటివారగు 'ఋషులీ దక్షిణాపథమునకు వచ్చిరి. క్రమ క్రమముగా ఆర్యసంస్కృతి యీ ప్రాంతములో పాదుకొనిపోయి, ద్రావిడ సంస్కృతిని మట్టినది. అయినను ద్రావిడ సంస్కృతి చావ లేదు. ఆర్య సంస్కృతి స్వరూప స్వభావములను మార్పగల్గినది. ఎన్నో ద్రావిడ భాషా పదములు సంస్కృతములో చొచ్చినవి. ఇట్టివి, యిటువంటివి యింకొక కొన్ని తలపు లొకటి కాగా తెలుగుపట్ల వలపు పెరిగినది. ఈ పెరుగుటకు గుర్తుగా ఆర్య భాషా సంస్కృతుల ద్వేషము దేశమున చలామణి యగుచున్నది. తమిళదేశమున ఈ ద్వేషము పెచ్చు పెరిగినది. అట అదియొక ప్రత్యేకోద్యమము. తెలుగునాట ఈ ద్వేషము ఆ మట్టమున కెక్కలేదు. పుస్తకములలో మాత్రమే కానబడును. బంగారయ్యగారు రచించిన యీ పుస్తకము అట్టివానిలో ఒకటి.

మాటలలో మాత్రమే తెలుగు వలపు అని వ్రాసితిని. ఈ శతాబ్దములో ఏ కొలదిమందికోకాని తెలుగుదనము తెలిసినదిగాదు. ఆ కొలదిమంది వ్రాసిన దానిలో తెలుగు సౌరు గుబాళించుచునే యుండును. చాలమంది వ్రాతలలో సంస్కృతాంగ్లముల వాసనలే యెక్కువ. "వర్షము కురియుచున్నది వలె నున్నది" యను ధోరణిని కొందఱు వ్రాయగా, మరికొందఱు "అతడు వెలుగులోనికి వచ్చెను" అను తీరున వ్రాసిరి. తెలుగు మాటలు వాడుట మోటుదనమునకు గుర్తు. నిక్కమయిన తెలుగు వాడిన అది యెవ్వరి కర్థము గాదు. "బహుజన సుఖాయ, బహుజన హితాయ" అను ఈ రోజులలో జ్ఞానము పెంచుట ప్రధానముగాని మాటలనుగూర్చి కారకమునుగూర్చి యంత పట్టింపు పనికిరాదు. ఇట్టి సిద్ధాంతము లెన్నో యీ తెలుగు నాట చెల్లుబడియగుచున్నవి. దీనికొక తీరు ఒక తెన్ను ఒక దరి ఒక త్రోవ యున్నట్లులేదు. తెనుగుదనము అనవేమియో తెలిసికొనుటకు వోర్పు నేర్పులు చాలక ఈ సిద్ధాంతములను మనము ప్రచారము చేయుచున్నారము. కేవలము తెలుగు మాటలు క్రుమ్మరించినంతమాత్రాన తెలుగుదనమురాదు. తెలుగు మాటలు వాడుట తెలుగుదనమందొకపాలు మాత్రమే. తలపులను వెల్లడించుటలో తెలుగువాడు తనకు పుట్టుకతో అబ్బిన పోకడ పోవును. ఆ పోకడ గుర్తించుట తెలుగుదనమునకు ఒక గుర్తు. తిక్కన భారతమునందీ తీరెక్కువ. తెలుగు కారకము లెస్సగా ఎఱిగి వాడుట మఱియొక ప్రధానాంగము. తెలుగువారినోళ్లనుండి యెన్నో పదబంధములు, ఎన్నో జంటమాటలు, ఎన్నో సామెతలు కొల్లలు కొల్లలై జాలువారును. వాని నన్నిటిని ఆయా పట్టులకు తగినట్టుగా వాడుట తెలుగు

దనమునకు గుర్తు. ఈ పై చిన్నె లన్నియు ఉన్నగాని తెలుగుదనము వెల్లడికాదు.

తొలి నాళ్లనుండియు తెలుగునాట పద్య కవిత్వము రాజ్యముచేసినది. ఆ పద్యకవిత్వమునందలి యితివృత్తము కూడ తెలుగువారిదిగాదు. మఱి యార్య సంస్కృతి యందు ప్రధానాంగములయిన పురాణేతిహాసముల యందలిది. దేశికవితా మార్గానుయాయులుకొందఱు మాత్రము తెలుగునాటి కతలను పాడిరి. గద్య రచనలు ప్రాచీన కాలమున విరివిగా పెరుగలేదు. మఱి తెలుగు వారు పరదేశముల కెక్కిరి. వలసలు నెలకొల్పిరి. రోము నగరముదాక నావలు నడపిరి. అరువదినాల్గు కళలను కైవసము చేసికొనిరి. నౌకాశాస్త్రాదులుగాని, భూగోళ చరిత్రాదులుగాని ఈ తెలుగున వ్రాసిన వారెవ్వరులేరు. ఇంతేకాదు. బౌద్ధాది మతములకు ఆంధ్రులు చేసిన సేవ యెంత యున్నదో! ఆ సమయములను గూర్చి తెలుగులో వ్రాసిన గ్రంథములు లేనేలేవు. ఇది విచిత్ర పరిస్థితి. ఈ స్థితికి కారణము ఆర్య సంస్కృతి ప్రాబల్యము అని కొందరనుచున్నారు. నిజము కావచ్చు. మఱి సంస్కృతమునందే ఎన్నో శాస్త్రములు ఎంతో పెంపు కలిగియున్నవి. వానిని తెలుగువారు తెనిగించు కొనలేదేమి? తుద కొక్క నాటకమయిన వీరు తెనిగింప లేదు. దీనికి కారణ మెవరు? చెప్పలేము. వర్ణ వ్యవస్థను ఈ దుస్థితిని ముడి వేయువారు కొందఱుండ వచ్చు. ఉన్నారు. మఱి ఆ యా శాస్త్రములను దేశ భాషలలో వ్రాయదలచినవారికి ఆదరములేదా? ఆదరములేని యట్లు తార్కాణమున్నదా? ఈ చర్చ యంతయు ఇప్పటి చూపుతో చేయునదియే. దీనికి ముగింపుండదు. ఈ యాంధ్ర భాషలో ఆ యా శాస్త్రము లభివృద్ధి పొందకపోవుటకు ఆర్యసంస్కృతి యెంత కారణమో, ఈ తెలుగుజాతి దోషమును అంతే కారణము. కారణములయిన రెండును కావలె. ఇందొ కటి మాత్రమే కారణముకాదు. తుదకీ జాతి జైనులు వ్రాసిన కావ్యములను సైతము నిలుపుకొనలేకపోయి నది. తమిళులు కర్ణాటకులా పని చేసిరి. ఇప్పటి చూపుతో చరిత్రను సమీక్షించి చర్చలు చేయుట పొరపాటు. ఉన్నదానికి గతి కల్పించుట రచయితల విధి. ఏలయన అంతకుమించి చేయదగినది యేమియులేదు కాన. నాణెమునకు రెండువైపు లుండును. ఆవేదన పొంది గత చరిత్రను దూషించుట నేల విడిచిన సామే యగును. జరిగిన దేదియో జరిగినది. మగతనమున్నచో ఆ కసటు తిరిగి తలయెత్తకుండ చూడవలె. ఆంధ్ర భాషలో ఆ యా శాస్త్రములు వెలువడకుండుటకు కారణము నన్నయ పాడిచిన "వెన్నుపోటు" కారణమని బంగారయ్యగారివలె చెడమడ తిట్టుట పలువురికి సాధ్యముగాదు. తిట్ట బూనినచో తిట్టెడువారి లోగుట్టే బయట పడును. నన్నయ తనకు చేతనయినది తాను చేసెను. అందఱు తన బాట త్రొక్కవలయునని నన్నయ కట్టడ చేయలేదు. తరువాత వచ్చిన వారిని ఆయన త్రొక్కిన త్రోవ త్రొక్కమన్న దెవరు? నన్నయమార్గము పట్టినవారి దోషము నన్నయదా? అప్పటిదాక యెందులకు? ఈనాడు ఎన్నో శాస్త్రములు ప్రపంచమున పెంపొందుచున్నవే? వానిలో ఎన్ని శాస్త్రములనుగూర్చి ఎన్ని గ్రంథములు ఈనాడు తెలుగు బాసలో నున్నవి? లేకపోవుటకు నన్నయయే కారణమా? తెలుగువారికి మగతనము లేకపోవుట కారణమా? ఇప్పటి యీ స్థితికి కారణము కను గొనుటకు బంగారయ్యగారు పూనుకొన్నచో వారికి చరిత్ర సత్య స్వరూపముతో సాక్షాత్కరించును. ప్రాచీన కాలమునందు తెలుగే పోకడ పోయినదో, దేశభాషలన్నియు దాదాపు అదే పోకడ పోయినవి. ఈ గుట్టు తెలియక బంగారయ్యగారు నోరు పారవేసికొనిరి. భారతదేశము అనేక చారిత్రక కారణములవలన ఒక ప్రత్యేక మార్గముపట్టి పదవ శతాబ్దము తర్వాత పురోగమించుట మానినది. భారతదేశమే పురోగమించుట మానిన దశలో ఆంధ్ర భాష సాహిత్య గౌరవము పొందినది. ఆ కాలములో నన్నయ యంతకంటె నెక్కువ చేయజాలడు. బంగారయ్యగారి వంటివారి యభిరుచి నన్నయకు తెలియదుగదా! ఈనాడు తెలుగును ఎక్కువగా సంస్కరింపవలయునని బంగారయ్యగారు ఆవేదన పడుచున్నారు. ఆంగ్ల భాషను ప్రమాణముగా స్వీకరించి వాక్యమునందు మాటలు విసంధితో విడివిడిగా వ్రాసినచో, మాటల యాథార్థ స్వరూపము తెలియుననియు (చదువునపుడు సంధితోనే చదువు కొనవలయును.) తత్ఫలముగా పదజ్ఞానము అచిర కాలములో బాలుర కబ్బుననియు వ్యాకరణ బాధ యుండదనియు బంగారయ్యగారి యూహ. ఈనాడు ఆంగ్లభాష సుసంపన్నమను తలపుతో బంగారయ్యగారు దానిని ప్రమాణీకరించుకొన్నారు. అట్లే నన్నయ

తననాడు సర్వాంగీణమయిన సంస్కృతము ననుసరించెను. ఇందులో తప్పేమున్నది. అనుసరించిన తీరులో దోసము లున్నవందురా? అది వేఱుమాట. దాని కెన్నో హేతువులుండును.

బంగారయ్యగారు ఈ గ్రంథమును హద్దులు లేని తెలుగు వలపులో ముందు వెనుకలు చూడకుండ వ్రాసిరి. అక్కిరాజు ఉమాకాంతముగారి, తాపీ ధర్మారావు నాయని (క్రొత్త పాళీ) వ్రాతలు చూచిన వారికి బంగారయ్యగారి వ్రాతలు అంత క్రొత్తగా నుండవు. ఇందలి క్రొత్తదనమెల్ల తద్భవములను ఏర్పరచుకొనుట యందు, వాక్య నిర్మాణాదులను సంస్కరించుకొనుట యందు, బంగారయ్యగారు చెప్పిన మాటలలో నున్నది. వారు ఈ గ్రంథమును వ్రాసిన తీరునందున్నది. ప్రాచీనులు దేశభాషపట్లగల ఎడతెగని మోజుతో గ్రంథములు వ్రాయగా బంగారయ్యగారు పెచ్చు పెరిగిన తెలుగు మరులుతో ఈ గ్రంథమును వ్రాసిరి. అందుచే తొల్లిటి వారి వ్రాతలయందలి దోసములే దీని కెక్కినవి. ఈ గ్రంథమున మొదట బాస పుట్టుకనుగూర్చి కలదు. గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమములచరిత్ర కొంత యిందు కలదు. ఆంధ్ర భాషా సాహిత్యముల పరిణామ చర్చ గలదు. ప్రాచీనులు ఆంధ్ర జాతీయ కావ్యములను రచింపలేకపోయిరనియు, తెలుగు పలుకును (తిక్కనాదులు) కూడ వల్లకాటిలో కలిపిరనియు బంగారయ్యగారి యభియోగము. శివకవులు వైతాళికులని వీరి నమ్మిక. కవి, కావ్యము మున్నగు వానినిగూర్చి బంగారయ్యగారు చర్చించిరి. పద్య గద్య రచయితలను గూర్చి వ్రాసిరి. కవి—రచయితయను ప్రత్యేక సంజ్ఞలను సృష్టించికొని రచయితకు పట్టముకట్టిరి. తెలుగును వ్రాయుటలో మాటలను విడివిడిగా వ్రాయవలయుననియు, అట్లయిన మాటల నిక్కమయిన జాడ తెలియుననియు ఆంగ్లభాషను ప్రమాణీకరించిరి. కోశములను వ్రాయవలసిన తీరు తెన్నులు తడవిరి. ప్రకృతి వికృతుల పరామర్శ చేసిరి. ఈ రచనయంతయు సంస్కృత ద్వేషముతో కొనసాగినది. ప్రాచీనులు ఏమేమో చేయలేదని, చేసినదంతయు దోసమని బంగారయ్యగారు లెస్సగా తిట్టిరి.

ఈ గ్రంథమున వెల్లడియయిన తలపు లొక యెత్తు. గ్రంథము రచనారీతి మరొక యెత్తు. బంగారయ్యగారు ప్రతిపాదించిన సిద్ధాంతములతో గ్రంథములు వ్రాయబూనిన, అవి యే తీరులో నుండునో ఈ గ్రంథమే సాక్షి. పాఠకునకు ఎంతో యోపిక యుండినగాని యీ గ్రంథమును చదువలేడు. వాక్య వైఖరి క్రొత్త. మాటల కూర్పు క్రొత్త. తొలిపలుకులో చదువరులకు హెచ్చరికలున్నవి. ఈ గ్రంథము నందలి రచనారీతికి ఈ క్రింది భాగమును పరిశీలింపుడు.

"కాని ఈ కదిలింపు మోగంగా మతపు కదిలింపు. గనుక సమయపు వయిస్ణవపు పోరాటములో సమయము ఓడిపోతూనే వీరి నుడి సాదింపులు, వీరి సాంగికపు తిరికూర్పులు (Reforms) నిలిచిపోయినాయి. ఈ కదిలింపును అణగద్రొక్కిన వీరవయిస్ణవులు వీరి (సమయుల) పూనికలను అన్నింటిని పయికి రాను ఇయ్యక ఉండా తొక్కి వేసినారు. గురుతు కూడా లేక ఉండా నేల రాసివేసినారు. రాతనుడిగా అనగా పొత్తము రాయడానికి పనికి ఒచ్చే నుడిగా రాయడానికి వాడ అలిసిన నుడిగా తెలుగులిపిలో సముస్కృతము తెలుగునాటిలో పాతుకొనిపోయింది." (పుట. 61)

ఆద్యంతము ఈ గ్రంథమునందు రచనయిట్లే యుండును. అంతేగాక బంగారయ్యగారు కొన్ని కొన్ని మాటలు క్రొత్తగా వాడిరి. ఆ మాటలు ఆంగ్లభాషాగతపదములకు సమానములు. ఒక కొన్నిటిని చూడుడు. వాగమి (Vocabulary); తెల్లము (Meaning); అనిడిగా (Independently); పుట్టికము (Creative-ability); మందికంగా (Politically); ఏకికులు (Critics); తావికము (Local); నాలించి (Neglect); కానవాలించి (Ignore); పరిమట్టులు (circumstances); కదిలింపులు (Movements); మోగము (Important); కనిపింపులు (findings); చేతబడి (Artificial); అపాడి (Injustice). వ్రాతలో సంస్కృతమునుండి వచ్చిన వర్ణములు (ఋ. ౠ. ఌ. ౡ. వర్గయుక్కులు మున్నగునవి) లేవు. ఉండుట వీరికి గిట్టదు. "గవురన అరిచ్చంద్రీయము", "దిపద కబ్బాలు", "కిస్టదేవరాయల ఆముక్త మాల్యద", "సిరినాధుని రచన", "కలావసుతపు", "అనక్కర అయిన మాటలను", "మంది పవుకడలు" వంటి ప్రయోగములు ఇందు కుప్పనగూరలుగా నున్నవి.

ఇందలి నుడికారము ఇట్టిది. ఇది దేశ్యముగాదు. గ్రామ్యముగాదు. తద్భవముగాదు. గ్రాంథికముగాదు.

శిష్టవ్యావహారికముగాదు. ఇదియొక విశ్వామిత్ర సృష్టి. రెంటికి జెడిన రేవనిని బోలినట్టిది. ఇట్టి భాషను వలచినవారు గావుననే బంగారయ్యగారికి తిక్కన భాష తెలుగుగా కానబడలేదు. ఆర్య సంస్కృతి ద్వేషము: గలవారు కావుననే వీరశైవకవులు వీరి పాలిటికి కవిబ్రహ్మలయిరి. బంగారయ్యగారికి వ్యాకరణతత్త్వము సరిగా నసిగా అవగతము కాలేదు. వ్యాకరణము దివి నుండి భువికి నూడిపడునదిగాదు. అది భాషనుండియే పుట్టును. నిరక్షరాస్యులయిన జానపదుల వాగ్వ్యవహారమునందు సహితము అప్రయత్నముగా సంధులు సాక్షాత్కరించును. ఆయా యాగమాదేశ వర్ణలోప వ్యత్యయములు చూపట్టును. ఆ యా ప్రత్యయములు పొదుకొనును. పెంకుటిల్లు, విసపుమాట, బాలెంతరాలు, నీటియెద్దటి, నాగేటిచాలు, తాళ్లు, కొడవళ్లు, కట్టుబడి, రాలుబడి వంటివి వేలకొలది జాలువారును. ప్రచురములయిన భాషాలక్షణములే వ్యాకరణమున కెక్కును. వ్రాసిన వ్యాకరణము భాషావ్యాకరణమా? సాహిత్యవ్యాకరణమా? యనునది వేఱుమాట. ఆంధ్ర భాషలో భాషావ్యాకరణములు లేవు. ఉన్నవేమో సాహిత్యమునకే వ్రాయబడినట్టివి. వీని పరిధికూడ చిన్నది. బంగారయ్యగారి భాష ప్రకృతి ప్రత్యయ విభాగము గుర్తించినట్టిదిగాదు. ప్రత్యయములను మనయిష్టము వచ్చిన ప్రకృతులకు చేర్ప వీలులేదు. భాషయే యిట్టి పట్టులలో కట్టడ యున్నట్లు చూపును. బంగారయ్యగారు సృష్టించిన క్రొత్త మాటలు భాషాలక్షణము పట్టినవి గావు. మూలపదముల సంపూర్ణార్థమునిచ్చునవియుగాదు. తద్భవముల విషయమున వారు వ్రాసిన వ్రాతలో సంస్కృతద్వేష మున్నంతగా శాస్త్రదృష్టి లేదు. జానపదుల భాష కొక తీరు ఒక తెన్నుండును. బంగారయ్యగారి భాషకు అదియులేదు.

దీనికంతకు మూలకారణ మొకటే. బంగారయ్యగారు భాషా సాహిత్యముల తారతమ్యము పరిశీలింపలేదు. గుర్తింపలేదు. భాషవేఱు. సాహిత్యమువేఱు. సాహిత్యము భాషలో ఒక ప్రధానాంగము. రసము దాని యాత్మ. ఆనందము దాని ప్రయోజనము. శబ్దార్థముల, సన్నివేశముల శిల్ప మందు పుష్కలముగా నుండును. వాఙ్మయము, సారస్వతము, సాహిత్యము ఇవియన్నియు అక్షరసంకేతరూపమగు భాషాంగములే. లిపి హీనమగు భాషలో సహితము సాహిత్యముండవచ్చును. ఉట్లే పద్యకవిత్వమనునది మానవుడు సాధించిన ఆనందసిద్ధులలో నొకటి. పద్య గద్య ప్రకృతులు వేఱు. ఇవి యన్నియు సాహిత్య ప్రక్రియలే. అక్కఱనుబట్టి రచయిత తనకు వలయు ప్రక్రియ నెన్నుకొనును. ఒక ప్రక్రియయందలి దురభిమానముతో, తదితర ప్రక్రియలు సమృద్ధిగానున్న సాహిత్యమును సమీక్షించుట తగదు. స్థితగతిచింతనము ముఖ్యము. తనకుకావలసినది, తనకు నచ్చినది సాహిత్యములో లేదే యను పురస్సిద్ధాంతముతో సాహిత్య చిత్రవధకు పూనుట విమర్శకుల లక్షణముగాదు. ఆ పురస్సిద్ధాంతముతోడనే ఈ విమర్శలను ఖండించుటకు కావలసినంత యవకాశ ముండును. పద్య కవిత్వమందలి సొగసులను బంగారయ్యగారు గ్రహించిరో, గ్రహింపగలరో లేరో తెలియదు. గ్రహించినవారి వ్రాతలిట్లుండవనిమాత్రముచెప్పగలము. ప్రజాసాహిత్యము, ప్రజారచనలు అనుమాటల కర్థమేమి? దేశీయములని యర్థము చెప్పుకొనవలయునా? ఆదినుండియు తెలుగువారి ఆవేశోత్సాహములు ప్రతిబింబింపని మార్గకవిత యున్నమాట నిజము. జానపద సాహిత్య మీ కొఱత కొంత తీర్చినది. జానపద సాహిత్యముమీది వలపుతో మార్గ సాహిత్యముపై కత్తులు దూసి దుమికిన ప్రయోజనమేమి? దాని లక్ష్య లక్షణములు వేఱు. దీని లక్ష్య లక్షణములు వేఱు. విమర్శకుడు ఈ రెండిటిని సాంగోపాంగముగా పరిశీలించును. దురభిమాని ఒకదానిని భుజముమీద వేసికొని రెండవ దానిని తిట్టును. ఈ గ్రంథకర్త చేసిన పని యిదే. పారిభాషిక పదములను సృజించి కొనుటలో, అన్య భాషా పదములు స్వీకరించుటలో బంగారయ్యగారు చెప్పిన మాటలు కొన్ని బాగుగా నున్నవి. చదువురానివారు "ఖడ్గము"ను "కడగము"గా పలుకుదురట! "భద్రము"ను "బద్దరము"'గా పలుకుదురట! వీనిని ఒక విధమయిన తద్భవములుగా స్వీకరింపవలయునట! తెలుగునేల నాలుగు చెఱగులనున్నవారు తత్సమముల నొక తీరుగా పలుకుదురనుటకు ప్రమాణమేమి? యథాతథముగా నుచ్చరించువారెందఱో యున్నారు. మాటలు ఏర్పరచుకొను తీరును గూర్చి యీ గ్రంథకర్త చెప్పిన దొక కొంత తప్పే. "University" అను ఆంగ్లపదమునకు "చదువుల నెలవు" అని వాడవలయునట! ఈ మాట మాతృకయొక్క పూర్ణార్థము నిచ్చునా? ఈ సంగతి ఈ గ్రంథకర్త యాలోచింపడు.

తెలుగుమాటయైన చాలును. అదెట్లున్ననేమి? తెలుగువారి దౌర్భాగ్యము కొలది పూర్వకవులు కొందఱు అచ్చ తెలుగు కబ్బము లల్లిరి. వారు బంగారయ్య గారివంటివారి పొగడికలు పొందిరి. ఆ భాష కృత్రిమము. ప్రజల ఆంధ్రభాషాపరిజ్ఞానము పెంచు నట్టిదిగాదు. పారిభాషిక పదముల విషయములో సాధ్య మయినంతవరకు తెలుగు మాటలు వాడుట లెస్స. అవి లేనిచో వాడుకలో నలిగిన, సొగసైన సంస్కృత పదములను స్వీకరింపవచ్చు. లేక సృష్టించి కొనవచ్చు. సాధ్యము కానిచో అన్యభాషా పదమునే యథాతథముగా వాడుకొనవచ్చు. మడులు దడులు కట్టుకొన్నభాష నిలువ యున్న నీటివలె క్రుళ్లిపోవును. అన్యభాషాసంబంధము వలన ఏ భాషకయిన పుష్టి కలుగునేకాని నష్టిరాదు. సంస్కృతమువలన తెలుగు పెరిగినదేకాని విరుగలేదు. సంస్కృతాది భాషలయందలి ధ్వనులు లేక ధ్వని సంకేతములగు అక్షరములు శబ్దములు చేరుటవలన తెలుగునకు నిండుదనమువచ్చి, సూక్ష్మభావచ్ఛాయలను కూడ చెప్పగలిగిన సత్త్వ యేర్పడినది. ఈ రహస్యము గుర్తింపకుండుట బుద్ధిమాంద్యమునకు తార్కాణము. అన్య భాషా పదములను స్వీకరించుటకు కూడ ఒక హద్దుండును. దీనిని మనము మఱవరాదు. అఖండ భాషాసేవ గావించిన తిక్కన సంస్కృతమును గ్రహించియు తెలుగు పలుకుబడిని పెంచెను. కొన్ని వందలతెలుగు మాటల కా సాహితీతపస్వి లక్ష్య వ్యంగ్యార్థములను సృష్టించెను. దేశ కాలములనుటకు మాఱు "నేలప్రొద్దు"లని, చతుష్పాత్తులనుటకుబదులు "నలుగాలియవి" యని ఆయనయు వాడెను. వాడుక, నాడెము,—సొగసు—ఈ మూటిని మఱవక ఏ భాషా పదమును స్వీకరించినను తప్పేమున్నది?

ఈ గ్రంథకర్త గ్రాంథిక వ్యావహారిక భాషా ద్వయములకు వక్రభాష్యము చేసెను. గ్రాంథిక వ్యావ హారిక భాషాద్వయముల సంఘర్షణము సంస్కృ తాంధ్ర భాషల గ్రుద్దులాటయుట! ప్రాచీన కావ్య భాష తెలుగు కాదట! అది నూటికి నూరుపాళ్లు సంస్కృత మట! సంస్కృతమును వ్యతిరేకించుట గిడుగువారి లక్ష్యమట! కాని యీమాట పైకి చెప్పకుండ "ఒక ఎత్తుగడ"తో శిష్ట వ్యావహారికము వ్రాయవలయునని, ఎట్లయిన తెలుగు వ్యాపించి, సంస్కృతము సమసి పోవునని వారు తలంచిరట! ఈ చిదంబర రహస్యము బంగారయ్యగారి కెట్లు తెలిసినది? వారి వ్రాత చూడుడు: "గిడుగువారుగాని, ఆ తరువాత ఒచ్చినవారుగాని సము స్కృతపు మాటలను విడిచి తెలుగు మాటలను వాడ డము, తెలుగు మాటలులేనిచోట కొత్త మాటలను పుట్టించడము ఈ ఎదిరింపును సూచిస్తుంది. తొలి పలుకు,' ముందుమాట, కొన్నుడి, నుడికడలి, నుడి దండ, వాగమి, పండిమి ఇలాగ పుట్టిన మాటలే దానికి రుజువు". "తెలుగునుడిలోనికి అనక్కరగా వాయి వరస లేకుండా దూరి దబాయించుకొని తిరుగుతూ ఉండే సముస్కృతపు మాటలను తీసివేస్తాము అంటే తెలుగునానుడి రంగములో గట్టి పునాదులు వేసుకొని ఉండే సముస్కృతపువాదులు ఒప్పుకోరు. గనుక మంది మాటలాడే నుడిని రాస్తాము అంటారు వ్యావహారికపు వాదులు. ఇది ఒక ఎత్తుగడ" అని బంగారయ్యగారు ప్రవచించుచున్నారు.

శిష్ట వ్యావహారిక భాషావాదులగు గిడుగువారు గాని వారి తరువాత వచ్చినవారుగాని సంస్కృత పద జాలము నుపయోగింపలేదని బంగారయ్యగారు ఋజువు చేయగలరా? గిడుగు మున్నగువారు కోరినది "నుడి కడలి", "నుడిదండ", "వాగమి" వంటి తెలుగునా? అదియే యయినచో అట్టి తెలుగెప్పుడైనను హేయమే. తిరస్కార్యమే. అచ్చ తెలుగు కబ్బములవలన ఎంత మేలు చేకూరినదో, ఇట్టి తెలుగువలన కూడ అంతియే మేలొన గూడును. ఇట్టి తెలుగువలన గిడుగువారు కోరిన ప్రజావిజ్ఞానము పెరుగదు. ఇట్టి మాటల కూర్పు గిడుగువారు పట్టుదలతో పంతముకొఱకు చేసియుండ వచ్చు. దానిని పట్టుకొని ప్రేలాడుట తగదు. గిడుగువారి రచన లిట్టి భాషలోలేవు. వారు కోరిన తెలుగిట్టిది గాదు. 1913 సంవత్సరము ప్రమాదీచ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో గిడుగు రామమూర్తిగారిట్లు వ్రాసిరి.

"......మొదటి తెలుగు కవులు తమ వ్యవ హారములోఉన్న తెలుగుభాషను వ్రాసినారు. వారి తెలుగు కాలక్రమమున మారినది ఎంతో కొంత. దానికిన్ని ఇప్పుడు వాడుకలోనున్న తెలుగుకున్ను భేదము ఉండ బట్టి పాత భాషలో చెప్పిన వాక్యముల అర్థము, ఆ భాష బాగా చదువుకొన్న పండితులకుగాని స్పష్టముగా తెలియడములేదు. పాత భాషలో కల్పించిన వేదములలోని సారము కొత్తసంస్కృతములో భారతరామాయణము లలో వ్రాసి చెప్పినట్లుగా పాత తెలుగులో వ్రాసిన

పుస్తకములలోని విషయములు సర్వసామాన్యముగా తెలిసేటట్టు చేయవలెనంటే కొత్త తెలుగు అనగా ఇప్పుడు వాడుకలో ఉన్న భాషలో తిరిగి చెప్ప వలెనుగదా! కొత్త విద్యలు నేటి తేట తెలుగులో కాగితముమీద వ్రాస్తే సులభముగావా? ఈలాగు చేయ డము అన్ని దేశములలోను అన్ని భాషలలోను జరుగు తున్నది కాదా? పది పదిహేనుమార్లు పాతగిల్లిన ఇంగ్లీషులో క్రీస్తుమత గ్రంథములు మాటి మాటికి కొత్త కొత్త ఇంగ్లీషులో వ్రాస్తున్నారుకారా? మన దేశములోకూడా పూర్వము అదే సంప్రదాయము గదా! ఇందులో వైపరీత్యము ఏమి ఉన్నదని పండితులు రణ గుణ ధ్వని చేసి ఆకాశము బద్దలు కొట్టుతున్నారు''

''....అట్లే భాషలో మనోభావములు వ్యక్త పరచడము కూడాను. ''నాకు ఆకలి వేస్తున్నది'' ''నాకు ఆకలి అవుతున్నది'', ''నాకు ఆకలిగా ఉన్నది'' అనే వాక్యములు వాడుకలో ఉన్నవి. అందరమూ వాడగలము. ''నాకు ఆకలి గదిరినది'' ''నాకు ఆకలి ఒడమినది'' ''నేను క్షుత్పీడితుండను''--అనే వాక్యములు చెవులకు కొత్త. నాకు ఆకలి వేస్తున్నది అనడానికి మారుగా ''నాకు ఆకలి వైచుచున్నది'' అని ప్రయో గించడము హాస్యాస్పదముగా ఉంటుంది. ఏ గ్రంథముల లోనూ అట్టి ప్రయోగములు కనబడవు. అట్టివి కల్పించి వాడినందుచేత నైజధర్మము చెడి భాష కృత్రిమ మయినది అవుతుంది. కర్రబొమ్మకూ జీవముతో ఉన్న మనిషికీ ఎంత భేదమో అంత భేదముంటుంది, అట్టే కృత్రిమ భాషకున్నూ, వాడుకలో ఉన్న భాషకున్నూ. కంటి చూపులో కనబడేటట్లు నోటి మాటలో వినబడవలెను మనోభావము.''

కృత్రిమ గ్రాంథిక భాషనేకాక, కృత్రిమమయిన వ్యావహారిక భాషను చూచియు గిడుగు రామమూర్తి గారు చిట్ట చివరి రోజులలో ఎంతో నొచ్చుకొనినట్లు వారి సమకాలికులగు పండితులు సెలవిచ్చియున్నారు. బంగారయ్యగారి భాషా చాతుర్యము చూచి గిడుగు వారు సంతసింతురో, వంత చెందుదురో వారికే తెలి యును. బంగారయ్యగారు తన యభిప్రాయములను శిష్ట వ్యావహారికవాదుల కారోపించుట తగినపనికాదు.

ఈ గ్రంథకర్త ప్రాచీనకవులపై కొన్ని యభి యోగములు తెచ్చి తిట్టెను. దేశీయేతివృత్తములను స్వీకరింపక, ఆర్యసంస్కృతేతివృత్తములను ప్రాచీనులు గ్రహించిరనునది ఈ యభియోగములలోనొకటి. కవిత్రయమువారు భారతమువ్రాయుట, బుద్ధరాజాదులు రామాయణము వ్రాయుట, పోతనాదులు భాగవతము వ్రాయుట బంగారయ్యగారి ప్రకార మొకగొప్ప నేరమి. భారత రామయణాదులు ఆర్యులవి కావచ్చు. ఐననేమి? వానిలో మహా మానవ జీవితము నందలి ప్రతిసూక్ష్మాంశము చిత్రితమయినది. మానవ జీవన రహస్యములను విడమఱచిచెప్పిన వ్యాసవాల్మీకుల కైవాడమును తెలుగు వారికందిచ్చిన మహాత్ముల ఋణము తీర్చుటకు ఎన్నిజన్మలెత్త వలయును? క్షుద్ర చారిత్రక సిద్ధాంతముల జోలియేల? బంగారయ్యగారు ఎఱ్ఱనమాటలు విన్నారా?''గానటబీనచే చదివి గాథలు త్రవ్వు తెలుంగు వారికిన్ వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లము సేసిన'' వారు నన్నయ తిక్కనలు. ''బ్రహ్మపదా పతీర్ణ కవితా లీలావతీ వల్లభు'' డయిన వాల్మీకిని తెలుగువారి కెఱుకపఱచి తెలుగునాట వెలసిన కథల తీరునే రామాయణమునందు చూపించిన వాడు కోన బుద్ధభూపతి. ద్రావిడజాతి చరిత్రలను ప్రాచీనులు గానము చేయని మాట నిజమే. వారి యభి రుచి వారిది. మన యభిరుచి వారికెట్లు తెలియును? ఇరువదవ శతాబ్దమువేఱు. ప్రాచీన కాలమువేఱు. ఆర్యసంస్కృతిని పాడియు తెలుగును పెంచినవారు వారు. ద్రావిడ సంస్కృతిని పాడుచు తెలుగును పెంచలేనివారము మనము. తిక్కన క్షేత్రయ్య అన్నమా చార్యులు చేసిన పని ఈ ద్రావిడ గోత్రోద్ధారకులు చేయ గల్గిరా? చేయగలరా? చేయగలనను బంగా రయ్యగారి భాష యెట్లు సిద్ధమయినదో యీ గ్రంథమే సాక్ష్యము. ప్రాచీనులు తెలుగును సంస్కృతమయము చేసిరనునది రెండవయభియోగము. ఇది కొంతవఱకు నిజము. ఉత్తమ కవులని మనమను కొనువారు తమనాటి తెనుగును ఎంత గ్రంథస్థము చేసిరో వారి కావ్యములే సాక్ష్యములు. ప్రాచీనులు పాడినదే పాడినమాట కూడ నిజమే.

బంగారయ్యగారు భవి కవులను నిందించుటతో పాటు శివకవులను ఆకాశమున కెత్తిరి. శివ కవులు దేశికవితకు జీవగఱ్ఱలై నిలిచినమాట నిజమే. వారి కవితలో తెలుగుపలుకు చిందుద్రొక్కినమాట నిజమే. వారిగ్రంథములలో మత ప్రచారము ప్రధానము.

ఆ ప్రచారమునకు అంగమయినట్టిది, భాషోద్యమము. ఈ విషయము మనము విస్మరింపరాదు. భవికవుల వలెనే శివకవులు పాడినదానినేపాడిరి. పద్యకావ్యములను ద్విపదకావ్యములు చేసిరి. ద్విపద కావ్యములను పద్య కావ్యములు చేసిరి. వారిని నడపించినది మతావేశము. అందువలననే వారి గ్రంథములు అట్లయినవి. పాల్కురికి సోమనాథుని గ్రంథములలో భవికవులు వాడిన సంస్కృతమువంటి సంస్కృతము చాల హెచ్చుగానున్నది. బంగారయ్యగారు బసవపురాణ పండితారాధ్య చరిత్రములను మరొకసారి చదువు దురుగాక! శివకవుల కథలు ప్రజాకథలని బంగారయ్య గారనుచున్నారు. నన్నెచోడని కుమార సంభవము నందలి కథ ప్రజాకథ యెట్లయినదో తెలియదు. శైవులైన నన్నయాదులు వైష్ణవ గ్రంథములు రచించి, శైవముమీద దాడి చేయగా పాల్కురికి సోమనాథుడు మున్నగువారు ముప్పును గుర్తించి శైవకథలను స్వీకరించి "అమ్మమతము" లేక శైవమును ఉద్ధరించిరట! దీనినిజూచి భవికవులు హరి హరా భేదమును ప్రతిపాదించిరట! ఇట్టివారెంతమంది యున్నారు.? బంగారయ్యగారి తీర్పులిట్లుండును. ఈ తీర్పులకు హేతువొకటే. ఇప్పటి రాగద్వేషములతో ప్రాచీన సాహిత్యమును పఠించుట. అట్లుగాకుండ రసప్రధానమయినసాహిత్యముగా ప్రాచీనసాహిత్యమును పఠించుట నేర్చికొని యున్నచో ఈ గ్రంథకర్త గారిట్టి యాట యాడరు. అప్పుడు శివకవుల స్థానమెట్టిదో వారికి స్పష్టముగా గోచరించును. పాల్కురికి సోమనాథుని కవితాకళ యెట్టిది? శివ కవుల కవితాకళ భవికవుల కవితాకళను మించలేదు. మించినదన్న వారికి నలువదియేండ్ల క్రిందటనే సమాధానము చెప్పబడినది. శివకవులు గొప్ప వారని మన మనుకొనుటకు కారణము వారి కవితా కళకాదు. మఱి వారి మతావేశము, ద్విపద ఛ్ఛందో స్వీకారము మాత్రమే. ఆ మతావేశము వైదిక మత మునకు సంబంధించినంతవఱకు వీరికి నచ్చినది. శివకవులు జైన బౌద్ధములను తిట్టిరనుమాట వీరు మఱతురు. వైదిక బ్రాహ్మణ నిందయున్నది గదా! కావలసినదదే. పాల్కురికి సోమనాథాదుల కవితాకళ యుత్తమోత్తమమనగా అనంతకృష్ణ శర్మగారనినట్లుమనరసానుభవదృష్టి యెక్కవలసినమెట్లు ఇంక కొన్నియున్నవన్నమాట. శివకవుల గ్రంథములలో ప్రతిపాదింపబడిన సిద్ధాంతములు మానవునకు, సంఘమునకు, జాతికి శాంతిని ప్రసాదించుననుట కల్ల. నేడు శివకవులను ఆకాశమున కెత్తుటయొక "ఫాషన్"అయినది.

బంగారయ్యగారి తెలుగువలపు మెచ్చుకొన దగ్గది. కాని వారివ్రాతలు, ఆ వ్రాతలతీరు సహేతుకములు గావు. భాషాజ్ఞానమును పెంచునట్టివిగావు. మఱి జ్ఞానార్జనమునకు ప్రతిబంధకములగునట్టివి. ఈనాడు జరుగ వలసినదొక్కటే. తెలుగునాటనున్న మాండలిక పద భేదములను గుర్తించి కోశములను సిద్ధముచేయవలె. వృత్తిపదకోశములను సమగ్రముగా నిర్మింపవలె. ఆంధ్రదేశమునందలి సర్వవర్ణముల వారి పలుకుబడిని లెస్సగా గుర్తింపవలె.పదబంధములను, జాతీయములను ప్రోగుచేయవలె. ఇట్లు చేయుటకు ముందంజ వేయవలసినవారు రచయితలు. రచయితలు తాముపుట్టి పెరిగిన యిండ్లయందలి, పల్లెలయందలి తెలుగు నుడికారమును వాడుటకు పూనుకొనవలె. విద్యార్థులకు తెలుగు తీరు తెన్నులను తెల్లముచేయు మేలిపలుకులను మప్పవలె. ప్రభుత్వము, విశ్వకళా పరిషత్తులు, రచయితలు తెలుగు నుడికారమును కాపాడబూనినచో ఈపని యేమంత బరువయినదిగాదు.

—"శాక్యసింహ"

## భానుమతి కథానికలు

[రచన : భానుమతీ రామకృష్ణ. ప్రచురణ : యం. శేషాచలం అండ్ కో. పుటలు : 184. వెల : రూ. 2/-. ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రి బ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్.]

"ఒకరకం రచయిత, తన రచనలన్నిటిలోనూ మిలమిల మెరులుతూ కనిపిస్తాడు....మరొరకం రచ యిత ఆనమాలయినా తెలీకుండా తన రచనమాటున మరుగుపడిపోతాడు ..... భానుమతీ రామకృష్ణగారు మొదటితరహా రచయిత్రి. ఆవిడ రాసిన ప్రతీవాక్యం లోనూ ఆవిడ కనుపిస్తుంది" అన్నారు ఈ కథలకు 'పరిచయం' వ్రాసిన పాలగుమ్మి పద్మరాజుగారు. కథలు చదివినవారు ఈ సూత్రీకరణం సరియైనదని అంగీకరించకతప్పదు. కథలన్నింటిలోనూ రచయిత్రి 'మిల మిల మెరులుతూ' కనిపించడమే ఈ కథల ఆకర్షణ, ఈ కథల బలహీనతకూడా! రచయిత్రి

శైలిమీద ఆమె వ్యక్తిత్వపుముద్ర సర్వత్ర ఉన్నదనటంలో సందేహంలేదు. హాస్యం అపహాస్యం, చమత్కారం, చిలిపితనం కథా కథనంయొక్క ముఖ్య లక్షణాలు. కాని కేవలం శైలి, కథా కథనం ఉత్తమ సాహిత్యపు విలువలుకావు. "నిజానికి భానుమతీరామకృష్ణ గారి ప్రతిభ కథాకల్పనలోకాదు. పాత్ర చిత్రణలో పరాకాష్టనందుకుంది" అన్న పద్మరాజుగారి అభిప్రాయంతో ఏకీభవించడం మాత్రం సులువైన పనికాదు. పాత్రలు కార్టూన్‌బొమ్మలస్థాయిలోతప్ప పద్మరాజు గా రన్నట్లు 'ప్రాణంతో రక్తమాంసాలతో కదిలే మనుషులు'గా మాత్రంలేరు! అందుకుకారణం రచయిత్రికి తను చిత్రిస్తున్న పాత్రలతో తాదాత్మ్యంగాని, సానుభూతిగాని లేకపోవడం. తను చిత్రించే పాత్రలకు ఎడంగా నిల్చుని నవ్వే రచయిత సాధించగలిగేది కార్టూన్ బొమ్మలుమాత్రమే! కార్టూన్‌లు వేయడం కళకాదని ఎవరూ అనరు. దానికీ మరో రకం చిత్రకళకూ భేదం గుర్తించడం ముఖ్యమని మనవి.

'జీవితంలోని అగాధాలు' అనే కథలో రాంబాబు పట్ల తన కెంతో సానుభూతీ, అభిమానం ఉన్నదని రచయిత్రి కథ ముగింపులో ప్రకటించినా కథలో మాత్రం రాంబాబు సాంసారికజీవితాన్నిచూచి నవ్వటమే—సుతారంగా నవ్వటమే ఉన్నది. రాంబాబు భార్య హేమకు ఫిట్స్ వచ్చింది—అదొకరకం ఉన్మాదం, మతిమరుపు, శైశవావస్థకు వెళ్లిపోవటం (regression to childhood). మొదటిసారి చూచేవాళ్లకు చిత్రంగానేకాదు, నవ్వుతాలుగాకూడా ఉంటుంది. సానుభూతితో చిత్తశుద్ధితో సంయమనంతో చిత్రిస్తేతప్ప అందులోని విషాదాన్ని అభివ్యక్తం చెయ్యటం జరగదు. ఆ ఉన్మాదావస్థ తాలూకు శాస్త్రపరిజ్ఞానం లేకపోయినా, చూచినది చూచినట్లు వస్తుగౌరవంతో చెప్పినా, సఫలత పొందవచ్చు. కాని చిలవలూ, పలవలూ పెట్టడం ప్రారంభించగానే 'కార్టూన్ కళ' తయారౌతుంది. ఉదాహరణకు—హేమ ఫిట్స్‌లో చేసినవన్నీ వర్ణిస్తూ, ఒకపట్టున: "హేమ కళ్లు తెరిచి, రాంబాబు తనపక్క లేకపోవడంచూచి 'ఏయ్ దొంగా! నన్ను ఒంటిగా విడిచిపెట్టి వెళ్లిపోయావా?.....చూడండి, ఎప్పుడూ యింతే! పోయిన సారి ఫిట్స్ వచ్చినప్పుడుకూడా నన్నువదిలిపెట్టి వెళ్లిపోయాడు చూడండీ!' అని ఎదురుగా నుంచున్న మావారితో కంప్లెయింట్ చేసింది హేమ...... 'మరి పోయినసారి ఫిట్స్‌వచ్చినప్పుడంటోందే, యిప్పుడు తను ఫిట్స్‌లో వుందని తెలుసా?' అని అడిగారు మావారు. 'అబ్బే, అదంతా ఫిట్స్‌లో భాషే. ఫిట్స్ వచ్చిపోయాక తెలుస్తుంది తనకి ఫిట్స్ వచ్చిందని' అన్నాడు రాంబాబు......" ఈ సన్నివేశాన్నిగూర్చి పాఠకులు ఏమనుకోవాలి? ఫిట్స్‌లోవున్న మనిషికి తనకు ఫిట్స్ వచ్చినట్లు తెలీదు కాబట్టి హేమ అలా అనటం వల్ల ఆమె ఫిట్స్ పూర్తిగా మొదట్నుంచీ నటనే అయి ఉండాలి. లేదా కనీసం ఫిట్స్‌నుంచి తెలివివచ్చినా ఇంకా ఫిట్స్‌లో ఉన్నట్టే నటిస్తూనైనా ఉండాలి, అనే అభిప్రాయం కలుగుతుంది. అంతటితో కథంతా ఫార్సుగా తేలిపోతుంది! నిజానికి రచయిత్రి ఒక విశేషమైన ఉన్మాదావస్థనే వర్ణిస్తోంది. తెలిసినవారికి హేమకు వచ్చిన ఫిట్స్ అసంభావ్యంగా కనిపించదు. ఎటొచ్చీ పైన పేర్కొన్న హేమమాటలుమాత్రము అసంభావ్యమే! అంటే, రచయిత్రి అసలు ఉదంతానికి చిలవలూ పలవలూ పెట్టడంలో, హాస్యంకోసం, అతికించిన కల్పనయిది అని అర్థమౌతుంది! ఈ కల్పనవల్ల రచయిత్రిదృష్టి కేవలం హాస్యదృష్టి అనీ, ఆమె ప్రకటిస్తున్న సానుభూతి నిజంకాదనీకూడా స్పష్టమౌతుంది! పర్యవసానం 'జీవితంలోని అగాధాలు' అనే కథ, చక్కని సాహిత్యరచనగా రూపొందవలసినట్టిది, 'neither fish nor flesh' గా వ్యర్థం కావటం; లయతప్పిన సంగీతంలాగా అసంతృప్తి కలిగించటం!

పై నిరూపించిన దోషం—చిత్రించే వస్తువు మీద గౌరవంలేకుండా యిష్టంవచ్చిన కల్పనలని అతికించటం, ఒక్కొక్కసారి స్వోత్కర్ష కారణంగా అతిశయోక్తులతో పాత్రలను కించపరచటం, హేళన చెయ్యటం—ఈ సంపుటిలోని కథలన్నింటిలోనూ పాత్ర చిత్రణలో గోచరిస్తోంది. 'మెకానిక్' కథలోని మేష్టారు ఒక ఉదాహరణ. 'మావాడికి చదువు చెప్పడమే పరమార్థంగా భావించే' మాస్టారు 'ఒక్కోసారి ఉన్నట్లుండి రాత్రి పదకొండుగంటలకు సైకిలేసు కొచ్చేవాడు'..... 'మావాడు పరీక్షకెళ్లి వ్రాసే సమయంలో.... మాస్టారు తన క్లాసురూములో పిల్లలకి పాఠాలు చెబుతూచెబుతూనే మావాడు ఏం అన్సరు వ్రాస్తుంటాడో, అది ఫలానా అయివుంటుందనుకుని

'అంతే! అదేవ్రాయి నాయనా!' అనుకునేవాట్ట.... సంతోషంతో పైకి అనేసేవాట్ట.....చుట్టూవున్న పిల్లల్నిచూసి తమాయించుకునేవాట్ట .....' అతిశయోక్తులకూ హద్దువుండాలి! అంత మంచి మేస్టారునీ శేఖర్, ప్రభావతి అనేపిల్లలు హింసించి పిచ్చెత్తేలా చేసిన వైనం చూస్తూ రచయిత్రి రసవత్తరంగా, మంచి అభిరుచితో (With relish) వర్ణిస్తుంది. చివరకు "మావాడువెళ్లి మాస్టార్ని చూచివచ్చాడు: 'నువ్వు రోజూవచ్చి చూచిపోతూంటే నేను తప్పకుండా మామూలు మనిషిని అవుతాను నాయనా' అన్నాట్ట మేష్టారు!"—అలా మాస్టారుకు గుడ్‌బై చెప్పటం జరిగింది! చెప్పదలచుకున్న అసలుసంగతి శేఖర్‌కు మెకానిక్స్‌లోవున్న అభిరుచి చదువులోలేదని!—కాని కథంతా మేస్టారు రచయిత్రి కుమారుణ్ణి తలచుకుని పడ్డ 'విరహవేదన'ని గురించే; అందులో శేఖర్‌రాక్షసుడు పెట్టిన బాధకూడా ఒకభాగంగా సాగింది! సాహిత్యపరంగా లక్ష్యసాధన మాత్రం జరగలేదు. 'ఎందుకులెండి' అనే కథ రచయిత్రి భర్తగారి గొప్పదనాన్నిగూర్చి—'పొగాకు సంచులు, పైపు, పర్సు వగైరా సరంజామా అంతా పాంటుజేబులో పట్టవు గనుక ఒక కుర్రాణ్ణి పెట్టారు, ఆపైపు సామాన్లు, వారితో కూడా ఉండి, మోసుకు తిరిగేందుకు.....' 'రోడ్‌రోలర్', 'కృత్యాద్యవస్థ', 'రంభా చక్రపాణీయం' లావుపాటి ఆడవాళ్లను అపహాస్యంచేసే కథలు. రచయిత్రి ప్రతిభ హాస్యంలో అపహాస్యంలో రాణిస్తుందనటంలో సందేహంలేదు; అందుకు చక్కని తార్కాణ 'పెద్ద ఆకారాలూ, చిన్న వికారాలూ' అనే కథ—చెప్పదలచుకున్నదీ చెప్పినదీ ఒకటై రచయిత్రి విజయం సాధించిన చెప్పుకోదగ్గ కథ. 'లోభి హృదయం' అనే కథ, పద్మరాజుగారికి నచ్చలేదు. నాకు నచ్చుతోంది—కాని ముగింపుపేరాలో మళ్లీ అతిశయమైన కల్పన ఒకటి తలెత్తింది. ఆ చివరిపేరా తీసివేస్తే ఆ కథ ఎంతో చక్కగాఉంటుంది. కథలో హృదయంలేని చమత్కారము, ఎబ్బెట్టుగావుండే స్వోత్కర్ష బదులు చక్కని భావన స్ఫురిస్తోంది. 'పతిత' అనే కథనుగూర్చి అలా చెప్పటానికి వీల్లేదు; అది సంపుటిలోని కథలన్నింటిలోనూ బలహీనమైన రచన.

పై సమీక్ష భానుమతీ రామకృష్ణగారి కథలకున్న సాహిత్యపు విలువను (literary value) గురించి. పోతే, లోతుగా ఆలోచించటం, పరిశీలించటం మాని తాత్కాలికమైన ఆహ్లాదాన్ని విలువగా (entertainment value) తీసుకొని చూచినట్లయితే ఈ కథలు ఆ రకంలో ప్రథమశ్రేణిలోకి వస్తాయి. అందుకు కారణం రచయిత్రి వ్యక్తిత్వం రచనలోకూడా, వెండితెరమీదలాగే, 'మిలమిల మెరులుతూ' కనిపించడం!

## ఇండియన్ లిటరేచర్

[భారతీయ సాహిత్య పత్రిక సంచికలు: సంపుటి VII సంచిక 2, 1964. సంపుటి VIII సంచిక 1, 1965. ప్రచురణ : సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ]

కేంద్ర సాహిత్య అకాడెమీవారు ఏడాదికి రెండుసార్లు ఆంగ్లంలో 'భారతీయ సాహిత్యం' అనుపేర ప్రచురిస్తున్న పత్రిక తాలూకు రెండు సంచికలివి. 1964 సంవత్సరపు సంచికలో భారతీయ భాషల్లో 1963 లో జరిగిన సాహిత్య వికాసాన్నిగూర్చి విమర్శనాత్మక నివేదికలు ఉన్నాయి. అదనంగా ఉన్న అంశాల్లో తెలుగువారికి ఆసక్తి కలిగించేవి రెండు వ్యాసాలు : వి. ఆర్. నార్ల వ్రాసిన "తెలుగు గ్రాంథిక వ్యావహారిక భాషలు"; డి. ఆంజనేయులు వ్రాసిన "నేటి తెలుగు దేశాన్ని చిత్రించే ఒక నవల." విద్యా సంస్థల్లో భాష గ్రాంథికంగానే ఉండటంవల్ల నేటి తెలుగురచయిత పడుతున్న యిబ్బందిని వివరిస్తూ నార్లవారు యిలా అన్నారు: "On leaving their Schools and Colleges, they have to make an arduous effort to unlearn all that they had learnt through-out their formative years....one of the primary causes that is inhibiting the more rapid growth of modern Telugu literature

is the initial handicap with which every young writer has to start as a direct consequence of the wrong sort of language text-books forced on him." విద్యార్థిగా కృతక మైన భాషనూ, శైలినీ అలవరచుకున్న తర్వాత జీవద్భాషను వ్రాయడం సులువుగారాదు. ఇది యువ రచయితల ఉపజ్ఞకు పెద్ద అవరోధంగా ఉంటున్నది అనే యీ విమర్శ నలుగురూ చర్చించదగినది. ఈ వ్యాసం ఆలోచన రేకెత్తించేదిగా ఉన్నది. ఆంజనే యులుగారు వ్రాసిన వ్యాసం గోపీచంద్ 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' నవలనుగూర్చి — పాము చావకుండా బడితె విరక్కుండా, శుష్కప్రియాలూ, శూన్యహస్తాలూ వతుగా—పూర్తిగా Cliches తో తయారైంది. నవలపేరు బంకిమ్‌చంద్ర ఛటర్జీ 'కృష్ణకాంతుని వీలునామా' వల్ల స్ఫురించి వుంటుం దట! "The women are seen in a brighter light—as in the novels of Sarat Chandra Chatterji". ఈ నవలలో స్త్రీపాత్రలకీ, శరత్ స్త్రీపాత్రలకీ ఏమిటో ఆ పోలిక! దీన్నిబట్టే వూహించుకోవచ్చు విమర్శవిలువ!

1965 సంవత్సరపు సంచికలో నాలుగు ప్రసంగ వ్యాసాలు షేక్స్‌పియర్‌నుగూర్చి ఉన్నాయి. అందులో రెండు—శామ్‌లాల్, ఆర్. కె. నారాయణ్ వ్రాసినవి, చక్కని ఇంగ్లీషులో కవి హృదయాన్ని అర్థం చేసుకున్న విమర్శలుగా రూపొందాయి. ముజీబ్‌గారికి జలాలుద్దీన్ రూమీ కవిత్వంనుంచీ షేక్స్‌పియర్ కవిత్వానికి రావడం స్వర్గాన్నుంచీ భూమిమీదికి వచ్చి నట్లుండటమేకాక, మళ్లీ తిరిగివెళ్లే అవకాశం లేదనే నిస్పృహకూడా కలుగుతుందట! నార్లవారికి షేక్స్ పియర్ అంటే గౌరవమేకాని భయంకూడా ఎక్కు వట! పోతే ముల్క్‌రాజ్ ఆనంద్, ఉమాశంకర్‌జోషీ భారతీయ భాషల్లో ఆధునిక నవలనుగూర్చి కొన్ని ఆసక్తి కలిగించే విషయాలు వ్రాశారు. ముల్క్‌రాజ్ ఆనంద్ దృక్పథంలో మార్క్సిజమ్ పరిధిని దాటలేని అశక్తత గోచరిస్తుంది. జోషీ బెంగాలీ, హిందీ, గుజ రాతీ, మరాఠీ భాషలనుంచీ ఒక్కొక్క భాషనుంచీ ఒక ఆధునిక నవలను తీసుకుని వస్తువునీ, దృక్పథాన్నీ సమీక్షించారు. నేటి నవలారచయిత అన్వేషిస్తున్న 'భారతీయత'కు పరమావధి మానవజీవిత పరమా ర్థమేతప్ప వేరుకాదని చెబుతూ వ్యాసం ముగించారు. "As...he makes his region reflect the Central agony of the times, his quest for India will also be the quest for the meaning of human existence."

లోకనాథ్‌భట్టాచార్య వ్యాసం: "నేటి వంగ కవిత్వంలో ఫ్రెంచి కవిత్వ ప్రభావం" ద్వారా రవీంద్రుని తర్వాత వంగభాషలో కవిత్వం త్రొక్కిన కొత్తదారుల్ని గూర్చి తెలుసుకోవచ్చు. అలాగే తమిళంలో వ్యావహారిక గ్రాంథిక భాషలమధ్య సమస్య తెలుగులోకంటె తీవ్ర తరంగా ఉన్నట్లు ఎమ్. వరదరాజన్ వ్రాసిన వ్యాసం ద్వారా అవగతమౌతుంది.

ఈ పత్రికలో వ్రాస్తున్న వ్యాసకర్తల ఇంగ్లీషు ఒక స్థాయిలోలేదు. స్థాయిమాట ఎలావున్నా సాధ్య మైనంతవరకు వ్యాకరణదోషాలనైనా సంపాదకవర్గం వారు సవరించివుంటే బాగుండేది. ఏమైనా ఈపత్రిక భారతీయ భాషా సాహిత్యాలమధ్య పరస్పరతను పెంపొం దించటంలో విశిష్టమైన పాత్రను నిర్వహించగలదు.

—ఆర్. ఎస్.

## ఉత్తరభారత సాహిత్యములు

(ప్రచురణ : ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, హైదరాబాదు. మూల్యము : రూ. 4—50.)

దేశభాషల సాహిత్య చరిత్రలను సంగ్రహముగా ఆంధ్ర పాఠక లోకానికి పరిచయం చేయవలెననే ఉద్దే శంతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు మొదట "దక్షిణభారత సాహిత్యములు" అనే సంపుటిని ప్రక టించారు. అందులో తమిళ, కన్నడ, మళయాళ, మహా రాష్ట్ర (మరాఠీ) సాహిత్య సంగ్రహములు చేర్చినారు. తెలుగుకూడా దక్షిణ భారత భాషయే. కాని తెలుగు సాహిత్య సంగ్రహము అందులో లేదు. అక్కర లేదను కున్నారో ఏమో. లేక తెలుగు సాహిత్య చరిత్రను విడిగా విపులంగా ప్రచురించదలచుకున్నారేమో! "ఉత్తర భారత సాహిత్యములు" అనే ప్రస్తుత సంపు టిలో వంగ, ఓఢ్ర, పంజాబీ, కాశ్మీరీ సాహిత్య చరిత్ర లను క్రోడీకరించి ప్రకటించారు. మరి ఉత్తర భారత భాషలలో హిందీ, ఉర్దూ, గుజరాతీ, సింధీ, అస్సామీలుకూడా ఉన్నాయి. వాటి సాహిత్య సంగ్ర హములను ఏ పేరుతో ప్రకటిస్తారో తెలియదు. ఆ సంపుటాలనుకూడా త్వరలోనే ప్రకటిస్తామని

వాగ్దానం చేశారు. "ఈ గ్రంథమును వ్రాయించు నప్పుడు ఆయా భాషలలో మంచి పరిచయము కలిగినవారికి ఈ సాహిత్య చరిత్రల రచనను అప్పగించవలెనని నిర్ణయించినాము" అని అకాడమీ కార్యదర్శి వారి తొలిపలుకులో చెప్పిఉన్నారు. అట్లా మంచి పరిచయము గలవారిలో—వంగ సాహిత్య చరిత్రను గూర్చి శ్రీ పురిపండా అప్పలస్వామి, ఒరియా సాహిత్యమునుగూర్చి శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు వ్రాశారు. పంజాబీ సాహిత్యమునుగూర్చి శ్రీ మోహన్ సింగ్ వ్రాసిన వ్యాసమును శ్రీ గడియారం రామకృష్ణశర్మ అనువదించారు. శ్రీ జె. ఎల్. కౌల్ వ్రాసిన కాశ్మీరీ సాహిత్య సంగ్రహమును శ్రీ కె. గోపాల కృష్ణారావు తెనిగించారు. మొత్తం 344 పేజీల సంపుటిలో ఒక్క వంగ సాహిత్య చరిత్రే సగానికి పైగా—అంటే 174 పేజీలు ఆక్రమించింది.

వంగ సాహిత్య చరిత్రను రచయిత చర్యా పదాల నుండి ఆరంభించారు. అంతకుపూర్వం వంగదేశంలో సాహిత్యరంగం ఏమిటో చెప్పలేదు. బౌద్ధమత శాఖయైన సహజయానానికి చెందిన పదాలే చర్యా పదాలు అన్నారు. ఇందువల్ల దీనిని బౌద్ధ సాహిత్యమని ఎవరైనా అనుకోవచ్చు. కాని, వాటిని కేవలం బౌద్ధ తాంత్రికులే రచించలేదనీ, బౌద్ధులు కానివారి చర్యలు కూడా కొన్ని పదాలలో ఉన్నవనీ బెంగాలీ సాహిత్య చరిత్రకారుడు డా. సుకుమార్ సెన్ అన్నారు. వైష్ణవ సాహిత్యాన్నిగూర్చి, అనువాద సాహిత్యాన్నిగూర్చి తగు భోగట్టా ఇచ్చారు. వైష్ణవ కవితల వైశిష్ట్యాన్ని పరామర్శించలేదు. ఉదహరించిన కావ్య ఖండికలను బట్టి వాటికి దిగువ యిచ్చిన అనువాదాలను బట్టి ఆ కవితల మాధుర్యాన్ని పాఠకులు గ్రహించగలుగుతారు. రామాయణ, భారత, భాగవతములకు బెంగాలీలో ఉన్న అనువాదాలనుగూర్చి, వాటి కవులనుగూర్చి సుదీర్ఘమైన జాబితాలిచ్చారు. బెంగాలీ రామాయణాలనుగూర్చి వ్రాస్తూ "తెలుగు రామాయణం వలె ఇంకొకరు అర్థం చెప్పవలసిన అవసర ముండదు" అని వ్రాశారు. తెలుగులో ఏ రామాయణం ? చెప్పలేదు. ఇలాంటి పరనిందలు అసందర్భమైనవి; అప్రస్తుతమైనవి. బెంగాలీ ఆధునిక సాహిత్యాన్ని రామమోహనరాయ్ ప్రస్తావనతో ఆరంభించారు. బంకించంద్రుని జనన మరణముల తేదీలు అచ్చు తప్పో ఏమో భిన్నంగా పడ్డాయి. రవీంద్రుని సంక్షిప్త జీవిత చరిత్రనే ఇచ్చారా అన్నట్లు తన బాల్యమునుగూర్చి ఆ మహాకవి వ్రాసుకున్న పేరాలను యథాతథంగా పేర్కొన్నారు. ఉత్ప్రేక్షను వాడడంలో రవీంద్రునిది కాళిదాసు, బాణభట్టుల కంటె పైచేయి అన్నారు ! కాని కాళిదాసును గూర్చి టాగూరు ఏమని వ్రాశాడో ఆలోచింపలేదు. మైకేల్ మధుసూదన దత్తు, టాగూరు, ద్విజేంద్రలాల్‌రాయ్‌ల నాటకాల స్థాయినిగూర్చి చర్చింపనేలేదు. వాని నాటకీయత, రచన మున్నగు వాటి పరామర్శ లేదు. వారు వ్రాసిన నాటకాలు, వాటి తేదీలు యిచ్చారు. దత్తు వ్యక్తిత్వాన్ని గూర్చి విశదంగా వ్రాశారు. మన తెలుగు కవిరాజు త్రిపురనేని రామస్వామి వంటి వ్యక్తి ఆయన, తిరుగుబాటులో రచనా పాటవంలో. సూతపురాణానికీ, మేఘనాథ వధకూ కొన్ని పోలికలున్నాయి. బంకిం నవలలను ప్రణయసంబంధమైనవీ, దేశాభిమానోద్దీపకమైనవీ అని చెప్పి ఆ విభజన ప్రకారం వాటినిగూర్చి కొంత చర్చ చేసిఉంటే బాగుండేది. భారతీయ నవలకు బంకిం జనకుడు. బంకిం, రవీంద్ర, శరత్‌బాబుల నవలల స్వరూప స్వభావాలనుగూర్చి చిన్న పేరాలోనైనా తులనాత్మక పరిశీలన జరిపి ఉంటే ఈ సంగ్రహానికి మరింత సాహిత్య స్థాయి చేకూరేది. భారతీయ నవలా సాహిత్యంపై ఆ ముగ్గురి ప్రభావమూ ఉంది. రవీంద్రుని 'శేషేర్ కవిత' నవలను 'రొమాంటిక్ నవల' అన్నారు. అంటే ? వివరణ లేదు. కవితకు దగ్గరగా వచ్చిన నవల అది. ప్రేమ కథయే—కాని ప్రేమాయణాలను తుదముట్టించేది. భారతీయ కథానికకు బెంగాలీ చిన్నకథ చేసిన దోహదమేమిటో ఇందులో తెలుపలేదు. ఇక రచన విషయం. "బాంగ్లా కావ్య కాననంలో తొలి తలుపులు తీసిన మాలి" అంటూ దత్తును గూర్చి వ్రాశారు. (114 పుట.) కాననమేమిటి ? తలుపు లేమిటి ? మాలి ఏమిటి ? బెంగాలీ చెప్పవలసి వచ్చినప్పుడు కొందరు ఆ బెంగాలీ పదాల ప్రవాహంలో పడిపోయి వాటిని యథాతథంగా ప్రయోగిస్తూ తమ భాషలో వాటిని ఏమంటారో మరచిపోతారు. ఈ రచయిత చాలావరకు మంచి అనువాదాలే ఇచ్చారు. తెలుగు పోకడలోనే రచన చేశారు. కాని కొన్ని బెంగాలీ పదాలను యథాతథంగా వాడేశారు. బెంగాలీలో 'విధి' అని ఉంటే అలాగే వ్రాశారు. విధాత అని వ్రాయాలి. 'చిరకుమారి' అని వ్రాశారు. బ్రహ్మచారిణి అన్నమాట. "సర్వస్వధ్యం" (సరబసధన) "అసీమ నీరదం" "యౌవనధర్మి", "తృష్ణార్తాకులుడు",

"ఆదేశమాలన", "మర్మాంతికమైన వేదన" వంటివి తెలుగు ప్రయోగాలైపొయ్యాయి వీరిరచనలో. ఒకచోట విద్రోహకవి అన్నారు. అంటే విప్లవకవి అని మనం అర్థం చేసుకోవాలి. Blank verse ను బెంగాలీలో అమిత్రాక్షరి అంటారట. అలాగే వ్రాశారు. అంటే వచన పద్యాలని గ్రహించాలి. "ఉదయం చీపురు నడవదు", "అతని కలం ఆశ్చర్యమైంది" వంటి వాక్యాలున్నాయి.

ఒరియా సాహిత్యచరిత్ర 56 పేజీలు. ఇందులో ఒరియా భాషనుగూర్చి, దేశమునుగూర్చి, సంస్కృతిని గూర్చి హెచ్చుగా చెప్పబడి ఉన్నది. వ్రాసినంత మేరకు సాహిత్య చరిత్రను నిర్దుష్టంగా, వివాదానికి ఆస్కారం లేకుండా వ్రాశారు. చైతన్యమతంవల్ల ఒరిస్సా ఛిన్నాభిన్నమైందన్న చరిత్రకారుల అభిప్రాయం ఉదహరించారు కాని ఏవిధంగా అది జరిగిందో, తమ అభిప్రాయమేమిటో తెలుపలేదు. ఫకీర్ మోహన్ సేనాపతి జననం 1848 అన్నారు. కాని భారత సాహిత్య అకాడమీ గ్రంథంలో 1843 అని తెలుపబడింది. ఒరియా నాటక సాహిత్యమునుగూర్చి తగినంత వ్రాయనేలేదు. చెప్పుకోదగ్గ ఒరియా నాటకమే లేదన్నారు. అంటూ కాళీచరణ పట్నాయక్ మేటి నాటక కర్త అన్నారు. ఇతర వచన సాహిత్యం ప్రస్తావనే లేదు. ఒరియా కవులను వారి కావ్యములను తెలుగు కవులతో, కావ్యములతో పోల్చి చెప్పడం ఈ సంగ్రహంలోని ఒక సుగుణం. ఒరియా కవితలకు ఛందోబద్ధమైన చక్కని తెలుగు అనువాదాలిచ్చారు.

పంజాబీ సాహిత్య సంగ్రహము 42 పుటలు. ఇందులో పంజాబులో చారిత్రకంగా కలిగిన పరిణామాలనూ, సూఫీ మతం పుట్టుపూర్వోత్తరాలనూ విపులంగా చర్చించారు. "హీర్‌రాంఝా" కావ్యమును పరిచయం చేసివుంటే బాగుండేది. దాని రచయిత వారిస్ షాహ 1785 లో మరణించాడని చెప్పారు. కాని ఆయన 1798 లో మరణించినట్లు అకాడమీ గ్రంథం తెలుపుతున్నది. శతాధిక గ్రంథములు రచించిన భాయీ వీరసింహునిగూర్చి చెప్పినది చాల తక్కువ. ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా 24 సంపుటములు ఎంత స్థలమాక్రమిస్తాయో అంత విస్తారంగా రచనలు చేశాడాయన. నవలలు, కావ్యాలు, వ్యాఖ్యానాలు వ్రాశాడు. పంజాబీలో సగర్వంగా చెప్పుకోదగ్గ నవలా సాహిత్యం, నాటక సాహిత్యం లేవని ఖుష్వంత్‌సింగ్ వంటి ఆధునిక రచయితయే అంగీకరించాడు. ఆ విషయం యీ చరిత్ర చదివితే విశదంకాదు. బెంగాలీ, ఉర్దూ, తెలుగు సాహిత్యాలలో వలెనే పంజాబీలోకూడా కథానిక బాగా వృద్ధిచెందింది. ఆ ప్రస్తావన ఇచ్చుట లేదు. 'వార్' అనగా బొబ్బిలియుద్ధంవంటి వీరగాథ కావచ్చును అన్నారు. అంటే అనువాదకునికే ఇదమిత్థమని తెలియదన్నమాట. "కఠోర రాజకీయములు" అని ఒక ప్రయోగము చేశారు. బోధపడదు. గూఢవాదము అని వ్రాశారు. Mysticism కాబోలు. అమృతాప్రీతం లోకప్రియ కవయిత్రి అన్నారు. ఇది హిందీలో వాడుకలో ఉన్న ప్రయోగం.

కాశ్మీరీ సాహిత్య చరిత్ర, 64 పుటలు ఆక్రమించినది. ఇతర భారతీయ భాషల సాహిత్యాలతో పోల్చి చూస్తే కాశ్మీరీ సాహిత్యం తక్కువ. అయినా ఈ పుస్తకంలో కాశ్మీరీ సాహిత్య సంగ్రహమును రచించిన మూల రచయిత ఆ లోపం కన్పించకుండా సవిస్తరంగా వ్రాశారు. అయినా కాశ్మీరీ ఆధునిక వచన సాహిత్యం మూడు నాలుగు దశాబ్దాలనుంచి మాత్రమే ప్రాచుర్యంలో ఉండడంచేత ఈ ప్రక్రియలో వెలువడ్డ రచనలు చాల తక్కువ. కాబట్టే వచన వాఙ్మయమును గూర్చి మూడు పేజీలు మాత్రమే వ్రాశారు. ఈ సంగ్రహము తెలుగు అనువాదం పరవాలేదు, బాగానే ఉంది. ప్రసిద్ధ కవుల, కవయిత్రుల కవితలకు చాలా తెలుగు అనువాదాలిచ్చారు. కాని అవి ఎటూకాని పాడివచనంలో ఉన్నవి. ఏదో ఒక ఛందములో కాని, మాత్రా ఛందస్సులో కాని, లేదా వచన కవిత్వంరూపంలో కాని అనువదిస్తే వాటి కావ్యగుణం బాగా బోధపడేది. ఈ గ్రంథం చివరన ఏడు పేజీల తప్పొప్పుల పట్టిక ఇచ్చారు. ఆ పట్టికలో చేరని అచ్చు తప్పులు పుస్తకంలో ఇంకా అక్కడక్కడా ఉన్నాయి.

## అఖిలభారత కవయిత్రులు

[సంకలనము : శ్రీమతి పొటుకూరి లక్ష్మీకాన్తమ్మ. ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, హైదరాబాదు. వెల: 7 రూపాయలు.]

అఖిలభారత కవయిత్రులు అంటే— ఈ గ్రంథంలో భారతదేశంలో ప్రాచీన, మధ్య యుగములలో వర్ధిల్లిన కవయిత్రులు, రచయిత్రులనుగూర్చి, వారి రచనలనుగూర్చి భోగట్టా ఉన్నది. దీనిని అఖిల

భారతమహిళామహనీయసారస్వతము అన్నారు, ప్రచురణ కర్తలు. భారతీయ మహిళా కవితాసామ్రాజ్య చరిత్రమును సంపాదనమొనర్చి సంకలనం చేయడం సంకలనకర్త్రి చిరకాల ధ్యేయమట. ఈ సందర్భముగా ఆమెకు అకాడమీవారు అఖిల భారత పర్యటన మొసగినారట. ఎందుకో తెలియదు. ఎందుచేతనంటే ఇందులో ఆ యా భాషా సాహిత్యాలలో రచయిత్రులను గూర్చి ఆ యా భాషా ప్రాంతముల రచయితలనుండి వచ్చిన వ్యాసములను అనువదింపజేసి ప్రకటించడం మాత్రమే జరిగింది. పర్యటించి అధికంగా భోగట్టా ఏమైనా ఇచ్చారా అంటే అదిలేదు. పోస్టులో వ్యాసాలు తెప్పించి, ఇలాంటి సంకలనాలు తయారు చేయవచ్చు. వైదిక వాఙ్మయము—మహిళా మంత్రదర్శికులను గూర్చి ఆంధ్ర కవయిత్రులను గూర్చిన వ్యాసములు సంకలనకర్త్రి రచించారు. మొదటివ్యాసం ఉపన్యాస ధోరణిలో సాగినది. రెండవ వ్యాసంలో ఆంధ్ర కవయిత్రులనుగూర్చి వ్రాయదగినంత వ్రాయలేదు. ప్రాచీనాంధ్ర కవయిత్రులలో మొదట చానమ్మను పేర్కొంటూ, ఆమె ఏమివ్రాశారో చెప్పలేదుకాని ఎవరిభార్యో చెప్పారు. ఆశువుగా ఆమె చెప్పిన ఒక పద్యాన్నిమాత్రం ఉదహరించారు. ఉపమానాలు రచించడంలో గంగాదేవి, కాళిదాసునుకూడా మించిందన్నారు. మరి 'ఉపమాకాళిదాసస్య' అన్నారే? తాళ్లపాక తిమ్మక్క, మొల్లనుగూర్చి ఇచ్చిన వివరాలు, చేసిన విమర్శ స్వల్పముగా ఉన్నాయి. ఏవో ప్రశంసావాక్యాలు వ్రాశారు. ఒకచోట కృపాబాయి సత్యనాథన్ 'విద్యావతి' అనే నవల రచించారని మొదట చెప్పారు. ఆ తరువాత సీరము సుభద్రయాంబ స్త్రీలయందు ప్రప్రథమ నవలారచయిత్రి అన్నారు. ఆ నవల పేరేమిటో చెప్పారుకారు. ప్రథమ నవలారచయిత్రిని ప్రప్రథమంగా పేర్కొవాలికదా! ఒకరినిగూర్చి వ్రాయునప్పుడు వారి కొసగబడిన బహుమతినిగూర్చి వ్రాయక, మరొకరుపొందిన బహుమతిప్రసక్తి వచ్చినచోట వెనుకచెప్పబడినవారికికూడా అలాంటి బహుమతి వచ్చిందని చెప్పడం సంకలనకర్త్రి రచనలోని ఒక విశేషం. కనుపర్తి వరలక్ష్మమ్మగారినిగూర్చి వ్రాస్తూ, 'వీరు నిరంతర రేడియో ప్రాసంగికురాలు' అనివ్రాశారు. అంటే రేడియోలో వారికి ఉద్యోగమనికాదుగదా వారి భావం. ఆంధ్ర కవయిత్రులలో 19 వ శతాబ్దాంతము వరకుగల రచయిత్రులనుగూర్చి మాత్రమే వ్రాశారు. ప్రాచీన, మధ్యయుగ వాఙ్మయములు అని పరిమితి పెట్టుకోవడమే ఇందుకు కారణం. కాని వ్యాసకర్తలందరూ ఈ పరిమితికి లోబడివుండలేదు. 'పంజాబీరచయిత్రులు' అనేవ్యాసం అమృతాప్రీతం ప్రసక్తితో అరంభమైంది. మరి ఆమె జననం 1919. అంతకుపూర్వము పంజాబీలో కవయిత్రులు లేరన్నట్లు వ్యాసకర్త తేల్చివేశారు. నిజం చెప్పాలంటే పంజాబీ వ్యాసరచన తగిన పరిశోధకులకు అప్పగించలేదు. తొమ్మిది పేజీల వ్యాసంలో ఏడుగురు పంజాబీ రచయిత్రులను మాత్రమే ప్రస్తావించారు. ఒరియా వ్యాసం రచన విపులంగా సాగింది. కుంతలా కుమారి కావ్యములనుగూర్చి 16 పేజీల వ్యాసమే వ్రాసేశారు. గుజరాతీ వ్యాసంలో మీరాబాయి ప్రసక్తిరాగా, "ఆమె రాజస్థాన కవయిత్రి కదా!" అని సంకలనకర్త్రి 234 పుట దిగువన ఒక సందేహం వెలిబుచ్చారు. కాని ఆ ప్రక్క పుటలను వారు శ్రద్ధగా చదివివుంటే వారి సందేహనివృత్తి జరిగివుండేది. మీరాబాయి రచనలు హిందీలిపిలోనూ, గుజరాతీలిపిలోనూ ప్రచురితమై ఉభయప్రాంతములలోనూ వ్యాప్తిజెందినవి. మళయాళ కవయిత్రులు దాదాపు 30 మందినిగూర్చి విశదంగా వ్రాశారు. అట్లే తమిళ, కన్నడ, మహారాష్ట్ర, సంస్కృత, వంగ, సింధీ, హిందీ, కాశ్మీరీ, అస్సామీ రచయిత్రులనుగూర్చి తగువిధంగా వ్యాసాలు వ్రాయడం జరిగింది. ఉర్దూ కవయిత్రులను కొందరిని పేర్కొన్నారు కాని ఒక్కరి రచననైనా మచ్చుకైనా ఉదహరించి చూపలేదు. ఆంగ్లములో కవితల్లిన తొరూదత్, సరోజినీనాయుడుగారలను గూర్చి సంకలన కర్త్రి 6 పేజీల వ్యాసమొకటి వ్రాశారు. ఇది ఆమె వ్రాయకుండా వుండవలసింది. ఎవరైనా ఇంగ్లీషు ప్రొఫెసర్‌చేత వ్రాయించి అనువదించి ప్రకటిస్తే బాగుండేది. ప్రస్తుతం అకాడమీ కార్యదర్శిగా వున్న దేవులపల్లి రామానుజరావుగారు తొరూదత్‌నుగూర్చి మంచి వ్యాసమొకటి వెనుక ప్రకటించివున్నారు. దానిని చేర్చినా బాగుండేది. అంతో ఇంతో ఆంగ్లసాహిత్యం చదువుకున్నవారికి ఈ సంపుటిలోని ఈ వ్యాసం అసంతృప్తి కలిగించేదిగావుంది.

ఇక ఈ వ్యాసాల అనువాదమునుగూర్చి కొంత చెప్పవలసివున్నది. సంకలనకర్త్రి కొన్ని వ్యాసము

లను, ఆమె కుమార్తె కొన్ని వ్యాసములను అనువదించారు. తమిళవ్యాసాన్ని చల్లా రాధాకృష్ణశర్మ గారే స్వయంగా తెలుగులో చక్కగా వ్రాశారు. అట్లే ఒడియా వ్యాసమును పురిపండా అప్పలస్వామిగారు వ్రాయడమే తెలుగులో విశదంగా వ్రాశారు. గడియారం రామకృష్ణశర్మ, శ్రీమతి పి. యశోదారెడ్డి గారలు ఉర్దూ, హిందీ వ్యాసాలను అనువదించారు. అనువదింపబడ్డ వ్యాసముల నన్నిటినీ ఎవరైనా సరిచూచి దిద్దివుంటే బాగుండేదనిపిస్తున్నది. మశూచి ప్రసక్తి వచ్చినప్పుడు 'మాత' అని వ్రాశారు. తెలుగులో అమ్మవారు అని, వ్యవహరిస్తామన్నసంగతే గుర్తుకురాలేదు అనువదించిన వారికి! జానపద సాహిత్యాన్నిగూర్చిన భాగమును తెనిగిస్తూ "అది అనామధేయమును, వ్రాత మూలకముకానిదియునైయున్నది" అని వ్రాశారు !! ఇంకా కొన్నిచోట్ల క్రమంలేని వాక్యాలున్నాయి. తెనిగించినవారి తొందర కవి పరిపోవచ్చునేమోగాని చదువరులకు నచ్చవు; బోధపడవు.

గ్రంథముచివర కవయిత్రుల అనుక్రమణిక ఇవ్వడం బాగున్నది. ఆ తర్వాత 8 పేజీల తప్పొప్పుల పట్టిక వున్నది. వెనుకటిరోజులలో అచ్చుతప్పులులేని ఆంధ్రగ్రంథముండునా అనేవారు. ఇప్పుడు అచ్చుతప్పులులేని అకాడమీ గ్రంథం వుంటుందా అని అనుకోవాలి.

—వాణీకుమార.

## మహాభారతం

[రచన—విశ్వప్రసాద్, కిరణ్ కుమారి,నారాయణ రెడ్డి. ప్రకాశకులు : భగవాన్ పబ్లికేషన్స్, నెం. 6 ఎ, ఫస్టుస్ట్రీట్, అజీజ్ నగరు,మద్రాసు—24;వెల : ఐదు; రూపాయలు ; పుటలు 664.]

ఇది ముప్పురు నవరచయితలు (అందులో ఒక రచయిత్రికూడా ఉన్నది.) కలసి వ్యావహారిక భాషలో వ్రాసి ప్రకటించిన మహాభారతకథ. అచ్చు, తయారు, ముఖచిత్రం ఉత్తమంగా ఉన్నాయి. ఈ రోజుల్నిబట్టి 664 పుటల గ్రంథాన్ని అయిదు రూపాయలకు ఇవ్వడం కూడా ఫరవాలేదు.

'తింటే గారెలు తినాలి,వింటే భారతకథ వినాలి' అని మనదేశంలో మహాభారతకథకు అమితమైన గౌరవం ఉన్నది.ఈ గౌరవమే ఇదివరకు 199 డిటెక్టివ్ గ్రంథాలను ప్రకటించిన భగవాన్ పబ్లికేషన్స్‌వారిని ఈ పురాణకథవైపుకి లాగింది. ఈ రచయితలు గ్రంథాదిలో ఇట్లా చెప్పుకున్నారు.

"ఇది వ్యావహారిక భాషాయుగం. సులభమైన పద్ధతిలో, సున్నితమైన పదాలతో, అతిక్లిష్టమైన భావాలను సూక్ష్మసరళిలో పాఠకులకు వివరించడమే యీనాటి రచయితల కర్తవ్యం.

ఈ కర్తవ్యాన్ని దృష్టిలో వుంచుకుని—

అక్షరజ్ఞానం కలిగిన ప్రతివొక్కరూ చదివి అర్థంచేసుకునేట్లు యీ మహాభారతకథను నవలా రూపంగా రచించాము."

వ్యావహారికభాషలో గ్రంథరచనము చేయుట పురాతనమైన విషయమే. నాయకరాజుల కాలమున వాడుకభాషయందు వచనగ్రంథములు కొన్ని వెలసినవి. వాటిలో ముఖ్యములు రాయవాచకము. మధురమంగా పుంశ్చలీ విలాసమున్నా. ఆనాటినుండి తెలుగులో అనేక గ్రంథములు వాడుకభాషలో లబ్ధ ప్రతిష్ఠములైనవి వచ్చాయి.

మధురనాయక రాజులలో విజయరంగని క్రీశ. 1760—1734 కాలంలో ఆయన ఆస్థానకవి సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడు ప్రసిద్ధుడు. అతడు సారంగధర చరిత్ర, జైమినిభారతమును, గ్రాంథిక భాషలో వచనగ్రంథములుగా వ్రాశాడు. ఆ జైమిని భారతం నేటికీ ఆదరణలో ఉన్నది. ఆయనకు సమకాలికుడైన కుందుర్తి వెంకటాచలపతి భారత రామాయణాల్ని మొట్టమొదటిసారిగా వచన గ్రంథాలు (గ్రాంథికంలో) గా వెలయించాడు. ఆయన గ్రంథాలు ఇప్పటివరకూ ప్రకటింపబడలేదు. ఇతరులువ్రాసిన

దానినిబట్టి అవి సులభశైలిలో సలక్షణములై ఉన్నాయనీ—ఆ రోజుల్లో జనాదరణ పొందాయనీ తెలుస్తున్నది. తంజావూరు సాహిత్యంవలె కాక, మధురలో వెలసిన ఆంధ్రసాహిత్యం రాజుల అహంప్రత్యయ స్పర్శ లేనిదై రాణించుటచేత కుందుర్తివారి 'భారతవచనం' గొప్పదేనని భావించుకోవలసి వస్తున్నది.

మైసూరు రాజ్యమునందుంటూ ప్రఖ్యాతుడైన కళువె వీరరాజు భారతాన్ని (18 శతాబ్దం పూర్వార్ధం) వచనంలో వ్రాశాడు. ఈయన గ్రంథంలో సభాభీష్మపర్వాలు మాత్రమే లభిస్తున్నాయి. ఈ గ్రంథం ఉత్తమమైనదని కీర్తిగడించింది.

భారత వచన సందర్భంలో నిత్యస్మరణీయులు దేవరాజసుధీ, శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారున్నూ. ఇటీవల గ్రాంథిక వచనంలో శ్రీ ఆకొండి వెంకటశాస్త్రిగారి భారత వచనమున్నూ జనరంజకత్వం పొందింది.

వ్యావహారిక వచనంలో శ్రీ పురిపండా అప్పలస్వామివారి రచనా, శ్రీశ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచనా వచ్చాయి.

ఇన్ని గ్రంథాలు వచ్చినా, ఈ సరికొత్త గ్రంథానికి కూడా సావకాశం ఉండనే ఉన్నది.

తీసుకున్న కథావస్తువు ఒక ప్రఖ్యాత ఇతిహాస వృత్తాంతం కావడంవల్లా, అది బహు విస్తృతమైనది కావడంవల్లా, అందులో విడచిపెట్టరాని అనేక ఉపాఖ్యానాలు ఉండటంవల్లా—ఆరు పురుషాంతరాల (శంతన, భీష్మ, ధృతరాష్ట్ర, పాండవ, పరీక్షిత్, జనమేజయ) కథా కథనం చెయ్యవలసి ఉండటంవల్లనూ—ఈ గ్రంథానికి ఏకదేశమైన 'నవలాశిల్పం' పట్టలేదు. ఇంత పెద్ద కథను ఒక నవలగా రచించడం కూడా అలవికానిపనే. రచయితలు అనుకొన్నట్లు ఇది నవలగా రూపొందలేదు. ఇది భారతకథగానే పరిణమించింది. అదే ఆ కథలో ప్రత్యేకత.

కథను గురించి చెప్పవలసినది ఏమీలేదు. అది ప్రఖ్యాతమైనదే గనుక. అవసరాన్ని బట్టి—చిన్న చిన్న కథలు తగ్గించి దీన్ని రూపొందించడం జరిగింది. ఈ తగ్గించడమనేది కొన్నిచోట్ల మరీ ఎక్కువగా జరిగింది. అందుచేత కథకూడా దెబ్బతిన్నది. ఈ గ్రంథంలో ఆదిపర్వంలోని కథను 379 పుటలలోనూ, సభాపర్వంలోని కథను 53 పుటలలోనూ, ఆరణ్యపర్వంలోని కథను 100 పుటలలోనూ, విరాట ఉద్యోగపర్వాల కథను 76 పుటలలోనూ సరిపుచ్చారు. మిగిలిన 55 పుటలలో మిగిలిన భారతమంతా కుదించారు. దీనిని బట్టే ప్రారంభదశ మినహాయిస్తే మిగిలిన భాగమంతా న్యాయమైనంత కథనాన్ని పొందలేకపోయిందని బయటపడుతున్నది. ఆది సభా పర్వాలలో కథాగమనం సాఫీగానే జరిగింది. ఆ తరువాత తెచ్చిపెట్టుకున్న మదింపు సమస్యవల్ల—కుంటుపడింది.

భాష వ్యావహారికంగా చెప్పుతున్నారు. వ్యావహారిక మంటే శాబ్దిక స్వరూపం మాత్రమేకాదనీ—అభివ్యక్తీకరణ పద్ధతిలోకూడా వాడుకలో ఉన్న పద్ధతి ఉండాలనీ ఈ రచయితలు గమనించినట్లు లేదు. "శ్రీమంతమైన హస్తినాపురం", "పాపిష్ఠ జన్ముడు", "శిష్టజన విశిష్టం" వంటివి అభివ్యక్తీకరణంలో వ్యావహారికానికి చెందవు.

వంగదేశంనుంచి మనకు దిగుమతి అయిన 'గురుదేవ' శబ్దాన్ని ఈ గ్రంథంలో చాలాసార్లు ఉపయోగించారు. ఈ శబ్దములో దోషం ఉన్నదనీ తెలుగువాళ్లు అధ్యారోపించుకుంటున్న అర్థం దానిలో సాధించడం కష్టమనీ వీరు గ్రహించినట్లులేదు. ఈ రచయితలకు ఇష్టమైన శబ్దం ఇంకోటి మందారం. ప్రభుమందారుడని(శ్రేష్ఠ వాచకంగా) పుత్రమందారుడనీ ఇక్కడా శ్రేష్ఠ వాచకంగానే) ఉపయోగించారు. ఇవి శబ్దార్థం తెలిసి చేసిన ప్రయోగాలు కావు.

గరుత్మంతుని కథలో ఒకచోట ఇట్లా ఉన్నది. "మనస్సులో తల్లితండ్రులను ధ్యానించుకుని, వాళ్ల ఆర్భాటాలకు చిన్నగా నవ్వుకుని" వాళ్ల ఆర్భాటాలంటే ఈ వాక్యంవల్ల తల్లితండ్రుల ఆర్భాటాలని ద్యోతమానం అవుతున్నది. కాని నిజానికి ఎదురుగా ఉన్న శత్రువుల ఆర్భాటాలకు. ఇది వాక్య నిర్మాణంలో ఉన్న దోషం. ఇటువంటి దోషాలు ఎక్కువగానే ఉన్నాయి. ఈ దోషాలు కథాగమనాన్ని అరికట్టకపోవడమనే గుణం మాత్రం ఉన్నది.

శౌనకాది మహామునులకు సూతుడు భారత కథ విన్పిస్తున్నాడు. (పుట 78.) కొంత వివరించగానే శౌనకాదులకు కొన్ని ప్రశ్నలుద్భవించాయి. సూతుణ్ణి పృచ్ఛించారు. వాళ్లు సూతుని శిష్యులుగా ఈ గ్రంథంలో వ్రాయబడింది. ఇది సరిగాదు

వాళ్లున్నా మహర్షులే. తత్కాలంలో సభాసదులుగా ఉన్నారు. పారిషదులుగాని శిష్యులుకారు.

జనమేజయుణ్ణి పాండవ పౌత్రుడని (పుట 80) వ్రాశారు. ఇది సరిగాదు. జనమేజయుడు పాండవ ప్రపౌత్రుడు. అతని తండ్రి పరీక్షిత్తు పాండవులకు పౌత్రుడవుతాడు.

వ్యావహారిక వాతావరణం కోసం సూతుని చేత శౌనకాది మహర్షుల్ని "విన్నారుగా నాయనా!" అని సంబోధింపజేశారు. ఇది అనుచితంగా ఉన్నది.

కొన్ని వాక్యాలు అన్వయ విరుద్ధంగా ఉన్నాయి. "భీమసేనుడు వ్యాసునితోకూడా కొనియాడబడిన హిడింబిని ధర్మపత్నినిగా పరిగ్రహించాడు." (పుట 291). ఇక్కడ రచయితల అభిప్రాయం "వ్యాసునిచేత కూడా" అని. తప్పు విభక్తి ప్రత్యయం ఉపయోగించడం వల్ల వ్యావహారికమే కాకుండాపోయింది.

యుద్ధ ఘట్టాలలో రచన తగినంత బిగువుగా సాగలేదు. అందుచేత అక్కడ కథకు బలహీనత ఏర్పడ్డది.

గీతోపదేశ ఘట్టం—సంక్షేపంగా నిర్వహింప బడినది. తిక్కనగారి మార్గాన్ని అనుసరించి గీతా సారాన్ని అనువాదం చేసి ఉంటే ఇంకా రమణీయంగా ఉండేది.

మొత్తము మీద గ్రంథం ఆదరింపబడవలసి నట్లుగానే ఉన్నది. డిటెక్టివ్ గ్రంథాలతో ప్రకాశిస్తున్న ఈ ప్రకాశకులు భారతంపైన మోజు పడటం, దాన్ని ఉత్తమ సాహిత్య స్థాయిలో వెలువరించడానికి మంచి ప్రయత్నముచేయడమూ—హర్షించతగినవి.

ఈ యువరచయితలు మున్ముందు ఇంకా మంచిమంచి గ్రంథాలు వ్యావహారిక భాషలో సాహిత్య భావుకులకు అందిస్తారనీ ఈ ప్రకాశకులు సాహిత్యంలో నిలువగల గ్రంథాలను ప్రకటిస్తూ ఉత్తమ స్థానాన్ని నిర్మించుకుంటారనీ ఆశిద్దాము.

—"శ్రీ పాదుక"

### శ్రీ రామ స్తో త్రా వ ళి

రామప్రాతఃస్మరణం, శ్రీరామ ప్రేమాష్టకం, శ్రీ రామచంద్రాష్టకం, అహల్యాస్తవం, శ్రీరామస్తుతి, ఇంద్రకృత శ్రీరామస్తోత్రం, బ్రహ్మదేవకృత శ్రీరామ స్తుతి, జటాయుకృత శ్రీ రామస్తుతి, చూర్ణిక, శ్రీరామ చంద్రాష్టకం—కల సంపుటి. స్తోత్రాల తెలుగు అనువాదం : శ్రీ పురాణ పండ రామమూర్తి. పుటలు : 50. వెల : 0—25. ప్రాప్తిస్థానం : శ్రీ పి. రాధాకృష్ణమూర్తి, అధ్యాత్మ ప్రచారకసంఘం, విక్రమహాలు, రాజమండ్రి.

### శ్రీ హనుమద్వ్యాఖ్యానామృతము

హనుమచ్చరిత సహితం. పాకెట్ సైజు. పుటలు: 34. వెల : తెలియదు. ప్రాప్తిస్థానం : శ్రీ ధనకుధరం లక్ష్మీనరసింహాచార్యులు, శ్రీవాణీ గ్రంథమాల, తెనాలి.

### నివాళి (గేయమాలిక)

రచయిత : శ్రీ ఉండవల్లి సీతారామస్వామి. ప్రతులకు శ్రీ ఉండవల్లి హేమసుందర్, రాయపేట, నర్సాపురము, పశ్చిమగోదావరిజిల్లా. వెల: 50 పైసలు.

### (1) అనంతం (కథానిక)
### (2) ఏ ది ని జ ం
### (సాం ఘి క నా టి క)

రచన వాణిశ్రీ. శ్రీ సి. వి. రెడ్డి. వెల తెలియదు. అడ్రసు లేదు.

### జ ల జ

గేయకవితల సంపుటి. సంపాదకురాలు శ్రీమతి కాట్రగడ్డ ప్రమీలారాణి. అడ్రసు : స్నేహపీఠం, అమీనాపేట, ఏలూరు.

### గబ్బిలాలు (నాటికలు)

గ్రంథకర్త : శ్రీ కె. ఆర్. కె. మోహన్. ఇందులో రెండునాటికలు ఉన్నాయి. (1) గబ్బిలాలు (2) స్వయంకృతం. వెల : రూపాయి. శ్రీముఖ పబ్లికేషన్స్, మచిలీపట్నంవారు దీనిని ప్రచురించారు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.